
WELCOME....
ఈ విశాల విశాఖ నగరంలో అతి తక్కువ
వ్యవధిలో మీ ఆదరాభిమానాలు చూరగొన్న
మేము మీ అందరి సౌకర్యార్థమై మా
షోరూం పైభాగమున ప్రత్యేక జెంట్స్ ఎ.సి
విభాగం ప్రారంభించాం. మాకు మునుపటి
యథావిధి ప్రోత్సాహ,
సహకారములుండగలవని ఆశిస్తూ
చందన బ్రదర్స్
(A.C)
లేడీస్ & జంట్స్ క్లాత్ షోరూమ్
జగదాంబ సెంటర్
విశాఖపట్నం
HANDU

# చతుర

సంపుటి: 9 డిసెంబర్ 1986 సంచిక: 11

## ఈ నెల సమగ్ర నవల

ఒకరోజు-

"మౌనం, నిరాడంబరత స్త్రీలకెంత గాంభీర్యాన్ని సంతరించి పెడతాయో ఆమెని చూస్తుంటే తెలిసి వస్తుంది. నన్ను కలవరపర్చేది ఒకటే! ఆమె కన్నుల్లో ప్రతిఫలించే నిర్లిప్తత!"

మరో రోజు-

"నేనుచేసిన మౌననివేదిన ఆమె హృదయాన్ని తాకినట్టుంది. ఇంతకాలానికి నా బాధ, తపన, ఆరాటం, ఆర్తి, నా తపస్సు ఆమెకు అర్థమయ్యాయి....

...ఆమెకు నేనూ అర్థమయ్యాను.

అది చాలు. ఇక ఆమె నాగురించి ఆలోచిస్తుందన్న ఊహే ఊరడింపుగా మిగిలింది. నాకు జవాబేమీ చెప్పకుండానే విడిపోయింది. అయినా శరత్కాలపు నదీప్రవాహంలోని తేటదనాన్ని ప్రతిఫలించే ఆమె చిరునవ్వు నాకు పరిచితమైంది. ఆ నవ్వుకోసమే బ్రతుకుతున్నానా అన్పించేంత గాఢంగా అది నా హృదయాన్ని పూరడించి సేదతీర్చేది" అంటూ ఆమె గురించి తన మనసున కదిలేభావాలకు అక్షరరూపం కల్పించాడా యువకుడు. అతని ఆరాధనకు ఆమెకూడా ప్రతిస్పందించినప్పుడు అది ప్రేమగా పరిణమించేందుకు ఎంతకాలం కావాలి? అలాంటి ఆ ప్రేమకథకు కూడా....

# ముగింపు

వుంటుందా? వారి ఆశలకీ, వూహలకీ అది అనుగుణంగానే వుంటుందా?

## మంజీర

లేఖినినుంచి మృదుమధుర కథనంతో జాలువారిన ప్రేమగాథ 'ముగింపు' ఈ నెల చతుర సమగ్ర నవల!

---

కవరుపేజీ ఫోటో గ్రాఫరు: జగ్‌మోహన్



# ఇలాంటి టీవీ సెట్టును మరెవ్వరూ యివ్వలేరు

ఎంతో ధైర్యంతో, నమ్మకంతో చెప్పే మాట యిది.

అలా చెప్పే తాహతు ఈసి-టీవీ.కి ఉంది గనకే చెప్పగలం యిలా ఖచ్చితంగా.

తెలుసు మాకు—మేం చేసే ప్రతి ఈసి-టీవీ, సాంకేతిక పరిజ్ఞానంలో, పనిచేసే ఆ లక్షణంలో సంపూర్ణతని అందుకున్న ఒక మచ్చుతునక గనక.

మరి మా సెట్లు, అన్ని చోట్లనుంచి తీసుకొచ్చిన అనేకమైన పార్టులను ఒకచోట సమకూర్చి తయారుచేసిన బాపతు కాదు. ఈసి-టీవీ.క్ స్క్రూడ్రయివర్ టెక్నాలజీకీ పొత్తు కుదరదు

టీవీ తయారు చేసే యితరులైతే సేవా సౌకర్యాల్ని గురించి చెబుతారు ఎంతెంతో, అంతకన్న మరేం చెయ్యరు నిజానికి—కాని ఈసి.టీవీ.లో చెప్పింది చేసి చూపిస్తాం మరి.

ఒక్కసారి ఆలోచించి చూడండిక.

భారత దేశపు పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకుని భారత దేశంలో ప్రత్యేకంగా డిజైను చేసిన టీవీ పైన మీ నమ్మకాన్ని పూర్తిగా ఉంచుతారు గదా మీరు, అవునుగదా?

భారత దేశంలో యిప్పుడి దాకా అంటే యిప్పుడికే 3 లక్షలకన్న ఎక్కువ కుటుంబాలు వాడుతూన్న టీవీ సెట్టు పైన మీరు మీ నమ్మకాన్ని పూర్తిగా వుంచుతారుగదా, అంతేగదా ?

నిజంగా అంతే—ఈసి-టీవీ కేవలం మరొక టీవీ సెట్టులెండి అని కొట్టిపారెయ్యలేరిక—మించినదది ఎంతెంతో.

ఎందుకంటారా, గత పదిహేనేళ్ళుగా ఈసిఐఎల్ వాళ్ళేగదా భారతదేశంలో అసలు టీవీ టెక్నాలజీని ప్రవేశపెట్టి, ముందంజ వేసినవారు ? కలర్‌లోనూ, బ్లేక్ అండ్ వైట్ టీవీ ల శ్రేణిలోనూ ఒక ఉత్కృష్టమైన స్థాయీ, స్థానాన్ని తెచ్చింది వీరేగదా ? పేటీపెట్టని తీరులో ఏళ్ళ కేళ్ళుగా మీ టీవీ పనిచేస్తున్నది అందుకేగదా ?

దీన్లో ప్రతి పార్టుకీ, ప్రతి సర్క్యూట్‌కి, ప్రతి విడి భాగానికీ సరియైన మేళవింపు వుంది—దాంతో ఎలక్ట్రానిక్ టెక్నాలజీలో విస్మయమైన సంపూర్ణ సమగ్ర చిత్రం రూపొందుతుంది. దాంతో అత్యంత స్పష్టమైన సొంపైన చిత్రాలు కనిపిస్తాయి. అత్యంత శ్రావ్యమైన, యింపైన ధ్వని. మీకు ఎప్పుడూ యిబ్బంది పెట్టకుండా పనిచెయ్యడం.

అంతేకాదు, ప్రతి ఈ.సి.టీవీ సెట్టు వెనకా దేశ మంతటా విస్తరించివున్న అత్యంత సమర్థవంతమైన సేవా సౌకర్యాలున్నాయి. ప్రత్యేకమైన 30 ఈ.సి.టీవీ కేంద్రాలు. 400 మంది నమ్మకమైన డీలర్లు. మరంటే మీరొక్క ఫోన్ కాల్ కొడితే చాలు—అంతే.

మీకింకా ఏమేం యిస్తామో తెలుసుకోవాలని వుంది కదూ, మీ ఈ.సి.టీవీ డీలర్‌ని కలుసుకోండి. తెలుస్తుందప్పుడు మీకిక యీ చెప్పిందంతా పొల్లుబోదనీ, మేం, అంటే ఈ.సి.టీవీ మాట నిలబెట్టుకుంటుందనీను.

# చతుర కతలు

## ఆబ్సెంట్

బాబ్జిని చదివించటం బాబ్జీ అమ్మా, నాన్నలకి ఓ ఛాలెంజ్ అయింది. ఏడేళ్ళ బాబ్జీ బడికి బాగానే వెళ్ళొస్తాడు. స్కూల్లో బుద్ధిమంతుడైన విద్యార్థిగా టీచర్ల దగ్గర మంచి పేరుకూడా కొట్టేశాడు. కాని ఇంట్లో పుస్తకం ముట్టుకుంటే ఒట్టు!

అమ్మానాన్నలు బాబ్జీని బుజ్జగించి చదివించబోతే "ఆకలేస్తోంద"ని గొణుగుతాడు.

ఏదన్నా తినిపించి కూర్చోబెడితే "నిద్రొస్తోంద"ని మారాంచేస్తాడు.

వాడి చేష్టలకి కోపమొచ్చి పొరపాటున కసిరితే, ఇక అంతే! ఒక పట్టాన ఆపకుండా రాగం తీస్తాడు. వాడి ఏడుపుని ఆపేందుకు ముప్పుతిప్పలుపడి నీరసం తెచ్చుకోవలసిందే ఆ కసిరినవాళ్ళు.

వాడికి చదువు చెప్పటంలో ఉద్దండులైన ప్రైవేటు మాస్టర్లు సైతం విఫలమయ్యారు.

సెలవుల్లో అక్కగారింటికి వచ్చిన రాజు చెవికి బాబ్జీ సమస్య చేరింది.

"మావయ్యా, మావయ్యా!" అని వెంటే తిరుగుతూ రాజుని వచ్చినప్ప





ఉషాకిరణ్ మూవీస్
పూజకు
పనికిరాని పువ్వు
నిర్మాత
రామోజీరావు
స్క్రీన్‌ప్లే · దర్శకత్వం
ఎ. మోహనగాంధి
కాశీవిశ్వనాథ్
సంగీతం: చక్రవర్తి
కెమెరా: డి. ప్రసాద్‌బాబు
గౌతంరాజు
బాస్కరరాజు
నృత్యం: శేషు
నిర్వహణ: అట్లూరి రామారావు

ట్నుంచీ వదలటంలేదు బాబీ.

సైకాలజీ పుస్తకాలు ఎక్కువగా పఠించే రాజు, తను చేసిన అధ్యయనాన్ని అమల్లో పెట్టి విజయగర్వంతో అక్కా, బావల అభినందనలు పొందాలనుకున్నాడు. తిన్నగా బాబీనే ఆ మాటడిగితే ఏం చెబుతాడో చూద్దామనుకుని, "ఏరా బాబీ! ఇంట్లో చక్కగా చదువుకోమంటే వినకుండా అల్లరి చేస్తున్నావంట ఏమిటి?" అనడిగాడు రాజు.

"స్కూల్లో ఎలాగూ ఆడుకోనివ్వరు. ఇంటికొచ్చాకైనా ఆడుకోనివ్వకుండా చదువుకోమంటే ఎవడు వింటాడు?" అన్నాడు బాబీ నొసలు చిట్లించి.

చిన్నవాడైనా వాడి వాదనలో సబబున్నమాట నిజం. కాని ఇప్పట్నుంచే వాడిని పుస్తకాల పురుగునిచేసే తప్ప పెద్దయ్యాకవాడు ఐయ్యేయస్ చేసేందుకు పునాదిపడదని అక్కా బావల తాపత్రయం.

రాజుకి ఏదో ఆలోచన మెరిసి, "సరే.. మనం ఆడుకుందామా?" అన్నాడు.

"ఓ! హీరో, విలన్ ఆట బావుంటుంది. నీకువచ్చా?" అన్నాడు బాబీ ఉత్సాహంగా.

'వీడు నా ప్లాన్‌నే దారి మళ్ళించేలా వున్నాడే ధడవ!' అనుకుని "నువ్వు చెప్పిన ఆట నాకు రాదే!' అన్నాడు రాజు బిక్కమొహంపెట్టి.

"నీకెలావస్తుందిలే! ఈ కొత్త ఆట నేను కనిపెట్టిందేగా! ఎలా ఆడాలో నేనే చెబుతాను" అంటూ ప్రారంభించ బోయాడు బాబీ.

ఆ మాటల్నిబట్టి ఇప్పటి పిల్లలు ఎంత ఫాస్టో గ్రహించి ముచ్చటపడ్డా, తన చిట్కాను మదిలో వుంచుకుని

"ఊహూఁ...అదేం వద్దులే! ఈసారికి నాకు నచ్చిన ఆట ఆడదామేం?" అన్నాడు రాజు.

అదే తోటిపిల్లలైతే బాబీ వాదించి తన మాటే నెగ్గించుకునేవాడు. ఇతరులు చెప్పిన ఆటను 'నేను ఆడను పొ'మ్మనేవాడు.

కాని ఇప్పుడు పార్టనర్ కొత్తవాడూ, తన మావయ్య రాజే అయివుండటంతో "సరే చెప్పు...ఏం ఆట?" అనడిగాడు.

"బడి ఆట ఆడదాం! ఇందులో నేను మాస్టర్ని, నువ్వు స్టూడెంటువి" అన్నాడు రాజు.

"అయితే నేను ఈరోజు 'ఆబ్సెంట్' అనుకో!" అంటూ వీధిలో వెళుతున్న తన నేస్తాన్ని కలుసుకునేందుకు అక్కణ్నించి పరిగెత్తాడు బాబీ!

— జాకీ

# ఆకలి

కాలేజీ వార్షికోత్సవాలలో ప్రదర్శించటానికి మాలో కొందరు విద్యార్థులం కలసి ఒక నాటకానికి ప్రిపేర్ అయ్యాం. ఆ నాటకంలో నేను హీరో. తగినన్ని రిహార్సల్సు పడనందున ఆ నాటకం ప్రదర్శించే రోజున ఉదయంనుంచీ కాలేజీలోని ఒక గదిలో వరుసగా రిహార్సల్సు జరిగాయి.

రిహార్సల్సు కారణంగా ఆ నాటకంలోని పాత్రధారులకూ, డైరెక్టరుకీ, ఇతర సిబ్బందికీ ఆరోజు ఉదయం భోజనంచేసే వీలుకలుగలేదు. ఇక ఆ పూటకి ఎలాగో కాఫీతాగి సరిపెట్టుకుని, రాత్రి నాటకం అయ్యాక ఇంటికివెళ్ళి భోజనం చేయటానికి నిశ్చయించుకున్నాము. అందరికీ చాలా ఆకలిగావుంది.

నాటకంలో ఒక సన్నివేశంలో కావాల్సి వుండి ఒక కిలో గ్రాము లడ్డూలు ముందుగానే కొని జాగ్రత్తచేసి వుంచాము. ఆ

లడ్డూల పొట్లం నోరూరిస్తున్నా, రాత్రి నాటకంలో వాటి అవసరం వుండటంవల్ల ఆ లడ్డూలను తినటానికి మాలో ఎవరూ సాహసించలేదు.

రాత్రి ఎనిమిది గంటలకు మా నాటక ప్రదర్శన ప్రారంభమయ్యింది. ఆ నాటకంలో హీరో కాబోయే అత్తవారింట్లో అతిథిగాచేరి, కమ్మనికలలుకంటూ అత్త వారి విందులు ఆరగిస్తూవుంటాడు.

ఆరోజు హీరోయిన్ పుట్టినరోజు. ఆ ఇంటినౌకరు, "అమ్మాయిగారు స్వయంగా చేశారండీ" అంటూ పళ్లెంనిండా లడ్లు తీసుకొచ్చి హీరోకి, హీరోయిన్ తండ్రికి ఆఫర్ చేస్తాడు.

నాటకం స్క్రిప్టు ప్రకారం హీరోనైన నేను మొహమాటపడుతూ ఒక్క లడ్డుమాత్రం తీసుకున్నాను.

హీరోయిన్ తండ్రి ఓ లడ్డు రుచిచూసి "అమ్మాయి చేసిన లడ్లు అమృతంలా వున్నాయి" అంటూ వచ్చిన అవకాశం పాడుచేసుకోలేక మరో నాలుగు లాగించాడు.

హీరోయిన్ తండ్రి ధోరణిని గమనించిన నౌకరు పాత్రధారి, "మరి అమ్మాయిగారి చేతివంట అంటే ఏంటను కున్నారు?" అంటూ అమ్మాయి పాక శాస్త్ర ప్రావీణ్యాన్ని మెచ్చుకుంటూ తనో నాలుగు లడ్లు లాగించాడు. నిజానికి ఇవేమీ నాటకం డైలాగ్స్‌లోలేవు.

ప్రాంప్టర్ ఇది గమనించి, "ఒరేయ్.. వెధవ డైలాగులూ మీరూనూ! అవకాశం వచ్చిందికదాని ఆడియన్సుని ముందెట్టు కుని పబ్లిగ్గా ఆ లడ్లన్నీ ఆరగించెయ్యకండి" అంటూ తెరవెనుకనుంచి గోల మొదలుపెట్టాడు.

అయినా వాడి గోలను తెరముందు పాత్రధారులెవ్వరూ పట్టించుకోలేదు.

"ఒరేయ్... అసలే నీఆరోగ్యం మంచిది కాదు. తేరగా దొరికాయని అతిగా తినకు" అంటూ నౌకరు చేతిలోని పళ్ళెం తాను తీసుకోబోయాడు హీరోయిన్ తండ్రి.

"బాబుగారూ! మిమ్మల్ని ఇక తిన నివ్వను! ఇప్పటికే అయిదు లడ్డూలు తిన్నారు. అసలే మీకు చక్కెర వ్యాధి. మీరిన్ని లడ్డూలు తిన్నట్లుగాని తెలిస్తే అమ్మాయిగారు నన్నిక బతకనివ్వరు" అంటూ పళ్ళెం వెనక్కి తీసుకున్నాడు నౌకరు.

"పోనీలెండి....మీ ఇద్దరికీ సరిపడక పోతే నేనున్నాగా! నా ఆరోగ్యం ఎంతో బాగుంది. నాకు షుగరూ గిగరూలేదు" అంటూ ముందుకి ఉరికి లాఘవంగా మరో నాలుగు లడ్డూలు దక్కించు కున్నాను నేను.

పళ్ళెం ఖాళీ కాబోతోంది. ఇది గమ నించి తెరవెనుకనుంచి మా బావమరది పాత్రధారి హఠాత్తుగా స్టేజీమీదకి వచ్చి, "నిన్ను అక్కయ్య అర్జంటుగా రమ్మం టోంది" అంటూ పళ్లెంతో సహా నౌకరుని తెరవెనక్కి తీసుకుపోయాడు.

తెరవెనకాల డైరెక్టరు, ప్రాంప్టరు, మిగిలిన పాత్రధారులు పళ్ళెంలో మిగిలిన లడ్డూలకోసం కుస్తీపడుతున్నారు. లడ్డూలు తిని, గ్లాసుడు మంచినీళ్ళు తాగి తరువాతి డైలాగు గుర్తు చేసుకోబోయా న్నేను.

జ్ఞాపకం రాలేదు.

నాటకం ఆగిపోయింది.

ఏంచేయాలో తెలియక కర్టెన్‌లాగే శారు మావాళ్లు!

—వక్కలంక రామారావు

# 'దోషి' నవలపై చతుర సమీక్షలు

**అక్టోబరు 'చతుర' నవల 'దోషి...?' పై పాఠకుల నుంచి మాకు అందిన 'చతుర సమీక్ష' లలో ఉత్తమంగా వున్న మూడింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు! బహుమతులు పొందిన ముగ్గురికి మా అభినందనలు!**

## లక్ష్యం మంచిదేగానీ...

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

ఏ రచయితకైనా నవల వ్రాయడానికి ఓ ప్రేరణ ఆపైన ఓ లక్ష్యం వుంటుంది. మానభంగాలకు గురైన వాళ్లను చెడిపోయి కుళ్ళిపోయిన పనికిమాలిన వాళ్ళుగా చూడటం సరైందికాదు, అని చెప్పడం అలాంటిదే. రచయిత మాటల్లోనే చెప్పాలంటే "కాలికో వేలికో దెబ్బ తగిలితే డాక్టరు దగ్గర కెళ్లడం లేదూ? ఇదీ అంతే! ఎటొచ్చీ గాయం తగలకూడని చోట తగిలింది, అంతే!" సమాజ స్వభావం ఈ ఆలోచనా ధోరణికి మారిన్నాడే బాధితులు తమకు జరిగిన అన్యాయాన్ని ఎలుగెత్తిచాటి న్యాయం కోసం పోరాడగలుగుతారు. నేరస్థులు సునాయాసంగా తప్పించుకోలేరు. ఈ దృష్ట్యా లక్ష్యం ఉన్నతమైందే. అయితే అందుకు ఆయన చేసిన రచన మాత్రం.అసహజంగా సాగింది.

కృష్ణ సుజాతలు పెండ్లి వాయిదా వేసుకొని చాటుమాటు లేకుండా షికార్లు కొట్టడానికి పెద్దల పర్మిషన్ తీసుకోవాలనుకుంటారు.

తండ్రి చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతుంటే ఇంటర్వ్యూ జరుగుతున్న ఆఫీసుకొచ్చి సుజాత కృష్ణతో సరాగాలాడ్డం అలావుంచి... ఆఫీసు బయట వేచి చూస్తున్న కృష్ణ బైటకొచ్చిన సుశీలతో ఆవిడ తండ్రి అనారోగ్యం గురించి ఎందుకు చెప్పడు? తనపై సుశీలకు అపోహ ఏర్పడాలి కాబట్టా?

మరీ దారుణం! ఎంతోకాలం కృష్ణతో సన్నిహితంగా మసిలిన సుజాత అతను సుశీలపై అత్యాచారం జరిపాడంటే నమ్మేస్తుంది! అతన్ని కలుసుకుని నిజం తెలుసుకునే ప్రయత్నమైనా చెయ్యదు.

కోర్టులో కృష్ణను నేరస్థుడుగా నిర్ధారించడానికి చూపిన సాక్ష్యాలలో కృష్ణ సుశీలను అదే పనిగా చూడటం, బట్టలుతుక్కొంటూ కృష్ణ పోలీసుల కళ్ళబడటం ముఖ్యమైనవి. ఈలెక్కన దేశంలో శిక్షలు పడకుండా మిగిలే వాళ్ళుండరేమో!

ఓ చోట రచయిత "ఈతరం వారు మనసులకు మమతలకు పెద్దపీట వేస్తున్నారు" అన్న అభిప్రాయం వెలిబుచ్చుతారు. ఇది వాస్తవ విరుద్ధం. ఈనాడు ఆస్థి అంతస్తులకే పట్టం. నవలలోని పాత్రల చిత్రణ సరిగా లేదు. అవకాశం చిక్కితే రేప్ చేసేవాడో వ్యాధిగ్రస్తుడైన జంతువు. వాడి ప్రవర్తనెప్పుడూ అందుకు తగ్గట్టుగానే వుంటుంది. రవీంద్ర అంతరాత్మ ప్రభోదంతో సుశీలను పెళ్ళాడ్డం, ఆదర్శ దాంపత్యం నెరపటం, మరలా సుజాతపై అత్యాచారం జరపాలనుకోవడం, చివరలో కృష్ణకు నేస్తమైపోవడం, ఏమిటిదంతా?

కూతురు కోర్టుకెక్కేసరికి గుండె జబ్బు తండ్రి గుండె కాస్తా గట్టిపడిపోయినట్లుంది. కూతురికి ఉద్యోగం వస్తేతప్ప జరుగుబాటుండదనుకొన్న ఆర్థిక పరిస్థితి దానంతటదే చక్కబడిపోయినట్లుంది.

ఏమైనా ప్రస్తుతం వస్తున్న సాహిత్యం, సినిమాలతో పోల్చితే నవలగురించి సంతృప్తిపడొచ్చు! ఉన్నంతలో, మంచిదనుకోవాల్సిందే.

—**వి.వి.నరసమ్మ** విజయవాడ

## ఇతివృత్తం బాగుంది.

(ద్వితీయ బహుమతి రు: 75/— పొందిన సమీక్ష)

ఈ నెల నవల 'దోషి'కి రచయిత ఎన్నుకొన్న ఇతివృత్తం బాగున్నది. మానభంగానికిగురైన స్త్రీ న్యాయంకోరితే ఈ సమాజం ఎలా ప్రవర్తిస్తుందో వివరించారు. కానీ సన్నివేశాల్ని చిత్రీకరించడంలో బిగువు లోపించింది. నవల చదివినంతసేపూ మామూలుగా అనిపించిందేగానీ కొత్తదనం స్ఫురించలేదు.

సుశీల న్యాయంకోసం తపనపడి, తాను నష్టపోయినా ఫరవాలేదు, న్యాయం జరగాలనే పట్టు

దల కలిగిన వ్యక్తిగా తొందరపడింది! ఫలితంగా ఒక అమాయకుడు శిక్షింపబడ్డాడు. ఇది మన పోలీసు, న్యాయవ్యవస్థల వైఫల్యాన్ని వివరిస్తుంది. సాక్ష్యాలు అనుకూలంగా ఉన్నంతమాత్రాన దోషిగా నిరూపించగలిగే న్యాయవ్యవస్థ మనది! రవీంద్రలా అనాలోచితంగా అలాంటి పనులు చేసేవారు, తమ సరదాలకు అమాయకులు ఎలా బలిఅవుతారో గమనించరు! గమనించినాసరే ఫలితాలను పట్టించుకోనివారు మన సమాజంలో కొల్లలుగా ఉన్నారు. కానీ ఆత్మసాక్షికి జవాబు చెప్పుకోలేకపోవడంమూలంగా ఆ పాత్రలోకలిగిన పరివర్తనద్వారా పరిష్కారాన్ని సూచించారు. అలాంటి ప్రవర్తనవల్ల కలిగే నష్టాలూ, అమాయకులు బలికావడం చిత్రించారు.

కానీ సుజాత పాత్రకు న్యాయం చేకూర్చలేకపోయారు. రవీంద్ర తనవల్ల అనుచితంగా ప్రవర్తించినపుడు అతడే తన అక్క మానభంగానికి కారణమై ఉండవచ్చునని అతని మనస్తత్వాన్ని విశ్లేషించగలిగిన పరిజ్ఞానాన్ని ఆ పాత్రద్వారా చూపారు రచయిత! అలాంటపుడు అంతకుముసుపు తను ప్రేమించిన కృష్ణ విషయంలో ఏమీ పట్టనట్లు ఊరుకోవటం ఏమీబాగాలేదు. ఆ పరిస్థితిలో తాను కృష్ణనుకలిసి నిజానిజాలను తెలుసుకోవడానికైనా ప్రయత్నించాల్సింది లేదా సుశీలకు ఆ విషయాన్ని తెలియజేసి ఉండాల్సింది. కథ అప్పుడే మలుపుతిరిగి ఉండేది. బహుశా ఈ విషయంగానే, నవలకు ఇప్పుడున్నరూపం మారిపోతుందన్న ఉద్దేశంతోనే రచయిత ఆ పాత్ర పరిజ్ఞానం విషయంలో ఉపేక్షచూపి ఆవిధంగా మలిచారనుకుంటాను. ఏదేమైనా ఆ పాత్ర ఔచిత్యం దెబ్బతిన్నది.

ఇతివృత్తం రవంత తవనతో కూడుకొన్నదై కొత్తపుంతలు తొక్కింది. కాబట్టి కథలో ట్విస్ట్, రవీంద్ర కోర్టులో ఇచ్చిన స్టేట్‌మెంట్, కేసుయొక్క విచిత్రస్థితి వగైరాలమూలంగా, సంభాషణలు సామాన్యంగా ఉన్నా చదవాలి అనిపించేలా ఉన్నది. చివరకు దోషి ఎవరు అని ఆలోచిస్తే ఎవరూ కాదు అని స్ఫురించేలాగా రచయిత కథను నడిపారు.

—వి.వెంకటరమణయ్య తిరుపతి

## రెండు సమస్యల దర్పణం

(మూడవ బహుమతి రు. 50/– పొందిన సమీక్ష)

"దోషి....?"లో ప్రముఖంగా స్త్రీలపాలిట సామాజిక శాపమైన మానభంగాన్ని గురించిన వివరణలు, పర్యవసానాలతోపాటు, మరో సామాజిక సమస్య అయిన నిరుద్యోగసమస్యనూ చిత్రీకరించారు. కనుక మధ్యతరగతి మానవులకు సంబంధించిన నవల ఇది.

"ఈ దేశంలో విలువలు విచిత్రమైనవి. ఈ విలువలు ఆడవారికోతీరు, మగవారికోతీరు. ఇది పుణ్యభూమి. ఇక్కడ నేరంచేసిన పురుషులకు పాపం అంటదు. పాపమంతా ఆడదై పుట్టడంలోనే ఉంది." అంటూ ప్రస్తుత వ్యవస్థలోని స్త్రీ పరిస్థితిని వివరిస్తూ, సుశీల పాత్రద్వారా నేరంచేసిన పురుషులకుకూడా శిక్షపడాలని చెప్పారు.

ఎన్ని ఒడుదుడుకులెదురైనా మానభంగానికి గురైన సుశీల చీకట్లో జరిగే ఘోరాలన్నీ చీకట్లోనే కలసి పోకూడదంటూ నేరస్థునికి శిక్ష వేయించాలని పట్టుబడుతుంది. ఇది వాస్తవదూరమే అయినా సందేశాత్మకంగా ఉందని భావిద్దాం. అయితే తమాషా ఏమిటంటే ఆమె ఇంత పట్టుదలవట్టి దోషికాని వ్యక్తికి శిక్షపడేలా చేసింది. దాని సంగతటుంచితే సహజంగా మానభంగానికి గురైనస్త్రీకి ఎదురయ్యే ఇబ్బందులు సుశీలకు ఎదురుకాలేదు. కాగా పూర్తిగా పాఠకుల సానుభూతిని పొందేపాత్రలు కృష్ణ, సుజాత. చేయని నేరానికి కృష్ణ శిక్షింపబడ్డాడు. ఒకవైపు ప్రేమించిన వాడికి దూరమైనందుకు బాధపడాలో, అక్కను పాడుచేశాడని అసహ్యించుకోవాలో తెలియని సందిగ్ధపరిస్థితిలోనూ, మరోవైపు సాంఘికంగా సూటిపోటి మాటలనూభరించవలసి వచ్చిన పాత్ర సుజాతది. ఈ పాత్ర నిజంగా ఒకవిధమైన గంభీరతను సంతరించుకున్నది.

రవీంద్రను చివరలో ఉన్నతంగా తీర్చిదిద్ది కథను సుఖాంతం చేశారు రచయిత. అతని పాత్రద్వారా సామాజిక వ్యత్యాసాలవల్లనే ఈ అత్యాచారాలన్నీ జరుగుతున్నాయని అంటారు. ఈ విషయం ఖచ్చితంగా నిజం. ఆయన ఉద్దేశంలో ఈవిధమైన ఆర్థికపరమైన, సాంఘికపరమైన వ్యత్యాసాలులేని నవసమాజం రావాలని అనుకోవచ్చు. అయితే ఒక అనుమానం. తప్పు చేసినందుకు పరిహారంగా చట్టపరమైన శిక్షను భరించలేకపోయినా, సుశీలను పెళ్ళిచేసుకొని మొదట్లోనూ, భార్య ఉన్నతాదర్శాలకు దోహదపడే వ్యక్తిగా చివర్లోనూ చిత్రీకరించారు. మరి మధ్యలో సుజాతపట్ల రవీంద్ర ప్రవర్తన అలా ఉండటానికి కారణాలు చెప్పలేదు. ఈవిధంగా అక్కడక్కడా లోపాలుఉన్నా, మొత్తంగా ఈ నవల పాఠకులను ఆలోచింపజేసేదిగా ఉంది. ఒక ప్రయోజనకరమైన నవలనందించిన చతుర సంపాదకులకు అభినందనలు.

—ఎం. ప్రగతి! సింగరాయకొండ







**సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

తెలతెలవారుతూ ఉంది! తూరుపుదిక్కు లేకెంపుల వర్ణపు మేలిముసుగు సరిచేసుకుంటూ తన రాజును నిదురలేపేందుకు సన్నద్ధమయే ప్రియురాలిలా ఉంది. ఉదయపు చలిగాలి భావుకుల హృదయాలలో నిదురబోతున్న మనోజ్ఞభావాలను మేల్కొలిపేలా, మత్తుగా పరిమళభరితంగా వీస్తోంది.

కొమ్మ కొనన విచ్చీవిచ్చని లేగులాబీ సుమహృదయం హిమకిరణం తాకిడికి ఒళ్ళు జలదరించగా, కలలు కంటున్న కనులు తెరుచుకుంటున్నట్టుగా ఒక్కొక్క రేకునూ వింగడింప చేస్తోంది. అశోకవృక్షాలు విధినిర్వహణలో అలుపు ఎరుగని సిపాయిల్లాగా పోర్టికోనుంచి గేటువరకూ వేసిన సిమెంట్‌బాట కిరువైపులా నిలిచి వచ్చే అతిథులకు స్వాగతమిచ్చేందుకు సిద్ధంగా ఉన్నాయి.

వాలుకుర్చీలో కూర్చుని, కొంగు తలమీదుగా వేసుకుని చేతులు ముడుచుకు కూచుని ఆలోచనలలో నిమగ్నమైఉంది సమీర!

అలిమేలు కంఠం వినిపించి తల తిప్పిచూసింది. అంతుతెలియని విషాద తీరాలనుంచి నడిచివస్తూ అలిసిపోయిన పాంథుడి కళ్ళల్లో కనిపించే అలసట, నిర్లిప్తత ఆమె కళ్ళల్లో నిండి ఉన్నాయి.

వరండా మెట్లు దిగి పరుగునవచ్చి ఆమె పక్కన నిల్చున్నాడు వంశీ. అతని వెనుకనే ఆయాసంతో వగరుస్తూ వచ్చింది అలివేలు.

ఒకసారి వంశీ వంకకుచూసి తర్వాత ఫిర్యాదు చేస్తున్న ధోరణిలో సమీర వంకకు చూసింది.

"స్నానం చేయిస్తా రమ్మంటే అరగంటనుంచి రాకుండా సతాయిస్తున్నాడమ్మా చినబాబు. పట్టుకుందామంటే దొరకడు. ఇల్లంతా పరుగుతీయించాడు. ఈ కాళ్ళ నొప్పులతో చచ్చిపోతున్నాను. ఇక నేను వేగలేనమ్మా. నాకూ వయసయిపోయింది" అందామె వగరుస్తూ.

"చూడమ్మా! నేనేం చిన్నపిల్లాడినా ఇంకా? స్నానం చేయిస్తానంటూ అస్తమానం నా వెంటపడుతుంది అలివేలు. నువ్వు చెప్పు. నాకేం వద్దని. నా స్నానం నేనే చేసుకుంటా" అన్నాడు వంశీ!

"అబ్బో! గడ్డాలు, మీసాలు వచ్చాయి చిట్టి తండ్రికి."

"నాకు ఇవ్వాళతో ఏడేళ్ళు నిండుతాయి తెలుసా?"

"తెలుసు చిట్టితండ్రీ! ఏడేళ్ళ కిందట నువ్వు పుట్టగానే నిన్ను మొదట ఎత్తుకుంది మీ అమ్మకాదు. నేనే."

"అయినాసరే! ఇంక అదేం వీల్లేదు. నా స్నానం నేనే చేస్తానంతే!"

వంశీ ముక్కుపుటాలు అలకతో ముడుచుకున్నాయి. పిల్ల తెమ్మెర ఆ అబ్బాయి ఉంగరాల జుట్టును నుదుటిమీదికి పడేలా రేగగొట్టి వెళ్లింది.

తన బిడ్డవంక— జీవితంలో దైవం మిగిల్చిన ఒకే ఒక్క అపురూపమైన ఆ సంపదవంక సమీర వాత్సల్యం నిండిన చూపుల్ని ప్రసరించింది.

"వంశీ! ఈ రోజు నీ పుట్టినరోజు కదా! అలివేలును బాధపెట్టవచ్చా?"

అతినెమ్మదిగా శాంతం నిండిన స్వరంతో అంది సమీర.

"అదేం కాదమ్మా. స్నానం నేనే చేసుకుంటానని చెప్పు."

"పోనీ! అలివేలుచేత తలైనా రుద్దించుకో."

వంశీ బుంగమూతిపెట్టి అలివేలువంక చూశాడు. తల్లి ఏదిచెప్పినా కాదనలేని బలహీనత ఉంది ఆ పసివాడిలో.

"సరే! పద. తల ఒక్కటి మాత్రం రుద్దాలంతే!"

"నీకున్నది ఒక్క తలేగా బాబూ."

"వ్వెవ్వెవ్వే!"

అలివేలును వెక్కిరించి లోపలికి పరుగుతీసిన వంశీ వంక చిరునవ్వుతో చూసినది సమీర.

"మీరుకూడా లేవండమ్మా. పడుకునేదే ఐదారు గంటలు. ఇంకాసేపు పడుకోకుండా తెల్లవారుఝామునే లేచి తోటలో పచార్లు చేస్తుంటారు. అయినా చలికాలంకూడా ఏమిటమ్మా ఈ పనులు. వరండాలో కూచోరాదూ?"

"ఫరవాలేదు అలివేలూ! నువ్వెళ్ళు. నేను తర్వాత వస్తాను."

"మీ మొండితనమే వచ్చిందా బాబుకుకూడా!"

అలివేలు విసుగ్గా అనే ఈ మాటలంటే సమీరకెందుకో చాలా ఇష్టం!

ఆమె పెదవులమీద చిరునవ్వు కదిలింది.

• • •

డాక్టర్ కె.సమీర ఎఫ్.ఆర్.సి.ఎస్. గైనకాలజిస్ట్. నల్లటి నేమ్‌ప్లేట్ మీదున్న బంగారు రంగు అక్షరాలను నేప్‌కిన్‌తో తుడిచి, 'అవుట్' అని ఉన్న అక్షరాల మీదున్న పలకను 'ఇన్' మీదికి జరిపింది అలివేలు.

ఎర్రటి ఎరుపు రంగున్న మారుతీకారు గేటు దాటి రోడ్డుమీది కొచ్చింది.

స్కూల్ యూనిఫామ్‌లో ఉన్నవంశీ మౌనంగా రోడ్డువంక చూస్తున్న వాడల్లా హఠాత్తుగా తలతిప్పి తల్లివంక చూశాడు. ఆ అబ్బాయి కదలికలో, తల తిప్పటంలో కనిపించిన సంకోచం, గ్రహించిందామె.

"ఏం వంశీ? ఏం కావాలి?"

"అమ్మా! నాన్న చనిపోయారన్నావు గదా! మరి ఆ రాజు అస్తమానం నాన్న విదేశాల్లో ఉన్నారని అంటాడేమిటమ్మా?"

ఏకాగ్రతతో ట్రాఫిక్‌మీద చూపు నిలిపి డ్రైవ్ చేస్తున్న సమీర చేయి కొద్దిగా కంపించింది. మరుక్షణం తనని తాను నిలువరించుకుని తెప్పరిల్లింది.

"వంశీ! అమ్మంటే నీకు ప్రేముందా? లేదా?"

ఆ అడగటంలో ఆమె కంఠంలో లాలనతో కూడిన విషాదం ధ్వనించింది.

"అమ్మా!"

వంశీకి తల్లిమూడ్స్ బాగా అర్థం అవుతాయి. ఆమె కంఠంలో ధ్వనించిన భావం తెలిసింది.

తన భావాన్ని వ్యక్తపర్చలేక ఆర్తిగా తల్లిచెయ్యి పట్టుకున్నాడు.

ఒక చేత్తోడ్రైవ్ చేస్తూనే, మరోచేత్తో వంశీ తల పట్టుకుని దగ్గరికి తీసుకుందామె.

"చూడు చిన్నా! లోకంలో అందరూ మంచివాళ్ళూ, మనల్ని ప్రేమించేవాళ్ళే ఉండరమ్మా. ఎక్కువగా ఏడిపించేవాళ్ళే ఉంటారు. అందుకే ఎవరు ఏమన్నా పట్టించు కోకూడదు. నాన్న గురించి నాకు తెలుసా? రాజుకు తెలుసా? నువ్వు పెద్దవాడి వయ్యాక నీకన్నీ అర్థమవుతాయి. అంతవరకూ ఎవరు ఏమన్నా పట్టించుకో కూడదు. నా చిన్నా అమ్మను ఏడిపించడు. అవునా?"

"ఇంకెప్పుడూ నిన్ను విసిగించనమ్మా." వంశీ స్థిమితంగా అన్నాడు.

సమీర మనసుమాత్రం అల్లకల్లోలం అయింది. తనంటే ఎవరికైనా ద్వేషం ఎందుకో అర్థంకాదు. అన్ని విధాలా శాపగ్రస్థమైన జీవితం గడుపుతున్న తనపట్ల కాస్త సున్నితభావం ఏర్పర్చుకుని ప్రవర్తిస్తే ఏం?

"అమ్మా! నేనోమాట చెపితే కోపంరాదు కదూ!"

"చెప్పమ్మా."

"మనం ఇంకోకొత్త నాన్నను తెచ్చుకుంటే ఏమవుతుంది?"

నిరుత్తరురాలై చూసింది సమీర.

"మా స్కూల్లో ఓ మేడమ్ ఆమె హజ్బెండ్ చనిపోతే మళ్ళీ పెళ్ళి చేసుకుంది. ఎప్పుడూ దిగులుగా ఉండే ఆవిడ ఇప్పుడు ఎంతో సంతోషంగా ఉన్నారు. మనమో కొత్తనాన్నను తెచ్చుకుంటే నువ్వుకూడా ఆవిడలా సంతోషంగా ఉంటావుగదా! ఏం, తప్పా అమ్మా?"

తల్లి చూపులకు భయపడ్డాడు వంశీ.

సమీర నెమ్మదిగా తేరుకుని చిరునవ్వు నవ్వింది.

"తప్పు కాదమ్మా. కానీ.... నాకిష్టం లేదు. కొత్తనాన్న వస్తేనిన్ను చూసుకునేందుకు నాకు టైమ్ ఉండదు. నిన్ను నన్నుబాగా చూసుకునే వాళ్ళు దొరకాలి కదూ! "

"నేను పెద్దాడిని అయాను కదమ్మా. నువ్వు నన్ను చూసుకోకపోతే ఏమవుతుంది."

ఈకాలం పిల్లలకు సినిమాలు, టి.వి. చూసి వయసుకు మించిన పరిజ్ఞానం వచ్చిందనుకుంది సమీర.

"ఆలోచిద్దాం లే!"

"ప్రామిస్!"

"ప్రామిస్!"

ట్రాఫిక్ సిగ్నల్ ఎర్రలైటు చూపటంతో కారు ఆగింది.

ఆలోచనలతో పరధ్యానంగా మారిన ఆమె యధాలాపంగా వాచీవంక చూసుకుంది. నర్సింగ్ హోమ్ చేరేందుకు ఇంకా అరగంట వ్యవధి ఉంది.

★ ★ ★

1987 ఫిబ్రవరి

# చతుర

## జన్మదిన సంచిక

తెలుగు పత్రికా రంగానికి గర్వకారణమైన, అసంఖ్యాక పాఠకుల అభిమాన విపుల, చతుర మాసపత్రికలు 1987 ఫిబ్రవరి సంచికతో తొమ్మిదేళ్ల సుదీర్ఘ సాహితీ సేవ పూర్తి చేసుకుని పదవఏట అడుగు పెడుతున్నాయి.

1986 మేలో 100వ సంచికలు వెలువడిన సందర్భంగా భారతీయ భాషా పత్రికా చరిత్రలోనే అపురూపమైన రీతిలో లక్షరూపాయల బహుమతులతో ప్రకటించిన కధలు, నవలల పోటీలో నెగ్గిన రచనల ప్రచురణ ఈ సంచికలతోనే ఆరంభ మవనున్నది.

రు : 10,000/- బహుమతి పొందిన తెలుగు నవలను 'చతుర' పాఠకులు ఈ సంచిక లోనే చదువనున్నారు. ప్రధమ బహుమతులు పొందిన తెలుగు, తెలుగేతర భాషా విశిష్ట కధానికలతో విపుల సాహితీ జనమనోభి రామంగా వెలువడనున్నది. అనేక ఇతర ప్రత్యేకతలతో సర్వాంగ సుందరంగా వెలువడనున్న ఈ జన్మదిన సంచికల ధరమాత్రం మామూలే!



"గుడ్ మార్నింగ్ డాక్టర్! మీ కోసమే ఎదురు చూస్తున్నాము."

"ఎనీథింగ్ సీరియస్?"

"నిన్న సిజేరియన్ చేసిన వ్యక్తికి బాగా టెంపరేచర్ ఉంది."

వార్డు లోపలికి హడావుడిగా నడిచింది సమీర.

ఆతర్వాత మధ్యాహ్నం పన్నెండిరటికి శరత్‌వచ్చి పలకరించే దాకా ఆమె బిజీగాఉండిపోయింది.

"మీకు వర్క్‌చాలా హెవీగా ఉన్నట్టుంది నర్సింగ్‌హోమ్‌లో." అన్నాడు శరత్ ఆమె అలసటను చూసి.

"ఫరవాలేదు. ఐలైక్‌టు వర్క్‌మోర్! మన విజ్ఞానాన్ని ఇంతమంది ఆరోగ్యాలను, ప్రాణాలను కాపాడేందుకు వెచ్చించటంతో నాకెంతో సంతృప్తి లభిస్తుంది డాక్టర్. ఇంత శ్రమపడ్డా కొన్నిసార్లు మన ప్రయత్నాలన్నీ వృధా అవుతుంటాయి." ఆమె కంఠంలో ధ్వనించిన బాధను గుర్తించాడు శరత్.

"ఏమైందండీ?"

"ఈ ఉదయం లేబర్ రూమ్‌లో ఓ యువతి మరణించింది డాక్టర్. శేఖర్ చెప్పలేదా మీకు?"

"అవునవును. ఏమైందా అమ్మాయికి?"

"రాత్రి చేర్చారటగా? పెయిన్స్ రావటం లేదని అసిస్టెంట్ రమణి డ్రిప్ పెట్టారట. నేనప్పుడే వచ్చాను. ఆ అమ్మాయి ఊపిరందక ఉక్కిరి బిక్కిరి అవుతుండే పరిస్థితి గ్రహించి, డ్రిప్ డిస్‌కనెక్ట్ చేసే లోపల ఆమె చనిపోయింది. నేను ఇంకో పది నిమిషాలు ముందుగా వచ్చుంటే ఇలా జరిగేది కాదేమో! నేను గొప్పదాన్నను కోవటం లేదు. కానీ ఆమెను నేనేమైనా కాపాడగలిగి ఉండేదాన్నేమోనని!"

"ఇంత సర్వీస్ ఉన్నా ఇంకా మీలో ఇంతసెన్సిటివ్ నెస్ ఉండటం ఆశ్చర్యంగా ఉంది డాక్టర్!"

"ఎంతో ఉత్సాహంగా, సంతోషంగా చెకప్‌కు వచ్చేవాళ్ళు ఆమె, ఆమెభర్త. ఇరవైఏళ్ళు కూడా నిండలేదా అమ్మాయికి. ఎంతో ఇష్టపడి పెద్దల్ని ఒప్పించి, సంవత్సరకాలం ఎదురు చూసి మరీ చేసుకున్నాడట ఆ అబ్బాయి. ఇదే తొలికాన్పు. ఆ అమ్మాయి పోయిన వార్త వినగానే ఫెయింటైపోయాడతను.

అతని ముఖం, ఆచూపు గుర్తుకొస్తే మనసు కలచినట్టవుతోంది.

శరత్ ఓ రెండు నిమిషాలు వ్యవధినిచ్చి నెమ్మదిగా ఆమె మూడ్ తప్పించాలని అడిగాడు.

"ఈ రోజు మీ వంశీ నన్ను మీఇంటికి ఇన్వైట్ చేశాడు."

"వంశీనా? ఎప్పుడు పిలిచాడు?"

"ఈ ఉదయమే ఫోన్‌చేసి చెప్పాడు. తన బర్త్‌డే అటకదా!"

"అవును డాక్టర్! ఐయామ్‌సారీ! వాడు నాకు చెప్పలేదీవిషయం... ప్రతిఏటా తన ఫ్రెండ్స్‌ని తప్ప ఎవరినీ పిలిచేవాడుకాదు. ఈసారి మిమ్మల్ని పిలవటం— అది కూడా నాకు చెప్పకపోవటం ఆశ్చర్యంగాఉంది." నవ్వటానికి ప్రయత్నిస్తూ అంది.

"చిన్నపిల్లాడిని డిసప్పాయింట్ చేయకూడదు. సరే, వద్దామని అనుకున్నాను. నాకు ఆశ్చర్యమేసింది. మీరే పిలవొచ్చుగా, ఆ బాబు ఎందుకు ఫోన్ చేశాడా అని! ఎనీవే! మీకేమైనా ఎంబరాసింగ్‌గా ఉంటే చెప్పండి. నేనేం అనుకోను."

"అలాంటిదేం లేదండీ! సడెన్‌గా ఊహించని విషయం వినగానే తెల్లబోయానంతే! యు ఆర్ మోస్ట్ వెల్‌కమ్ ఇనఫ్ ఈవినింగ్.

సరేగానీ మన నర్సింగ్‌హోమ్ పెట్టాక, అన్ని వసతులూ కలిపి అవటంతో మనకు పేషెంట్స్ ఎక్కువగా వస్తున్నారు. ఇక్కడి డాక్టర్లకు వర్క్ కూడా హెవీగా ఉంది. బెడ్స్‌లేవని రోజూ చాలా మందిని పంపేస్తున్నామని సైలా చెప్పింది" అంది సమీర.

"అందుకే మన నర్సింగ్‌హోమ్ పక్కన ఉన్న ఇల్లు కొనబోతున్నాను. దానికి అవసరమైన మార్పులు చేసి, మన కాంపౌండ్ గోడ పడగొట్టించి రెండు బిల్డింగ్స్ ఒకే కాంపౌండ్‌లో ఉండేలా ఏర్పాటు చేయించాలి. ఇది మీకెందుకు చెబుతున్నానంటే— ఆ బిల్డింగ్ మొత్తం గైనకాలజీకే కేటాయించాలని అక్కడ స్టాఫ్ నంతటినీ కూడా ఆడవాళ్ళనే అపాయింట్ చేస్తాను. ఒక్క శేఖర్‌ని తప్ప. అతను మంచి

అసిస్టెంట్ మీకు. మిమ్మల్ని బాగా అర్థం చేసుకుని సహకరిస్తాడు."

"మీ ఐడియా బాగుంది డాక్టర్!"

"కానీ నాకో చిన్న ప్రాబ్లమ్ ఎదురైంది. ఆ బిల్డింగ్ అమ్మేందుకు ఓనర్ అంత సుముఖంగా లేడు."

"మరెలా?"

"అతను మీకు బాగా తెలుసని విమల చెప్పింది. మీరోసారి మాట్లాడితే అతను తప్పకుండా అమ్ముతాడంది".

సమీర కనుబొమలు ఆశ్చర్యంతో ముడిపడ్డాయి.

"అతనుకూడా డాక్టరేనట. ఈ మధ్యే ఉస్మానియా హాస్పిటల్‌కు ట్రాన్స్‌ఫర్‌మీద వచ్చాడట."

"ఎవరండీ అతను?"

"పేరు సరిగ్గా గుర్తులేదండీ. విమల నడిగితే తెలుస్తుంది. మీ క్లాస్‌మేట్‌అని చెప్పింది. మీరంటే అతనికి ప్రత్యేకమైన అభిమానం అనీ, ఫ్రెండ్స్ అనీ చెప్పింది"

"డాక్టర్ మధుకర్...?"

"కరెక్ట్! అతనే! మీరోసారి నా తరపున, మన నర్సింగ్‌హోమ్ తరపున వెళ్ళి మాట్లాడకూడదూ!"

"మిమ్మల్ని నిరాశ పరుస్తున్నందుకు క్షమించండి డాక్టర్! అతనితో నేను మాట్లాడితే మీ పని జరుగుతుందన్న నమ్మకం లేదు. దయచేసి నన్ను ఇబ్బంది పెట్టకండి. మీరు అనుకుంటున్న ఫ్రెండ్‌షిప్ ఏదీ మా మధ్యలేదు."

"మరి విమల.."

"అతనికి నేనెంత ఫ్రెండ్‌నో, విమల కూడా అంతే. ఆమెనే ట్రై చెయ్యమనండి డాక్టర్."

"మీరింత ఇబ్బంది పడేట్టయితే వద్దులెండి."

"సారీ! మిమ్మల్ని నిరాశపర్చాను. బైదిబై! ఈ సాయంత్రం రండి. మొన్న జ్వరం వచ్చినప్పుడు వంశీని మీరు బాగా ఆకట్టుకున్నట్టున్నారు. మీ గురించి ఎప్పుడూ అడుగుతుంటాడు. కానీ ప్రెజెంట్ మాత్రం తేకండి. వాడింత వరకూ ఎవరి ప్రజెంట్సూ ఆక్సెప్ట్ చేయలేదు."

"వంశీ ఆక్సెప్ట్ చేసే ప్రెజెంట్ తెస్తే తప్పక తీసుకుంటాడేమో!"

చిరునవ్వు నవ్వింది సమీర.

సమీర నవ్వు చాలా స్వచ్ఛంగా, ఆహ్లాదకరంగా ఉంటుందనిపించిందతనికి.

★ ★ ★

డాక్టర్ శరత్‌కారు దిగి లోపలికి అడుగుపెట్టేసరికి తోటలో పదిమంది పిల్లలు నవ్వులతో, కబుర్లతో కేరింతలు కొడుతున్నారు.

శరత్‌నిచూసి వంశీ ఆనందంగా ఎదురు వచ్చి లోపలికి తీసికెళ్ళాడు.

హాల్లో కేక్ కట్ చేసేందుకు అంతా సిద్ధంగా ఉంది. శరత్‌కోసమే ఎదురు చూస్తున్న వంశీ అతను రాగానే కేక్ కట్‌చేసి ఒక ముక్క తల్లికి, ఒక ముక్క శరత్‌కి, మరోముక్క అలివేలుకు తినిపించాడు. సమీర శరత్ ఇద్దరూ వంశీకి కేక్ నోట్లోపెట్టి విష్ చేశారు.

అలివేలు, వంశీ మిగిలిన కేక్‌ముక్కలుచేసి పిల్లలకు పంచుతున్నారు. సమీర శరత్‌ను పార్టీ ఇస్తున్న టేబుల్ దగ్గరికి తీసికెళ్ళింది! ఓ ప్లేట్‌లో స్వీట్, హాట్ పెట్టి అతనికి ఆఫర్ చేసింది! తనూ ఓ ప్లేట్ తెచ్చుకుని అతనికెదురుగా ఉన్న సోఫాలో కూచుంది.

సింపుల్‌గా సాదా తెల్లచీరలో, చెవులకున్నవి తప్ప మరే ఆభరణమూ ధరించని ఆమె అందమైన విగ్రహాన్ని ఆసక్తిగా చూశాడతను.

"ఏమిటలా చూస్తున్నారు?"

"మీరేదో గ్రాండ్‌గా పట్టుచీరలాంటిది కట్టుకుని మీ అబ్బాయి బర్త్‌డే ఘనంగా సెలబ్రేట్ చేస్తారనుకున్నాను. అందుకే నేనూ సూట్‌లో వచ్చాను. ఇప్పుడు చూస్తే అన్పిస్తోంది— మీ అందరి మధ్య నేను పెద్ద తేడాగా ఉన్నానని."

"ఎవరి అలవాటు వాళ్ళది. నాకు పట్టుచీరలు కట్టుకుంటే ఉక్కిరిబిక్కిరయినట్టుగా ఉంటుంది."

"ఓ మాట అడగనా?"

"అడగండి."

"కోపం రాదుకదా?"

సమీర చిరునవ్వు నవ్వింది.

"నాకు కోపం వచ్చే విధంగా మీరు మాట్లాడలే

రని నాకో గొప్పనమ్మకం."

"అలా అయితే అడుగుతాను. విద్యలో ఎంతో అభివృద్ధి సాధించారు. వృత్తిలో ఎంతో నైపుణ్యమూ అనుభవమూ గడించారు.సర్జరీలో, మెడిసిన్‌లో కూడా గొప్పవాళ్ళనిపించుకున్నారు.అందమంటారా- పరాయి పురుషుడిని నేను- హిందూ సంస్కృతి ప్రకారం స్తుతించకూడదు మిమ్మల్ని. కానీ నేను వేరే ఉద్దేశ్యంతో అనటంలేదు కాబట్టి మీరు చాలా అందమైన వాళ్ళని చెబితే తప్పులేదు. ఇక మీ మనస్తత్వం, ప్రవర్తన ఎంత స్వచ్ఛమైనవో దాదాపు ఏడేళ్ళుగా చూస్తూ అర్థం చేసుకున్నాను. నా అనుమానం ఏమిటంటే ఇన్ని సుగుణాలను ఏర్చికూర్చిన విధాత మీ జీవితంలో ఒంటరితనాన్ని స్తబ్దతను ఎందుకు పెట్టాడా అని?"

సమీర కొద్ది క్షణాలు మాట్లాడలేకపోయింది. అతనింత ఎక్కువగా మాట్లాడటం- అదీ తన గురించి మొదటిసారిగా! తననెంత నిశితంగా గమనిస్తున్నాడో అర్థమైంది. అర్థంకానిదల్లా తన గురించి ఇంత ఎక్కువగా ఎందుకు ఆలోచిస్తున్నాడా అని.

"మీరనుకునే ఒంటరితనం స్తబ్దత నా జీవితంలో ఉన్నాయనుకోవటంలేదు డాక్టర్! ఉదయంలేచి హాస్పిటల్‌కొస్తే రోగగ్రస్తులై, దీనంగా నా సహాయం కోసం ఎదురుచూసే పేషెంట్స్ మధ్య నాకు సమయం ఎట్లా గడిచిపోతుందో కూడా తెలియదు. ఇక ఇంటికి రాగానే నాకు వంశీ ఉండనే ఉంటాడు."

"రోగులు, రోగాలు తప్ప ఇంక జీవితం లేదా"?

"నావరకూ అయితే లేదు. నా జీవితాన్ని రెండుభాగాలుగా విడగొట్టి ఓ సగం నాబిడ్డకు, మరోసగం వ్యాధిగ్రస్తులై అలమటించే అభాగ్యులకు పంచి ఇచ్చాను."

"లేడీస్ క్లబ్‌లో మెంబర్ అయితే సాయంత్రాలు ఉత్సాహంగా గడుస్తాయికదా."

"నాకిప్పుడు సాయంత్రాలు ఉత్సాహంగా గడవటంలేదని మీతో చెప్పిందెవరు?"

శరత్ ఆశ్చర్యంగా చూశాడు.

"నేనింటికి వచ్చేసరికి వంశీ స్విమ్మింగ్‌పూల్ నుంచి వచ్చేస్తాడు. ఇద్దరం కలిసి తోటకు నీళ్ళు పెట్టాక ఓ అరగంట షటిల్ ఆడతాము. ఆ తర్వాత వాడి హోమ్‌వర్క్ అదీచూసి భోంచేస్తాము. ఓ ఆట కారమ్స్ కానీ, చెస్ కానీ, ట్రేడ్ కానీ ఆడాక వాడు నిద్రపోతాడు. నేను నిద్ర వచ్చేదాకా ఏ మెడికల్ జర్నల్సో, నవలో చదువుకుని పడుకుంటాను. మళ్ళీ ఉదయం ఐదుకే నిద్రలేచి ఇద్దరం మార్నింగ్ వాక్‌కువెళ్ళి వస్తాము. నేను గార్డెనింగ్ చేస్తుంటే వాడు ఎక్సర్‌సైజ్ చేసి స్నానానికెళ్తాడు. ఆ తర్వాత తయారై వాడు స్కూల్‌కు, నేను నర్సింగ్‌హోమ్‌కు వస్తాము. ఈ రొటీన్ నాకింతవరకూ విసుగనిపించలేదు. ఇంకో పదేళ్ళు గడిస్తే వాడు పెద్దవాడై డిగ్రీ చదువుతుంటాడు. ఈ జీవితమిలా నిశ్చింతగా గడిస్తే చాలు."

సమీర మాటలు శరత్‌ని ముగ్ధుణ్ణి చేశాయి. ఒక పేరున్న డాక్టర్ అయివుండీ ఆమె తన కొడుకు కోసం అంత సమయం వెచ్చించగల్గటం నిజంగా అభినందించదగ్గ విషయం. సాధారణంగా పనీపాటా ఏమీలేక ఆడవాళ్ళు సినిమాలనీ, క్లబ్‌లనీ, పిక్నిక్కులనీ అస్తమానం రిక్రియేషన్ కోసం ఆరాటపడుతుంటారు. అందులోనూ మెడికల్ ప్రొఫెషన్‌లో ఉన్నవారు రోగాలను, రోగులను, బాధలను చూసి విసిగిపోయి తప్పనిసరిగా ఎంటర్‌టైన్ కావాలని ఆలోచిస్తారు. ఎవరి సుఖం వాళ్ళు, ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకుంటూ చదువుపేరిట పిల్లలను రెసిడెన్షియల్ స్కూళ్ళకు తరిమి తమ స్వేచ్ఛకు అడ్డురాకుండా చేసుకునే రోజులివి. అలాంటిది తన కొడుకు సంతోషం కోసమే జీవితం వెచ్చిస్తున్న మనస్తత్వం, ఆలోచనాధోరణీ ఎంతో అపూర్వంగా, అద్భుతంగా తోచాయి అతనికి. అటువంటి స్త్రీ ఏ ఇంటికి ఇల్లాలిగా ఉంటుందో ఆ ఇంటి సభ్యులంతా సుఖంగా, సంతోషంగా, సంతృప్తిగా ఉంటారనిపించిందతనికి.

"ఏమిటలా ఆలోచిస్తుండిపోయారు?"

"మీ గురించే— మీరు చాలా ఉన్నత వ్యక్తి అనిపిస్తోంది."

"ఏముందీ అంతగొప్ప?"

మొహమాటంగా నవ్వింది. లైటు కాంతిలో ఆమె పలువరుస మెరిసింది.

"మీ సుఖం గురించి కాస్తయినా ఆలోచించరే

మిటాని''

''అసలు సుఖం అంటే ఏమిటో చెప్పండి? ఎవరికెందులో ఆనందం కలుగుతే అదే సుఖం! నాకీ దినచర్యలో అంతులేని ఆనందం ఉంది.''

శరత్ ఏమీ మాట్లాడలేదు. మౌనంగా ఆమె చేతివేళ్ళ వంక చూస్తుండిపోయాడు.

''మీరు కాఫీ తీసుకుంటారా? కూల్‌డ్రింకా?''

''ఇప్పుడదేం వద్దు.''

''అయితే కాస్త ఫ్రూట్‌సలాడ్ తీసుకోండి.''

తల్లిని, శరత్‌ని గమనిస్తున్న వంశీ మరుక్షణం ఫ్రూట్‌సలాడ్ తెచ్చి ఆఫర్ చేశాడు.

''థాంక్యూ!''

''ఇటీజ్ ప్లెజర్ అంకుల్!''

''వెరీనైస్ బోయ్!''

అబ్బాయిలంతా టీమ్స్‌గా విడిపోయి ఎవరికి నచ్చిన గేమ్ వాళ్ళు ఆడుకొంటున్నారు.

''అలివేలూ! పిల్లల్ని జాగ్రత్తగా వాళ్ళ పేరెంట్స్‌కు అప్పచెప్పు. నేను మేడమీదుంటాను.''

''అలాగేనమ్మా.''

''రండి. బాల్కనీలోకి వెళ్దాం. మా ఇల్లు చూడలేదుకదా!''

శరత్ ఆమెని అనుసరించాడు.

కింది భాగంలో డ్రాయింగ్ కమ్ డైనింగ్, ఓ బెడ్‌రూమ్, కిచెన్, స్టోర్‌రూమ్ ఉన్నాయి. మేడ మీద రెండు బెడ్ రూమ్స్! బాల్కనీలో చక్కగా రూఫ్ గార్డెన్ డెవలప్‌చేసిఉంది.







"మొక్కలంటే మీకిష్టమనుకుంటాను"

"మొక్కల్ని అందరూ ఇష్టపడతారనుకుంటాను. ఇంటికి అందం అనో, అదొక ఫ్యాషన్‌గానో, పూలు, కూరగాయల కోసమో! కానీ నాకు మాత్రం వేకువఝాము, నీరెండపరుచుకునే సాయంత్రాలను అంతమనోహరంగా తీర్చిదిద్దేది మొక్కలేనన్పిస్తుంది. ఆ రెండు సమయాలూ గార్డెన్‌లో గడిపేస్తాను. తోటపని చేయటంలోఉన్న ఆనందం, అవి చిగుళ్ళు వేసి, మొగ్గలుతొడిగి,

పూలు పూస్తుంటే కలిగే సంతృప్తి ఎంతోఅద్భుతంగా ఉంటుంది".

"నిజమే! మీరు చెబుతుంటే నాకూ అనిస్తోంది."

సమీర పిట్టగోడమీద మోచేతులానించి నిలబడి సింగారించుకునేందుకు ఆయత్తమవుతున్న నగర సౌందర్యాన్ని చూడసాగింది.

"మీకింత వరకూ కృతజ్ఞతలు చెప్పుకునే అవకాశమే లేకపోయింది." అంది కొంచెం ఆగి.

"ఎందుకు?" ఆశ్చర్యంగా అన్నాడు శరత్.

"ఈ ఇల్లు కొనటంలో నాకు సహాయపడ్డందుకు- మనిషికి జీవితంలో అతి ముఖ్యమైన అవసరం ఇల్లేనని నా ఉద్దేశ్యం!"

"యూ ఆర్ కరెక్ట్! కానీ ఇందులో నేను పెద్దగా కష్టపడిందేమీలేదు. మా ఫ్రెండ్ చౌకగా అమ్ముతుంటే చెప్పాను. కాస్త డబ్బు సర్దాను. నేనిచ్చింది చాలాతక్కువ. అదికూడా నెలనెలా జీతంలో కట్ చేసుకుంటున్నానుగదా!"

"ఏదైనా సహాయం సహాయమేగా! ఈ కాలంలోకన్నవాళ్ళు, తోబుట్టువులు, చివరికి జీవితంపంచుకున్న భర్త కూడా ఏ చిన్న అవసరానికీ ఆదుకోవటంలేదు. మీ సహాయమే లేకపోతే నేను కొనలేకపోయేదాన్నీఇల్లు"

"మీరు ఫారిన్ రిటర్న్డ్ అయినా మంచి జాబ్ చూసుకోకుండా నాకొత్తనర్సింగ్‌హోంలో చేరి పని చేస్తున్నందుకు మీ విలువ నేనూ గుర్తించాలికదా!"

"ఎంతైనా మీ కంటే గొప్పదాన్ని కాదులెండి"

"అలాఅనటం మీ సంస్కారం. నిజానికి నా నర్సింగ్‌హోమ్‌కింత పేరు రావటానికి కారణం మీరే. అర్ధరాత్రి, అపరాత్రి అని లేకుండా పనిచేశారు ప్రారంభించిన కొత్తలో."

"డాక్టరు వృత్తే అలాంటిది."

"బాధ్యతగా చేయటం గొప్పగా!"

"నిజానికి నా ఆత్మసంతృప్తి కోసం చేశాను అదంతా"

"నిండుకుండ తొణకదని అంటారందుకే. ఏమైనా కెనడాలో అప్పుడు మీరు అలా పరిచయం కావటం నా అదృష్టమే".

కాసేపు సమీర మౌనంగా ఉంది.

"మీరు తప్పుగా భావించనంటే నేనోమాట అడుగుతాను"

సమీర నవ్వుతూ తల వూపింది.

"మీవారు బ్రతికే ఉన్నారనీ, న్యూయార్క్‌లో ఉన్నారనీ విన్నాను. మీరేమో బొట్టు, గాజులు తీసేశారు."

"ఆ మాట మీకు చెప్పిన వారికి ఇతరులగురించి వ్యాఖ్యానించాలన్నా చెప్పాలన్నా సరదాయేమో!"

"నాకు విమల స్వభావం తెలుసు. బహుశా నేను మీకు అమితమైన గౌరవం ఇస్తానని ఆమెకు అసూయ కావచ్చు"

"ఆయనను 'మావారు' అనకూడదేమో- న్యూయార్క్‌లో ఉంటున్నమాట నిజమే. కానీ నాకు దూరంగా, నా ముఖమైనా చూడకుండా కనీసం ఉత్తరం ద్వారాకానీ, ఫోన్‌ద్వారా కానీ, మాట్లాడకుండా ఉండిపోయి పదేళ్ళవుతుంది. దానర్థం మీకు తెలుసా? హిందూలా ప్రకారం మా వివాహ బంధం ఏడెనిమిదేళ్ళ క్రితమే తెగిపోయింది.

కానీ నా కొడుకు తండ్రికోసం సతాయించకుండానూ నేను మగవాళ్ళబారినుంచి తప్పించుకునేందుకూ ఈ వేషం వేయకతప్పటంలేదు."

శరత్ నిరుత్తరుడై చూశాడు. ఇందాక వంశీ ఏడు కాండిల్స్ ఆర్పేశాక, ఆమె ఓ కాండిల్ వెలిగించి 'సెవెన్ ఇయర్స్ కంప్లీటెడ్, ఎయిత్‌ఇయర్‌రన్నింగ్, అని అనటం గుర్తొచ్చింది. పదేళ్ళ కిందటే భర్త విడిపోతే మరి ఈ బాబు...?

అయినా ఎవరి జీవితం వారిది, ఎవరి సమస్యలు వారివి అనుకుని సరిపెట్టుకున్నాడు. ఆ ఆలోచనకిది సమయం కాదని.

అతని సందేహం గ్రహించినా ఆమె దాన్ని తీర్చే ప్రయత్నం చేయలేదు.

"నేనూ మిమ్మల్నో మాట అడగనా?" అంది చివరికి.

"అడగండి." అన్నాడతను.

"మీరు కూడా అవివాహితులుగా ఉండిపోయారు. మీ గొప్పతనం చూసి గౌరవించే, అభినందించే, ప్రోత్సహించే ఓ వ్యక్తి మీకు తోడూనీడగా ఉండటం ఎంతో అవసరం కదా? మీ గొప్పత

నానికి, సంపదకు వారసులు కావద్దా?"

శరత్ తడబడ్డాడు. సమీరతో అంతసన్నిహితమైన విషయాలు చర్చించే అవకాశం వస్తుందనుకోలేదు అతను. తన మనసులో ఆమెపట్ల ఉన్న అభిప్రాయాలు వ్యక్తపరిచే అవకాశం వస్తుందని కూడా అనుకోలేదు.

"వంశీలాంటి చక్కటిబాబు వారసుడిగా కావాలని నా ఆశ!" అన్నాడు తటపటాయిస్తూనే!

అర్థం కానట్టుగా చూసింది సమీర అయోమయంగా.

"మీరెవరినైనా ప్రేమించి విఫలులయారా?" అంది చివరికి.

"నేనూ అదే అడుగుదామనుకుంటున్నాను. మీ చూపులు, ప్రవర్తన ఎప్పుడూ ఎంతో విలువైన వ్యక్తిని పోగొట్టుకున్నట్టుగా ఉంటాయి. మీ భర్తనంతగా ప్రేమించేవారా మీరు?"

"ప్రశ్నకు ప్రశ్న జవాబా?"

"నాతోపాటు చదువుకున్న ఓ చక్కటి, మంచి మనసున్న అమ్మాయిని అమితంగా ఇష్టపడ్డ మాట నిజమే. కానీ నా అతిమొహమాటంవల్ల ఆమెకు నా మనసును కాస్తయినా విప్పిచెప్పలేకపోయాను. తీరా ఆమె వివాహం మరొకరితో జరిగాక తెలిసింది. ఆమెకూడా నన్ను అమితంగా ఇష్టపడిందని"

సమీర సానుభూతిగా చూసింది.

"ఆమె కోసమే ఇలా ఉండిపోయానని అనను కానీ, పెళ్ళి విషయంలో గేంబ్లింగ్ ఆడటం నాకిష్టం లేకపోయింది. నాకు కావల్సిన వ్యక్తి నెమ్మదైన స్వభావం కలిగిఉండాలి. చక్కగా, చల్లగా నవ్వగలిగిఉండాలి. కుటుంబ క్షేమం కోసం బాధ్యతగా కష్టపడే వ్యక్తి అయిఉండాలి. ఒక్కమాటలో చెప్పాలంటే అచ్చుమీలా ఉండాలి"

సమీర ఒళ్ళు ఉలికిపాటుతో జలదరించింది.

ఆమె అతని భావం గ్రహించే ఉద్దేశ్యంతో సూటిగా చూసింది. అతని ముఖంలో ఆ నవ్వులో ఏ మార్పూలేదు.

"ఉదయం మీరు నర్సింగ్‌హోమ్ గురించి మాట్లాడారు. మధుకర్ మంచివాడే. మీరు పర్సనల్‌గా వెళ్ళి మాట్లాడితే పని జరుగుతుంది. నేను వెళ్ళి మాట్లాడటం కాస్తఎబ్బెట్టుగా ఉంటుంది."

"ఫరవాలేదు. మీకిబ్బంది కలిగించే విషయమైతే అవసరంలేదు. కానీ విమల మీ ఇద్దరూ క్లోజ్ ఫ్రెండ్స్ అని చెబితే... అలా అడిగాను"

విమల ప్రసక్తితో సమీర ముఖం కోపంతో జేవురించటం గమనించి ఆశ్చర్యపోయాడు శరత్. కానీ అది పైకి వ్యక్తపర్చలేదు.

"ఇంకేమిటి విశేషాలు? మీకిస్తున్న జీతంతో లైఫ్ కంపర్టబుల్‌గా ఉందా?"

"ఐయామ్ ఫైన్ శరత్. నాగురించి మీ కెందుకంతచింత? నేనేమంత గొప్పగా సర్వీస్ చేస్తున్నాను గనుక?"

"ఎవరి గొప్పతనం వారికి తెలీదు. నర్సింగ్ హోమ్ పెట్టినకొత్తలో ఇచ్చిన ఆ కొద్దిపాటి సేలరీతోనే అడ్జెస్ట్ అయారుమీరు! మీ స్వంత నర్సింగ్ హోమ్‌ను డెవలప్ చేసినంతగా అన్ని బాధ్యతలూ భరించి, రాత్రింబవళ్ళు శ్రమపడ్డారు. మీ విజ్ఞానమంతా ధారపోసి శ్రమించారు. రోగులకు మీ మీదున్న నమ్మకం నామీద లేదు. మీరు ఎం.డి. చేయటం పొరపాటు. ఎం.ఎస్. చేసిఉంటే బాగుండేది. సర్జరీలో చాలా చక్కటి హేండ్ మీది."

"ప్లీజ్! ఈరోజు కొత్తగా మాట్లాడుతున్నారు. ఎవరైనా పొగిడితే అసలు భరించలేను."

శరత్ నవ్వేసి వాచీ వంకచూశాడు.

"వెళ్ళొస్తానమరి?"

శరత్ వెనకే ఆమె కూడా కిందికి నడిచింది.

"రేపు మార్నింగ్ కాస్తత్వరగా రాగలరా?"

"వస్తాను."

"నాలుగు ఆపరేషన్‌లు ఉన్నాయి రేపు. కాస్త అసిస్ట్ చేస్తారని. వారిలో ఇద్దరూ ఐదేళ్ళ పసిపిల్లలవటంతో నాకు కాస్త టెన్షన్‌గాఉంది- ఎందుకో చెప్పలేను. పసిపిల్లలంటే నాకు ప్రాణం. వారిలేత శరీరాలను కత్తితోకోయవలసి రావటం నాకొక విషాదకర అనుభవం"

శరత్ కారెక్కుతుండగా అతను తెచ్చిన గిఫ్ట్ పేకెట్‌తో వచ్చాడు వంశీ.

"అమ్మా!"

తల్లి సలహాకోసం ఎదురుచూస్తున్నట్టుగా పలకరించాడు.

"ఏం తెచ్చారు అంకుల్?, విప్పిచూద్దాం" అంది సమీర.

వంశీ పేక్‌విప్పాడు. అందమైన ఇంపోర్టెడ్ బొమ్మ. రెండడుగుల ఎత్తుఉంది. దాని పొట్టలో క్యాసెట్ పెడితే, క్యాసెట్‌లో టేప్ చేసిన మాటలు, పాటలు, రైమ్స్ విన్పిస్తుంది.

శరత్ దాన్లో కేసెట్ ఎలా పెట్టాలో చూపించాడు.

"చాలాబాగుంది కదమ్మా"

వంశీ ఉత్సాహం చూసి సమీర ఏమీఅనలేదు. బాగుందన్నట్టుగా నవ్వింది.

"అంకుల్‌కు థాంక్స్ చెప్పావా మరి?"

"థాంక్యూ అంకుల్!"

"వెల్‌కమ్ డియర్! ఓ.కె.! గుడ్‌నైట్."

శరత్ కారు గేటుదాటాక రాములు గేటు వేసి లాక్ చేసుకొచ్చాడు.

"అమ్మా! ఈ అంకుల్ చాలామంచివారు కదూ!"

"అవునమ్మా!"

"ఈయనకు మనమంటే చాలా ఇష్టమా మమ్మీ?"

"ఎందుకు"?

"నేను నర్సింగ్‌హోమ్‌లో చేరినపుడు ఎంతో చక్కగా స్నేహంగా ఉన్నారు. నేను పిలవగానే పార్టీకి వచ్చారు."

"అంకుల్‌ని పిలిచానని నాతో చెప్పలేదేం చిన్నా. ఎంతో ఉత్సాహంగా ఉన్న వంశీ ముఖం చిన్నబోయింది?"

"ఏదైనా ఇలాంటి పని చేసేముందు నాకు చెప్పాలమ్మా. నాకు చెబితే నీతోపాటు నేనూ ఇన్వైట్ చేసేదాన్ని కదా?"

"ఇంకెప్పుడూ ఇలా చెయ్యను మమ్మీ"

"పద. అన్నం తిందువు గాని"

"ఆకలిగా లేదమ్మా"

"కాస్త పెరుగన్నం తినేసి పడుకో."

★ ★ ★

మెడికల్ జర్నల్స్ చదువుతున్న సమీర వంక నిశ్శబ్దంగా చూసి పళ్ళరసం గ్లాసు టేబుల్ మీద ఉంచింది అలివేలు.

గ్లాసు ఉంచి వెళ్ళిపోకుండా తటపటాయిస్తూ నిల్చున్న అలివేలుని గమనించి తలఎత్తకుండానే— "నువ్వెళ్ళు అలివేలూ! తర్వాత తాగుతానులే" అంది సమీర.

"పది దాటిందమ్మా. మళ్ళీ కొంపలు మునుగుతాయన్నట్టు తెల్లవారు ఝామునే నిద్ర లేస్తారు."

సమీర చిరునవ్వుతో తలఎత్తింది.

"నామీద నీకింత శ్రద్ధ ఎందుకు అలివేలూ? నేనేం చేశానని?"

"చల్లని తల్లివి. నీమీద అభిమానం లేనివాళ్ళ మనసులు పాషాణాలమ్మా."

"సరి! సరి! బాగుంది."

"పళ్ళరసం తాగి గ్లాసు ఇచ్చేయండమ్మా."

సమీర గ్లాసు తిరిగి ఇచ్చాక మరోసారి పడుకోమని హెచ్చరించింది.

"అరగంటాగి పడుకుంటాను. నువ్వెళ్ళు."

ఆమె సంగతి తెలిసిన అలివేలు నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది. అలివేలు వెళ్ళాక ఒకపది నిమిషాలు మాత్రం చదవగలిగింది ఆమె. ఇక పుస్తకంమీద మనసు నిలవక, బెడ్‌లైట్ వేసుకుని పక్కమీద వాలింది. విశాలమైన డబుల్‌కాట్ మీద పక్కనే వంశీ గాఢంగా నిద్రపోతున్నాడు. వాడి ముఖంలో ప్రతిఫలించే అమాయకత్వం ముగ్ధమోహనంగా కనిపించింది.

ఏం మాట్లాడితే తల్లి మనసు నొచ్చుకుంటుందోనన్న జంకుతో, ఆమెను బాధపెట్ట కూడదన్న సున్నిత భావంతో ఈపసి వయసులోనే ఎంతో విజ్ఞతతో, వివేకంతో మసులుకునే తనపసి బిడ్డఅంటే ఆమెకు పంచప్రాణాలు.

కానీ బంగారం లాంటి ఆ బిడ్డ మనసు తండ్రి కోసం మనసులోనే మూగగా పరితపిస్తుందని తెలిసి తనేమీ చేయలేని నిస్సహాయురాలైంది. విధి అన్ని విధాలా తన జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసింది.

ఆమె మనసు దుఃఖ భారంతో ముకుళించుకుపోయింది. ఉదయం మధుకర్ ప్రస్తావన వచ్చినప్పటి నుంచి ఆమె మనసు అసహనంతో వేగిపోతోంది. నిద్రపట్టని బాధతో అటు, ఇటు మెసలి వెల్లకిలా పడుకుని ఇంటి కప్పుకేసి చూడసాగింది.

ఎంత మరిచి పోదామన్నా మరవలేని గతం జ్ఞాపకాల సుడిలో గిరికీలు కొడుతూ నెమ్మదిగా ఆమె మనఃఫలకం మీదికి దాడి చేసింది.

★ ★ ★



UFC



"సమీరా. ఈరోజు గైనిక్ వార్డులో నీకు కావలసినంత పని. అన్నీ ఆపరేషన్ కేసులే. గైనిక్ చీఫ్‌కి నువ్వు పెట్‌విగా. అన్నీ నీచేతే చేయిస్తుందిలే! వెళ్ళు. రాత్రంతా నిద్రలేక నానాహైరానా అయింది. తలస్నానం చేసి నిద్రపోతాను. కాస్త నీళ్ళల్లో హీటర్ వెయ్యితల్లీ. మంచి దానివి కదా." అందానాడు రాధిక.

"నీబద్ధకం చూస్తే చిరాకేస్తుంది. మెడిసిన్‌కు నువ్వు అన్‌ఫిట్." అందితను.

"ఆఁ! పోదూ! మాబావ కోసం ఏదో మొక్కుబడిగా చదువుతున్నాను. నేను ప్రాక్టీస్ చేసేది లేదుగా." అనేసింది రాధిక.

"ఇంత చదువు వృధా చేసుకుంటావా? అలాంటి దానివి పి.జి. కూడా ఎందుకు చేస్తున్నావ్?" కోపగించుకుంది సమీర.

"చెప్పానుగా. మాబావ కోసమని. ఇంకెంత రెండు నెలలేగా. ఏయ్‌సమీ! నాతోపాటూ అమెరికా వచ్చేయకూడదూ? నీకో మంచి జాబ్ చూస్తాను. ఇండియాలో ఉండి ఏం సంపాదించు కోగలవు."

"నాకెందుకో అంత ఇంట్రస్ట్ లేదే!" సమీర తప్పుకో బోయింది.

"పోనీ మధుకర్‌ని కూడా రమ్మందాం." నవ్వింది రాధిక.

సమీర చెయ్యెత్తే సరికి దూరం జరిగింది.

నవ్వుకుంటూ తిరిగి గబగబా తలదువ్వు కోసాగింది సమీర.

"ఏం జుట్టోనీ! నాదిష్టే తగిలేట్టుంది. బాగా పొడుగుంటమే కాక కర్లీ హెయిర్ కూడా అవటంతో మరీ బాగుంటుంది."

"థాంక్స్ ఫర్ యువర్ కాంప్లిమెంట్స్." ఇంతలో ఆయావచ్చింది.

"సమీరమ్మా! మీకుఫోన్ వచ్చింది." అంటూ

రాధిక కొంటెగా నవ్వుతూ "అయ్యగారు పిలుస్తుండారు. వెళ్ళమ్మా" అంది.

రాధిక అల్లరికి సమీర కళ్ళు వినుక్కుంటున్నట్టుగా చూసినా పెదవుల కొసన చిరునవ్వు మాత్రం మెరిసింది.

కొస వరకూ అల్లిన జడ వెనక్కి వేసుకుంటూ బయటికి వెళ్ళింది.

★ ★ ★

గాలి తెరలకు సుతారంగా కదులుతున్న నీటిని, నీటిలోని చంద్రబింబాన్ని చూస్తూ పరధ్యానంగా కూచుని ఉంది సమీరా.

ఎదురుగా కూచున్న మధుకర్ రెప్పవాల్చకుండా ఆమెనే గమనిస్తున్నాడు.

గుండ్రటిముఖం, అందంగా వంపుతిరిగిన - నిండైన పెదవులు, నవ్వినప్పుడు సొట్టపడేబుగ్గలు, ఇవికాదు తననాకర్షించింది. ఆర్ద్రతను, సౌమ్యతను నింపుకుని భావస్ఫోరకంగా చలించే కనులు...! మనసుకు దర్పణంపట్టేవి కనులే!

ఆ కళ్ళే ఆమె హృదయ నైర్మల్యాన్ని, సౌకుమార్యాన్ని స్పష్టంగా ప్రస్ఫుటింప చేస్తుంటాయి.

తనని మాటిమాటికీ ఆకర్షించి, నిదురలో, మెలుకువలో కూడా వెన్నాడి, వేధించేవి ఆ కళ్ళే.

ఆమెచేతిని అందుకున్నాడతను.

"ఏమిటంత ఆలోచన?"

"నీ గురించే!"

"నేను నిజంగా జీవించేకాలం - నీ ఊహల్లో నే మెదిలినప్పుడే!"

"ఎందుకంత భావుకత? గడ్డిపూవును చూసి మల్లె అనుకొని భ్రమిస్తున్నావేమోనని నాభయం."

"ఈ తపన, ఆరాటం ఎందుకో నాకే అర్థంకావటంలేదు. వెర్రిలో కూడా ఇంత ఆనందముండేట్టయితే ఇదేఉండనీ".

సమీర మౌనంగాచూసి మందహాసంచేసింది.

కళ్ళలోంచి కురిసే వెన్నెల బుగ్గలమీదుగా జారి పెదవి అంచులో నిలిచినట్లనిపించిందా మందహాసం!

అతనిలో ఆవేశం ముంచుకు వచ్చింది.

"నిన్నుమొదటిసారి చూసింది రెండేళ్ళకిందట.

ఆరోజు నాకుబాగా గుర్తుంది.

అప్పుడే వర్షం కురవటం మొదలెట్టింది. చీకట్లు కమ్ముకురావటం నేను గమనిస్తూనే ఉన్నాను.

లైబ్రరీలో పుస్తకంలో తలదూర్చి కూచుని తపస్సు చేస్తున్నట్టుగా చదువుకుంటున్నావు నువ్వు.

వెనుకనుంచి చూశాను. నీ తలకట్టు, పొడుగాటి జడ, భుజాలవంపు ఎంత అందంగా కనిపించాయనీ!

వెనుకనుంచి ఇంతబాగున్న ఈ అమ్మాయి ఖచ్చితంగా అనాకారి అయిఉంటుందనుకుంటూ పక్కకు వచ్చాను. అక్కడున్న పుస్తకాలు సవరిస్తూ నీవంకచూసి షాక్‌తిన్నట్టుగా అయ్యాను.

దాన్నే మన కవులు దిగ్భ్రాంతి అంటారు. కదూ!

ఆ తర్వాత నిన్ను గమనిస్తూ కూచుండిపోయాను. అంతచీకటి పడుతున్నా నువ్వు కదలకపోవటంతో అర్థమైంది.

నీకు చదువంటే చాలా ఇష్టమనీ—

ఆ సమయంలో పరిసరాలు మరిచిపోతావనీ!

నా అంచనా నిజమే. ఉరుము ఉరమటంతో. ఉలిక్కిపడిచూసి వాచీచూసుకొని కంగారుగా పుస్తకంమూసి వరండాలోకొచ్చి నిలబడ్డావు.

నాదగ్గర గొడుగుంది. టార్చికూడా ఉంది.

నీ ముఖంలో ఆందోళన చూడముచ్చటగానే ఉన్నా, నీ బాధను కాసేపుకూడా చూస్తూ భరించలేని బలహీనత నాలో ప్రవేశించింది.

అందుకే నీ దగ్గరికొచ్చి నీకవసరమైనవి ఆఫర్‌చేశాను.

మొహమాటపడ్డావు.

కానీ తప్పనిసరి పరిస్థితి.

నాకు స్కూటరుందని తెలిశాక తీసుకున్నావు.

అవి తిరిగి ఇచ్చేందుకు నాపేరు అడిగావు.

నీపేరు చెప్పావు.

నీ సామీప్యం, మాటలద్వారా మనమధ్య మొగ్గతొడిగిన ఆ పరిచయపు తాలూకు మత్తు నన్నెంతటి పారవశ్యంతో తూలిపడేలా చేశాయో!

దాన్ని వివరించేందుకు నాకున్నశక్తి చాలదనిపించిందప్పుడు.

నీకు కాస్తదూరంలో స్కూటరుమీద అతినెమ్మదిగా హాస్టల్‌దాకా ఫాలో అయ్యాను.

దారిలో నీకేప్రమాదం కలుగుతుందోనని నాభయం.

అప్పుడే ఆ క్షణాన్నే నువ్వు నా సొత్తుగా మారినట్టూ, దానినెవరూ నాశనంచేయకుండా కాపాడుకోవాలన్నట్టూ భావన కలిగింది నాలో.

ఆ రాత్రి అలా వర్షంలో తడుస్తూనే హాస్టల్‌కెళ్ళాను.

భోజనమైనాచేయకుండా, ఆ తడిచొక్కాతో అలానే చీకట్లో పడుకొన్నాను.

బయట కురుస్తున్న వర్షపు చప్పుడువింటూ, దిండులో తలదాచుకుని ముడుచుకు పడుకున్నా. మల్లెరేకులు పరిమళాన్ని బంధించి ముకుళించుకుని రక్షిస్తున్నట్టుగా, నా మనసునిండా నీ ఊహల పరిమళం!

నా మనసుచుట్టూరా నీ గురించిన ముగ్ధమనోహరభావం.

శరీరంలో అలజడిని రగిలించేది కోరిక, కామం.

అది క్షణికమే!

కానీ మనసులో అలజడిని రగిలించి, ఊహలో తేలియాడేలా చేసేది ఏమిటి?

దాని పేరేమిటి?

మనిషి దూరమైనా, అతిచేరువగా ఉన్నట్టు అనిపించేలా చేసేది ఏమిటి?

ఏమిటి? కాలిబొటనవేలినుంచి, తలవెంట్రుకదాకా నా ఒళ్ళు పులకరించింది.

ఇది కామాన్ని మించిన మత్తుని కలిగించే పారవశ్యపు మైకం!

నీ కళ్ళు, చూపు ఊహలో మెదులుతున్నకొద్దీ శరత్కాలపు రాత్రివెన్నెల చల్లదనాన్ని పులుముకొని ప్రవహించే నదీప్రవాహంలా నా అణువణువునా ప్రవహిస్తున్న రక్తమంతటా మధురిమ నిండిపోయింది.

ప్రేమలో పడ్డవాడూ, మధువు తాగినవాడూ ఒకటే అంటారు.

కానీ మధువుకన్నా మైకం కలిగించేది ప్రేమ అని తెలుసుకున్నాను."

భావోద్వేగంతో మధుకర్ ముఖం జేవురించింది. అతని కన్నుల్లోకి నీళ్ళు చిప్పిల్లాయి.

"మధూ! ఏమిటీపిచ్చి!"

"జన్మనిచ్చేది స్త్రీ!

తోబుట్టువుగా చేయూతనందించేది స్త్రీ!

సహచరిగా, ప్రేయసిగా జీవిత పరమార్థాన్ని తెలియజేసి, సంతృప్తినిచ్చేదీ స్త్రీయే!

కానీ నా విషయంలో నాకు జన్మనిచ్చిన తల్లిని చూడలేదు.

తోబుట్టువులెవరూలేరు.

కానీ అన్ని రూపాలనూ నీలోనే చూసుకున్నాను నేను."

అతన్ని కాసేపు ఆ ఉద్వేగంలో ఉండనిచ్చి నెమ్మదిగా అంది.

"నీకు నా గురించి ఏమీ తెలియదు. ప్రేమ అనే మత్తులోపడి, ఆ దృష్టితోనే చూస్తున్నావు నన్ను. నా గతం ఏమిటో, నిన్ను నేను చేరుకొనేందుకు నాకున్న అర్హతలేమిటో కాస్త అయినా తెలుసుకోలేక పోతున్నావు."

"నాకు నీ గురించి అంతా తెలుసు. కానీ అలా ఎందుకు జరిగిందో మాత్రం అర్థం కాలేదు. కొలనులోని పద్మం తనచుట్టూ ఉన్న కల్మషాన్ని మరిచిపోయి తన విభుడి కోసం చలిలోనూ, ఎండలోనూ నిలిచి నిరీక్షిస్తూ తపస్సు చేస్తున్నట్టుగా — నీ ముఖం, నీ చూపులు నాకాఊహను కలిగిస్తుంటాయి నిన్ను చూసినపుడు. నాకా గతం గురించిన అభ్యంతరం లేదు. ఆ విభుడిని నేనే అయితే చాలు."

సమీర మ్రాన్పడిపోయి చూసింది. తన గురించి అంత వివరంగా తెలిసిన వాళ్ళెవరున్నారు? అదే అడిగిందతన్ని.

"విమల చెప్పింది. ఆమె మీ క్లాస్‌మేట్ అట. ఆమెభర్త నాకు క్లాస్‌మేట్. వాళ్ళింటికి వెళ్ళినప్పుడు నా పర్స్‌లో నీ ఫొటో చూసి వివరాలు





అడిగింది. చెప్పాను. పని కట్టుకుని ఇంటికి పిలిచి మరీ వినిపించింది నీ గురించి.''

తన గురించి తెలిసినా, ఆ విషయం పట్ల అతి కుతూహలం కానీ, వెక్కిరింత కానీ వ్యక్తప ర్చని అతని సంస్కారం ఆమెని ముగ్ధురాలిని చేసింది. మధుకర్ చిన్నగా నవ్వాడు.

''నాగురించీ నువ్వు తెలుసుకోవలసింది కొంత ఉంది. ఎమ్.బి.బి.యస్. అవగానే నాకు పెళ్ళింది. నన్ను పెంచిపెద్ద చేసిన అత్తయ్యకు కేన్సర్. అమ్మ, నాన్న పోగానే ఆమెనన్ను చేరదీసి ఆదరించింది. ఆవిడ కొడుకు బాధ్యతా రహితంగా, జులాయిగా తిరిగి ఆస్తి నాశనం చేస్తున్నాడు. అందుకే కూతురిని, ఆస్తిని నా చేతిలో ఉంచింది. నాపెళ్ళి అయాకే నేనిక్కడికి వచ్చి ఎమ్.ఎస్.లో చేరాను. నిన్ను చూశాక తెలి సింది— జీవితంలో నేనేం పోగొట్టుకున్నానో.''

సమీర స్తబ్ధురాలై చూస్తూండి పోయింది.

''అత్తయ్య మాపెళ్ళి అయిన రెండు రోజులకే మరణించింది. ఆవిడ మరణించాకే తెలిసింది, నాభార్య మరోవ్యక్తిని ప్రేమించి, తల్లి బలవంతం మీద నన్ను చేసుకుందని. అప్పుడే విడాకులిచ్చే వాడినే! నిజానికి మామధ్య ఇంతవరకూ ఏ బంధమూ లేదు, మూడుముళ్ళ బంధం తప్ప. మా అత్తయ్యకు కూతురి ప్రేమ వ్యవహారం తెలిసే, మాకు వివాహమైన రెండేళ్ళదాకా ఆస్తిలో చిల్లి గవ్వకూడా కూతురికి దక్కదని రాసింది. అంతవరకూ దాన్ని ఎవరికీ రాసిచ్చే హక్కు నాకూ లేదనీ, వివాహమైన రెండేళ్ళ తర్వాతే, ఆస్తి మాఇద్దరికీ సగం సగంఅనీ విల్లు రాసింది. ఈలోగా విడిపోయినా, విడాకు లిచ్చినా కూతురికి ఆస్తిమీద ఏఅధికారం ఉండదని రాసింది. అందుకే ఆగాము. ఇంకో మూడు నెలల తర్వాత ఆస్తిమాకు సగం, సగం చెందుతుంది. నా సగ భాగం మాఅత్తయ్య కొడుక్కు రాసిచ్చి, నా భార్యకు విడాకులిచ్చి నిన్ను చేసుకుంటాను. మా అత్తయ్య కొడుకు కూడా ఇప్పుడు మారిపోయా డు. ఏదైనా వ్యాపారం చేసుకుని బాగుపడాలను కుంటున్నాడు.''

''ఈమధ్య కాలంలో నువ్వు మళ్ళీ నీ భార్య దగ్గరికి వెళ్ళ లేదా?''

''లేదు. రమ్మని చాలాసార్లు రాసింది. కానీ నాకే వెళ్ళబుద్ధి కాలేదు. వివాహమయాక మళ్ళీ ఆమెనింతవరకూ కలవలేదు. దూరపు బంధువు రెండు, మూడుసార్లు వచ్చి వెళ్ళాడు. నేను చేస్తున్నపని తప్పని మందలించాడు. నా భార్య ఇప్పుడు మారిందని కూడా చెప్పాడు. నువ్వు పరిచయం కాకపోయి ఉంటే పరిస్థితి ఎలా ఉండేదో— కానీ నిన్నుతప్ప ఎవ్వరినీ భార్యగా ఊహించను కూడా ఊహించ లేనిప్పుడు.''

సమీర మనసు విరక్తితో నిండి పోయింది.

అతను చేసుకున్న భార్యను వదిలించుకుని తనను చేసుకుంటాడన్న ఊహ ఆమె మనసును బాధిస్తోంది.

తమఇద్దరి నడుమ మరోవ్యక్తి, అతనిపై సర్వా ధికారాలు చేజిక్కించుకుని అడ్డుగా నిలిచి ఉందన్న ఆలోచన ఆమె మనసులో నరకాన్ని సృష్టిస్తోంది.

సమీర కళ్ళల్లో మెరిసిన తడి అతన్ని కలవర పర్చింది.

''ఎందుకు? ఏమైంది? నిజానికీ సంగతి మన వివాహం అయ్యాక చెబుదా మనుకున్నాను. కానీ ఈ రోజెందుకో నానోటి నుంచి వచ్చేసింది. నన్నింత కలవర పరుస్తుందనిపిస్తే చెప్పేవాడినే కాదు. రెండు సంవత్సరాలుగా నేను ఆమెని కలవలేదు, మాట్లాడలేదు. ఉత్తరం కూడా రాయ లేదు. మా అత్తయ్య నాకు నెలనెలా బ్యాంక్‌లో వడ్డీ జమపడేలా ఆస్తి రాయటంతో డబ్బు గు రించి దిగులు కూడాలేదు. నిశ్చింతగా ఉండి పోయాను. వాస్తవంలో మేము జ్యుడీషియల్‌గా విడిపోయినట్లే.''

''కానీ ఈ రెండేళ్ళల్లో ఆ అమ్మాయిలో మార్పు వచ్చిఉంటే? మీ అత్తయ్య ఎంతో నమ్మకంతో ఆస్తిని, కూతురిని నీ కప్పగిస్తే ఇలా నమ్మక ద్రోహం చేయటం తప్పుకాదా?''

''ఆమెంతట ఆమే నన్ను తిరస్కరించింది గదా?''

''కారణాలు ఏమైనా నాకెందుకో ఇదంతా చాలా విరక్తిని కలిగిస్తోంది.''

''అవన్నీ నాకొదిలేసి నువ్వు నిశ్చింతగా ఉండు.''

సమీర పెదవి కొరుక్కుంటూ ఆలోచిస్తూండి పోయింది.

కొద్ది క్షణాల తర్వాత హఠాత్తుగా లేచి నిలబడింది.

"వెళ్దాం ఇక."

"నువ్వు బాధపడకు. నువ్వీ మూడ్స్‌లో ఉండగా విడిపోతే నాకెలాగో ఉంటుంది. ఏపనీ చేయబుద్ధి కాదు."

"నువ్వీ నిజం రెండువారాల కిందటచెప్పి ఉండాల్సింది."

అతను దెబ్బ తిన్నట్టుగా చూశాడు. "నామీద నమ్మకం లేదా నీకు?"

"అందుకు కాదు. మరోస్త్రీ జీవితంతో చెలగాటమాడుతున్నానేమోనన్న సంకోచం!"

అతని ముఖం గంభీరంగా మారిపోయింది.

మరేమీ మాట్లాడకుండా లేచినుంచుని పేంట్ జేబుల్లో చేతులుంచుకుని ముందుకు నడిచాడు.

"పద! వెళ్దాం."

సమీర మౌనంగా అనుసరించింది.

● ● ●

"సాగర్ వెళ్దామా?" అన్నాడు మధుకర్.

"ఎందుకూ?" అంది సమీర చిరుకోపంతో.

"నిన్ను చూస్తుంటే తనివితీరటం లేదు. ఓ రెండు రోజులు సాగర్‌లో ఉంటే నలభై ఎనిమిది గంటలూ నీ ఎదురుగా కూచుని చూసుకుంటేనైనా తృప్తి కలుగు తుందేమో చూస్తాను. ఎలాగూ స్ట్రయిక్ మూలంగా రెండు రోజులు సెలవు లొస్తున్నాయి కదా!"

"జీవితమంతా చూసుకుని బోర్ కొట్టించుకునే రోజులు ముందున్నాయి."

"మనమిద్దరం డాక్టర్లమే! చూసుకుని బోర్ కొట్టించుకునే అవకాశం ఎక్కడుంది మనకు?"

సమీర ఎటూ చెప్పకుండా నవ్వేసింది.

"ప్లీజ్! కాదనొద్దు."

"ప్లీజ్ అంటే ఏమైనా ఒప్పుకోవల్సిందేనా?"

"రెండేళ్ళుగా చూస్తున్నావు. నామీద నమ్మకం లేదా?"

"నమ్మకం గురించి కాదు."

"మరి?"

"అంత అవసరం ఏముందాని!"

"పోనీ! నీ కిష్టం లేకపోతే వద్దు. ఎంతో కష్టపడి దేనినైనా పొందితే, దానిని పొందటంలో ఉన్న తృప్తి పోతుంది నాకు."

"అడ్వెర్స్!"

"అఫ్‌కోర్స్! నాతత్వమే అంత. అనుకున్నది అప్పటి కప్పుడు స్వేచ్ఛగా పొందితే కానీ తృప్తి కలగదు."

"సరే! వెళ్దాం."

అతని ముఖంలో వెలిగిన సంతోషం చూసి చిరునవ్వు నవ్వింది.

★ ★ ★

12 మే

వైశాఖ మాసం! ఎండలు మండిపోతున్నాయి. ఈ ఎండలకు పగటి సమయాన జనం అల్లాడిపోతున్నా రాత్రిళ్ళు నిర్మలాకాశాన్ని చూస్తూ, ఆరుబయట పడుకుని, చల్లగాలిని ధారాళంగా ఆస్వాదిస్తూ నిదురపోతున్నారు. వైశాఖమాసపు పున్నమి చంద్రుడు, ఏ అడ్డుతెరలూలేని విశృంఖలత్వంతో వెన్నెలలు విరజిమ్ముతున్నాడు. ఎక్కడ చూసినా పెళ్ళిపందిళ్ళే, బాజా భజంత్రీల మోతలే!

రాత్రిళ్ళు నిశ్శబ్దంగా విచ్చుకునే మల్లెలు ఎంతో కాలంగా దాచిన వలపులను విభునికి అర్పించుకునే ముగ్ధలా తమ పరిమళ సంపదను గాలి తరగల చల్లదనానికి పరవశించిపోతూ అర్పించుకుంటున్నాయి. వాయుదేవుడు పూభామినుల హృదయాలను కొల్లగొట్టి ఆ సంపదతో ప్రేమికుల ఊహలను, కొత్త జంటల మనసులను రంజింపచేస్తూ నగర సంచారం చేస్తున్నాడు.

ఎండలను చల్లబర్చేందుకు దయతల్చినట్టుగా ఆకాశం వర్షధారలను కురిపించిందీ సాయంత్రం!

ఈ సాయంత్రం ఆకాశంలో మెరిసిన మెరుపులాగే, నా మనసు పొరల్లోని అంధకారాన్ని పారదోలే మెరుపు మెరిసింది. చెక్కిట చెయ్యిచేర్చి, చదువే సాధనగా మార్చుకున్నట్టుగా, తపస్వినిలా కూచున్న ఆ భంగిమ నా హృదయాన్ని కొల్లగొట్టింది. చీకటిలో నిండిన అంతరంగపు పొరలు సూర్యకిరణం తాకిడికి విచ్చుకున్నట్టుగా, హృదయపు లోతుల్ని స్పర్శిస్తూ, ఆ చూపులు నాలోకి దూసుకుపోయాయి.

ఆమె ముఖంలో, హావభావాల్లో శరీరపు వంపు సొంపుల్లో శృంగారంలేదు. పవిత్రత, సంస్కారం మూర్తీభవించినట్టుగా నా ఎదుట నిల్చున్న మూర్తిని చూడగానే నా మనసు మూగపోయిన రాగంలా స్తంభించిపోయింది. ఛ! మూగపోయిన రాగం—ఏమిటీ పోలిక!

ఆమెను ఆపదలో ఆదుకోగలగటంతో ఏవేవో అందరాని శిఖరాల నధిరోహించినంత గర్వం, తృప్తి కలిగాయి.

ఆమెను క్షేమంగా గమ్యంచేర్చి, మౌనంగా గదికివచ్చి చేరాను. మౌనంగా, కళ్ళు మూసుకుని చీకట్లో పడుకున్నాను. వంట్లో రక్తం ఉధృతంగా ప్రవహిస్తూ వయసును, నా యవ్వనాన్ని తొలిసారిగా మేల్కొల్పి, నాకు జీవిత మాధుర్యపు స్పృహ తెలిసేలా చేసింది.

పార్వతిని చూసిన శివుడు, సీతను చూసిన రాముడు, తమకోసమే వారు పుట్టినట్టుగా ఎలా గ్రహిస్తారా అన్న అనుమానానికి ఈ రోజు సమాధానం దొరికింది.

ప్రతి మనిషికీ, ఓ గమ్యం ఉండేట్టయితే—ఓ అపరిచిత స్త్రీ మూర్తీ, మంజుల మనోజ్ఞ మూర్తీ! నా గమ్యం, నా జీవితం, నా పుట్టుక, నా ఉనికి, నా ప్రాణం, నా శక్తి, నా విజ్ఞానం, నా వివేకం, నా సంపద, నా సర్వస్వం—సమస్తం నీదే!

20 జూన్, (జ్యేష్ఠం) :

ఆమెను రోజూ చూస్తున్నాను. కానీ నన్ను మాత్రం ఆమె చూడటంలేదు.

ఏదో గమ్యం చేరేందుకు నిరంతర పరిశ్రమ చేస్తున్న అలసటతోకూడిన స్తబ్దత ఆమె కళ్ళల్లో, చూపుల్లో నిండి ఉంటుంది.

మౌనం, నిరాడంబరత స్త్రీలకెంత గాంభీర్యాన్ని సంతరించిపెడతాయో ఆమెని చూస్తుంటే తెలిసి వస్తుంది. నన్ను కలవరపర్చేది ఒకటే! ఆ కన్నుల్లో ప్రతిఫలించే నిర్లిప్తత! ఎందుకలా? గంగాఝరీ ప్రవాహంలా, జలపాతంలా ఉరకలెత్తే వయసులో ఎందుకంత స్తబ్దత! ఎందుకా జడత్వం! ప్రేమలో విఫలత్వం కాదుకదా! ప్రభూ! అది మాత్రం కానివ్వకు.

11 జులై, (ఆషాఢం) :

ఆకాశం మబ్బులు కమ్ముకుని ఉంది. ఉండి ఉరుముల గర్జనలతో జడిపిస్తోంది. వాతావరణం మనోహరంగా ఉంది. ప్రపంచం ఎంతో అందంగా కనిపిస్తోంది. బహుశా ఆమె ఈ ప్రపంచంలో ఉన్నందువల్లనేనేమో!

ఏమో అనుకున్నాను. కానీ ఆమెని పలకరించి పరిచయం చేసుకోవటం చాలా కష్టం! బహుశా ఆమె నాకెప్పటికీ దక్కదేమోనన్పిస్తోంది.

ఓ ప్రభూ! మహానుభావా! నీ ఉనికిని ఇంతవరకూ గుర్తించలేదు నేను. ఆమెపట్ల నాకున్న ఈ ప్రేమ, తాదాత్మ్యత, ఆకర్షణ, ఆరాధన—మరేదైనా కానివ్వు, ఆ భావంలోని సఫలత్వాన్ని సంపూర్ణత్వాన్ని నాకు ప్రసాదించు. మహాత్మా! ఆనందాన్ని అంటుకునే విషాదం వెలుగును తాకుతూనే అంధకారం, సుఖాన్ని చుట్టుకునే దుఃఖం, ప్రకృతిలో ఎన్నో వైరుధ్యాలను సృష్టించిన నువ్వు గొప్పవాడివే! మనసుకన్నా అతీతమైన ఈ ప్రేమ భావనను మాత్రం నా నుండి దూరం చెయ్యకు. ఏ స్త్రీమూర్తి ఒడిలో నా స్వర్గాన్ని నిర్మించావో ఆ స్వర్గాన్ని నాకు దూరం చెయ్యకు. మా నడుమ వారధి నిర్మించు ప్రభూ! మా మనసుల, దేహాల నడుమనున్న అంతరాల నధిగమించి, ఆమె సన్నిధిని చేరేందుకు అవసరమైన వారధిని నీ అదృశ్యహస్తంతప్ప మరేదీ నిర్మించలేదు.

17 ఆగస్టు (శ్రావణం) :

నేను చేసిన మౌన నివేదన ఆమె హృదయాన్ని తాకినట్టుంది. ఇంతకాలానికి నాబాధ, తపన, ఆరాటం, ఆర్తి, నా తపస్సు ఆమెకు అర్థమయ్యాయి. గుడిలో కలిసి మళ్ళీ వర్షం మూలంగానే చిక్కుకుపోయాము.

ఎన్నో రోజులుగా నాలో రగులుతున్న అగ్నిపర్వతం ఆమె సామీప్యపు ఒత్తిడికి ఫెళేలున బద్దలై కన్నీటిసెగలు విరజిమ్మింది. ఆమెకు నేను అర్థమయ్యాను. అదిచాలు. ఇక ఆమె నా గురించి ఆలోచిస్తుందన్న ఊహే ఊరడింపుగా మిగిలింది.

ఆమెపట్ల నాకున్న భావం వినగానే జపాకుసుమాల్లాంటి కనులు, ఆశ్చర్యంతో విచ్చుకున్నాయి. తిరుపతి కాలేజీనుంచి ట్రాన్స్‌ఫరయి వచ్చిందట. చదువుమీదున్న కాంక్ష, తపన, కోరిక తనకు వేటిమీదా లేవంది. రాత్రంతా చదివినట్టుగా ఎర్రబారిన కన్నులు చూస్తుంటే ఆమె మాట అబద్ధం కాదనిపించింది. అందుకే అన్నింటిలో


వేకువ ఝామున నేస్తం—
జెమిని
పళ్లపొడి
మీ దంత సౌభాగ్యానికి
సంపూర్ణ రక్షణ
స్పిరమెంటు, పిప్పరమెంటు, లవంగనూనెల అపూర్వ సమ్మేళనం.
Gemini
TOOTH POWDER
GEMINI
FOR STRONG GUMS AND HEALTHY TEETH
Blended with SPEARMINT CLOVE PEPPERMINT OIL
GEMINI
TOOTH POWDER
SPECIAL
GEMINI
MENTHOLATED
GEMINI CHEMICAL PRODUCTS
MACHILIPATNAM 521001 (AP)
జెమిని కెమికల్ ప్రొడక్ట్స
P.B.No.7 మచిలీపట్నం-521001.

నూ ఆమే ఫస్ట్! ఎం.బి.బి.ఎస్.లో యూనివర్సిటీ ఫస్ట్ అని, గోల్డ్‌మెడలిస్ట్ అని అదివరకే విని ఉన్నాను. ఎం.డి.లో కూడా ఫస్ట్ వస్తుంది.

నాకు జవాబేమీ చెప్పకుండానే విడిపోయింది. అయినా శరత్కాలపు నదీ ప్రవాహంలోని తేటదనాన్ని ప్రతిఫలించే ఆమె చిరునవ్వు నాకు పరిచితమైంది. ఆ నవ్వుకోసమే బ్రతుకుతున్నానా అనిపించేంత గాఢంగా అది నా హృదయాన్ని ఊరడించి సేదతీర్చేది.

ఆ తర్వాత తర్వాత నన్ను చూసినప్పుడంతా ఆమె కన్నులు కాంతి పుంజాలు విరజిమ్మేవి. ఆమె కూడా నా ఆకర్షణకు లోనవుతున్న భావన, అంతరంగానికే విదితమయ్యే సున్నితమైన ఊహ అది! హిమకిరణం తాకిడికి విడిగిపోయే మంచుతెరల్లా మా నడుమ పేరుకునున్న నిశ్శబ్దం కరిగి ప్రవహిస్తూ, ఊహల తెప్పలు అటూ ఇటూ సాగేవి. పరిచయమైన ఇన్ని నెలల తర్వాత ఆమె స్నేహం దొరికింది. ఈ స్నేహం జీవితాంతం కలిపిఉంచే బంధానికి దారితీసేందుకింకెన్ని గంటలు, రోజులు, వారాలు, నెలలు, ఏళ్ళు పడతాయోనని బెంగవేస్తుంది.

5 సెప్టెంబరు (భాద్రపదం) :

బాగా జ్వరం వచ్చింది. హాస్పిటల్‌లో స్టూడెంట్ సిక్ రూమ్‌లో చేరాను. నా అంచనా తప్పుకాలేదు.

ఆమె వచ్చింది! భగీరథుడి తపస్సు ఫలింపచేసేందుకు భువికి తరలివచ్చిన సలలిత ఝరీ ప్రవాహంలా—మందగమనంతో నా కనుల ముందుకు నడిచివచ్చిన ఆ మూర్తిని చూడగానే, కోటి దీపాల కాంతికి చూపు చెదిరి అంధుడినైనట్టుగా తోచింది. కనులు మూస్తే మాయమవుతుందన్న భయంతో రెప్పవాల్చకుండా పరికించానామెను.

ఆమె పలకరించగానే—సూర్యరశ్మితాకి కరిగి ప్రవహించే హిమనగంలా, మనసులో పేరుకుని ఘనీభవించిన లాలిత్యమైన ఊహలన్నీ కదిలి ఒళ్ళంతా ప్రవహించి మేను జలదరించింది. ఒళ్ళు తెలియని ఆనందంతో పులకరించింది. ఆమె చీర కుచ్చిళ్ళ మడతల్లో ముఖం దాచుకుని, మౌనంగా, ఆర్తిగా రోదించాలన్న బలీయమైన వాంఛ. ఎందుకింత ఉద్వేగం! ఆమె గురించిన ప్రతి చిన్నయోచన నన్నెందుకింత చలింపచేస్తుంది. పెనుగాలికి ఊగే బలహీనమైన తీగలా తనువు, మనసు ఎందుకిలా ఉన్మత్తతలోపడి ఉద్రూతలూగుతాయి? భగవంతుడా! హృదయవీణా తంత్రులను మరీ ఇంత తీయగా శ్రుతి చేయకయ్యా! ఏ క్షణాన తీగతెగి రాగం మూగపోతుందోనన్న వ్యధతో పిచ్చివాడిని అవుతున్నాను.

ఇది వయసు ఉరవడా? కాదు. ఆ ఉడుకు రక్తంకాదు. ఇది మనసుకు చెందిన స్పందన తాలూకు పారవశ్యమే! ఆమె ఆ స్పందనను గ్రహించింది. ఇక అంగీకరించడమే తరువాయి. అదీ అయింది! ప్రేమ అనే మధురమైన అనుభూతినందుకునేందుకు లోకాన్నయినా ఎదిరించి జయించాలన్నట్టుగా ఆమె చేతులు నాకోసం ముందుకు వచ్చాయి. ఆ దోసిటిలో నా ముఖం భగవంతుడి పూజకు సమర్పించబడ్డ పుష్పంలా అనిపించింది. ఆ చేతులు నా తలని అమితమైన కరుణతో దగ్గరికి తీసుకుని వక్షంలో దాచుకున్నాయి!

భగవంతుడా ఈ తృప్తిచాలు! ఈ ఆనందం చాలు! ఇంతకన్నా అధికంగా హృదయ విపంచిని మీటకు! రాత్రి వికసించిన కుసుమం ఉదయపు చలిగాలికి పరిమళాన్ని అర్పించి శూన్యమై, చెట్టునుంచి రాలిపడి ఎండిపోతుందని తెలుసు.

పువ్వుకు పరిమళాన్ని వెదజల్లటమే జీవిత పరమార్థత!

మనసున్న మనిషిగా వలపుతో నిండిన హృదయం పులకరించి తుళ్ళిపడుతుంటే ఆ తుళ్ళింతను, పులకరింతనూ తనివితీరా ఆస్వాదించటమే సార్థకత!

అందుకే తనను తాను ఏమీ దాచుకోకుండా తప్పు ఒప్పులతో సహా సమర్పించుకోవటంలోనే తాదాత్మ్యత! పలవరించి, పలవరించి...వలపు వెల్లువలో స్పృహ తెలియని మునకవేసి కొట్టుకుపోవటంలోనే ఉంది జీవితానందం!

వీణియ తీగపై పలికే రాగం,

కుంచెనుండి వెలికి దూకే కమనీయ చిత్రం,

అనువుగా కవి హృదయంనుంచి వెలికివచ్చే గేయం!

నర్తించే పాదాలు,

స్వరాలను ఆలపించ నున్నాం!

ఉదయించే ఉదయ భానుడి అందం, అస్త మించే సంధ్యా విభుడి సొగసు,

చలిగాలికి చమర్చే పూతీగె,

వర్షధారలకు తడిసి, పరిమళించే ప్రకృతి అందం!

పంచేంద్రియాలకు ఆలవాలమైన హృదయానికి, హృదయానికి ఆలంబనగా నిలిచిన తనువుకు—ఎందుకిన్ని మధురానుభూతులను ఏర్చి కూర్చావు! ప్రభూ!

ఎప్పుడో ఈ సరంతెగి, ముత్యాలలాంటి అనుభూతులన్నీ చేజారి, చెల్లా చెదురవుతాయన్న భయం—ఎందుకో ఇలా!

బహుశా ఎన్నడూ ఆశించని ఊహించని అదృష్టం దక్కినందుకు, దక్కిన అదృష్టం ఏ క్షణంలో దూరమవుతుందోనన్న భయం! బెంగ!

12 మే.(వైశాఖం)

సంవత్సరం తిరిగింది. వసంతం వచ్చేసింది. ఆమెను ఏడాదికిందట తొలిసారిగా చూసింది ఈరోజునే!

గుడికి వెళ్ళి దైవదర్శనంచేసుకుని గుడి ఆవరణలోకి నడిచాను.

పొన్నాగవృక్షంకింద, పరమశివుడి ప్రేమకు పరవశించి ప్రత్యక్షమైన పార్వతిలా—

అరిటాకుపచ్చకు ముదురు ఎరుపుబార్డర్ ఉన్న పట్టుచీరతో, తలనిండా మల్లెపూలతో, కళకళలాడే నుదుటమెరిసే గుండ్రటి కుంకుమతో—దయవొలికే దాక్షాయణిలా........

ప్రేమకూ పార్వతే!

ప్రణయానికీ పార్వతే!

రౌద్రానికీ పార్వతే!

విలయానికీ పార్వతే!

నువ్వు తల్లివే, చెల్లివే, ప్రేయసివే, దేవతవే—

నాసమస్త అనుభూతులనూ స్పందింపచేస్తూ, జీవితగమనంలో పడే ప్రతి అడుగుకూ స్ఫూర్తినిస్తూ , అంధకారం అలుముకున్న అంతరంగపు లోగిలిని వెలిగిస్తూ నిర్మలమైన వెలుగును ప్రసరింపచేసే చిన్మయ జ్యోతిలా— ఓ నాదేవతా! నడిచిరా నువ్వు నాజీవిత నందనాన చైత్రమై!

24 సెప్టెంబర్ (భాద్రపదం):

చదువైపోవస్తోంది. ఆమె మందలింపునకు సిగ్గుపడి, నాఉద్వేగాన్నీ ఉన్మత్తతనూ అతిప్రయత్నం మీద తగ్గించుకుని చదువుమీద మనసు కేంద్రీకరించాను.

కాబోయే సర్జన్ని. ప్రేమ మత్తులోపడి చదువు నిర్లక్ష్యంచేస్తే ఆమె నన్ను అలక్ష్యం చేస్తుందన్న భయంతో, ఆమెని మెప్పించేందుకే చదివాను. మన మనసుమీద ఇంకోవ్యక్తి ప్రభావం ఇంత బలీయంగా ఉంటుందని తెలియటం ఇదే మొదటిసారి! ఇంతకాలం నాకోసం నేను బ్రతికాను. ఆమె నాజీవితంలో ప్రవేశించాకే అర్థమైంది! ఆమెకోసమేనేనని! ఆమె మెప్పుకోసం కాకపోతే. నిద్రాహారాలు మాని తపస్సు చేసినట్టుగా, ఇంతగా చదివి ఫస్ట్ మార్కులు తెచ్చుకోలేక పోయేవాడినేమో!

విరహంతో, మధురమైన భావనలతో వేగిపోయే హృదయాన్ని సర్జరీ పాఠాలపైకి, ఆపరేషన్లపైకి మళ్ళించటం— గంగా ప్రవాహాన్ని భూమిమీదికి ప్రవహింపచేసిన భగీరధుడిలాంటి వాడికి కూడా సాధ్యం కాదేమో!

అసాధ్యాన్ని సుసాధ్యం చేసేదే ప్రేమ!

ఆమెకోసం నగ్నపాదాలతో హిమశిఖరాలనధిరోహించటం కూడా సులభతరమేనన్పిస్తుంది.

నిజమే! విరహం సృష్టించే అగ్ని కీలలకు ఆ హిమం కూడా కరిగి ప్రవహిస్తుంది కదా! అప్పుడిక కష్టం ఏమీ ఉండదు. శీతల ప్రవాహంలో గొంతుక మునిగే వరకూ నిలిచి చెలిని గూర్చి తపస్సు చేయటమే!

వర్షాలు పడుతున్నాయి. చీకట్లు విచ్చుకొని వేకువఝాము సమయంలో గదిలోని చిన్నిడీ పంకూడా ఆర్పేసి, వర్షం కురిసేప్పుడు వినిపించే చక్కటి ధ్వనులను వింటూ, కళ్ళు మూసుకుని ఆమెను తలుచుకుంటే...........చీకట్లు ముసిరే సంధ్యలో, సన్నటి తుంపరలో తడుస్తూ, నడుస్తూ అంతరంగంలో నిండుగా నిలిచిన ఆనేస్తంతో సంభాషిస్తే ! అనుభూతిని-ప్రేమ అనే అనుభూతిని మాటల్లోకి వివరించటం ఎంతకష్టం! పరిమళం దాచుకున్న మొగ్గలా అది మనసులోనే దాగి గుబాళించనీ!

* * *

సాగర్ గెస్ట్‌హౌస్‌లో కూర్చొని అతని బ్రీఫ్‌కేసులో కనిపించిన కాగితాలను చదివి స్తబ్ధురాలై కూచుండిపోయింది సమీర.

అది అతను మనసువిప్పి రాసుకున్న వాక్యాలని తెలియలేదు మొదట. టవల్ మరచిపోయి, బాత్‌రూమ్‌లోనుంచి రిక్వెస్ట్‌చేస్తే బ్రీఫ్‌కేస్ తెరచి ఇచ్చింది. పోలిథిన్ కవర్‌లో మడిచి ఉంచిన కాగితాలను అదేదో కథ తాలూకు పేపర్లు అనుకుని, కుతూహలంతో తీసి చదివింది.

అతడు తనపట్ల ఎటువంటి ఉన్నతమైన భావనలతో సతమతమవుతున్నాడో, ఎటువంటి ఘర్షణకు లోనవుతున్నాడో స్పష్టమైంది ఆమెకు.

బాత్‌రూమ్‌లోనుంచి తెల్లటి లుంగీ చుట్టుకుని భుజంమీద టవల్‌తో అతను బయటికొచ్చేసరికి కాగితాలను సర్దుతున్న ఆమె కనిపించింది. నిశ్చేష్టుడై నిలిచిపోయి ఆమెవంకకు చూశాడు.

ఆమెకూడా అతనివంక కొత్తవ్యక్తిని చూస్తున్నట్లుగా చూడసాగింది.

ఉంగరాల జుట్టునుంచిరాలి భుజంమీద పడుతున్న నీటిబిందువులు, ఎడదపైనున్న వెంట్రుకల కొసన నిలిచిన నీటి బిందువులు లైటు కాంతిలో అతని ఎర్రటిఒంటి రంగును ప్రతిఫలింపచేస్తూ చిన్ని చిన్ని కెంపుల్లా మెరుస్తున్నాయి. తొలిసారిగా అతని పురుషత్వం ఆమె స్త్రీత్వాన్ని మేల్కొల్పింది. విద్యుత్‌ఘాతం తగిలినట్టుగా ఒళ్ళు జలదరించింది. తేరుకుని చూసేసరికి అతని బాహువుల్లో ఇమిడి ఉంది. ఆమె పెదవులపై ఆని ఉన్నాయి అతని పెదవులు!

అతన్ని అర్థంచేసుకున్న ఆర్ద్రతతో, ఆత్మవిశ్వాసంతో, అనంతమైన అనురాగాన్ని అమృతం నిండిన హృదయాన్ని అతని కందిస్తున్నట్టుగా ఆమె చేతులు అతని మెడను చుట్టాయి.

ఆమె మెడవంపులో ముఖం దాచుకుని,



నడుంచుట్టూ చేతులుచుట్టి, అంతుతెలియని అగాధాల్లోకి కూరుకుపోతున్నట్లుగా అనిపింపచేస్తున్న మత్తును, అతి ప్రయత్నంమీద విదిలించుకుని ఒక్కక్షణం ఆమెవంక చూశాడు. మరుక్షణంలో మళ్ళీ కోలుకోలేని వివశత్వంలో సోలిపోయాడు.

తనకది తొలి అనుభవమనీ, అతనికీ అది వయసు పులకలెత్తించే తొలి తొందరేనని ఆమెకు తెలుస్తూనే ఉంది. అన్నీ తెలుస్తూ కూడా ఏమీ తెలియనట్లనిపింపచేస్తున్న ఉన్మాదావస్థ అది!

అంతరంగపు చీకటి కోణాల్లో నిద్రిస్తున్న వలపు వీణియ తీగలపై అకస్మాత్తుగా ప్రకంపనాలను సృష్టింప చేస్తున్నట్లుగా ఆమె తనువులోని అణువణువునా, ఆర్తిగా, ఆప్యాయతగా, ఆవేదనతో, మత్తుతో చలించాయి అతని చేతివేళ్ళు! అనంతశక్తి స్వరూపమైన ప్రకృతిముందు, పురుషుడు ఓ అణువులా మోకరిల్లి పసిపాపలా ఆమె పాదాలపై వాలి, జీవన సాఫల్యతకోసం ప్రార్థించినట్లుగా ప్రాధేయపడినట్టుగా అతను ఆమె జీవిత ప్రాంగణాన తొలుత దోసిలివొగ్గి మోకరిల్లి, పిదప సర్వాధికారిలా సర్వస్వాన్నీ స్వంతం చేసుకున్నాడు.

ఎన్నో యుగాలనుంచి పోగొట్టుకున్నదేదో పొందాలన్న తీవ్రమైన దుఃఖం! అదితీరాక ఆనందంతో,తృప్తితో కలిగే దుఃఖం! ఆనందంలో, దుఃఖంలో, నవ్వులో, ఏడుపులో కూడా ఉబికి వచ్చేవి కన్నీళ్ళు!

ప్రకృతి ధర్మాలను శాసించి తీర్చిదిద్దే ఆ పరమాత్మ స్వరూపాన్ని ప్రతి అనుభవంలోనూ దర్శించగలుగుతున్నాడు మానవుడు. బాల్యం హేమంతం—వయసు వెంటతెచ్చే వసంతం—వయసు మళ్ళీ గ్రీష్మం! మళ్ళీ...మళ్ళీ ...ఈ వలయం! ఉదయం. ఉదయాన్ని వెన్నంటి అపరాహ్ణం.

అపరాహ్ణానికి, రాత్రికి సంధిగా సాయంత్రం. ఆ తర్వాత చీకటి! ఆ చీకటి మళ్ళీ వెలుగు రేఖలను ఆహ్వానించేందుకు సమాయత్తమవుతుంది!

ఈ భూభ్రమణం, పరిభ్రమణంవల్లే, సూర్యాస్తమయాలు సంభవిస్తున్నాయి! ఋతువులు ఏర్పడుతున్నాయి. జీవి పుట్టి, పెరిగి, ఎదిగి ముదిమితో మలిగిపోయి మట్టై పోతున్నాడు. ప్రకృతి తన ధర్మాలను నిర్వర్తిస్తోంది!

ఆ ఇద్దరిమధ్య కలయిక కూడా అంత సహజంగానే జరిగింది. దానికి ఇద్దరూ పశ్చాత్తాపపడలేదు. అతను అమితమైన ఆనందంతో పరవశించాడు. అతని ఆనందంచూసి ఆమె మనసూ సంతృప్తి పడింది.

చదువింక రెండునెలల్లో ముగుస్తుంది. ఆ తర్వాత ఆర్యసమాజమందిరంలో వివాహం చేసుకుందామని తీర్మానించుకున్నారు.

"ఇక పరీక్షలయేదాకా పలకరించకు. నన్ను కాస్త కాన్సన్‌ట్రేట్‌చేసి చదువుకోనీ".

"పలకరించకుండా ఉండటం నావల్లకాదు. పోనీ ప్రయత్నిస్తాను. ప్రతి శనివారం సాయంత్రం ఒక్కగంట నాకోసం కేటాయించు".

★ ★ ★

"తనకు పెళ్ళయిందన్న నిజందాచి అతను తొందరపడటం చాలాతప్పు" అంది అంతా విని రాధిక.

"దానికి నేనేం అనుకోవటంలేదు. ఆ మాటకొస్తే నా గురించీ అతనికేమీ చెప్పలేదుకదా" అంది సమీర.

"అతను నిన్ను మోసం చేస్తాడేమోనన్న భయంలేదూ?"

"ఇంకో స్త్రీ జీవితంలో ప్రవేశిస్తున్నానేమోనన్న అపరాధ భావం' తప్ప నాకింకేమీ అనిపించటంలేదు".

కాస్త ఆగి మళ్ళీ నెమ్మదిగా అంది.

"అతను నన్ను వదలడు. అది నాకు తెలుసు. ఎలా అని అడగకు. మనసుకు మాత్రమే తెలిసే అనుభూతి అది".

కాసేపు సమీరవంకకు చూసి నిట్టూర్చింది రాధిక.

"ఎందుకైనా మంచిది నీ ఫోటో ఇవ్వు. పాస్‌పోర్టు సంపాదించిపెడతాను. పరిస్థితులు అనుకూలంగా ఉంటే ఫరవాలేదు. లేకపోతే నాతో తీసుకెళ్తాను".

"మావాళ్ళు నన్ను ఫారిన్‌కు పంపేందుకు ఒప్పుకోరు".

"వాళ్ళెవరు మధ్యలో—ఒప్పుకునేందుకు. కా

సమీర మౌనంగా ఆలోచిస్తూండిపోయింది.

★ ★ ★

"బావా"!

ఈపాటికి నీ పరీక్షలైపోయి ఉంటాయి. వెంటనే బయలుదేరి వచ్చెయ్యి. చాలా అర్జంట్. మన వివాహమయాక నీకు నేను రాస్తున్న మొదటి ఉత్తరం ఇది. మన మధ్య ఉన్న సంబంధంలా ఇది ఎంతో సాదాగా, వెలితిగా ఉంది కదూ!

నాకు ఉత్తరం రాయటంరాదు. నవ్వుకోకేం! నేను ప్రైవేటుగాకట్టి బి.ఎ. పాస్ అయాను. సెకెండ్‌క్లాస్ వచ్చింది. ఇంతకంటే విశేషాలు లేవు. ఉండనా మరి—అభిమానంతో

తులసి.

ఉత్తరం అందగానే బట్టలు సర్దుకుని హాస్టల్‌కు వెళ్ళాడు. సమీర, రాధిక కలిసి సినిమాకు వెళ్ళారని తెలిసింది. సాయంత్రం కలిసి వెళ్ళవచ్చుననుకుని గదికి వెళ్ళేసరికే టెలిగ్రామ్ వచ్చి ఉంది.

ఊరికెళ్తున్నట్టుగా, వచ్చాక మాట్లాడతానని చిన్న ఉత్తరం రాసి సమీరకుపంపి బయలుదేరి వెళ్ళిపోయాడు.




ఎమ్.డి. పరీక్షలు రాస్తూనే ఉద్యోగాలకు అప్లై చేసింది. వెంటనే ఓ నర్సింగ్ హోమ్‌లో ఉద్యోగం దొరికింది.

ట్రాన్స్‌ఫర్ మీద వచ్చిన అన్నయ్య బేంక్ కాలనీలో ఇల్లు సంపాదించి, కుటుంబాన్ని తీసుకొచ్చాడు. అతను మంచివాడే. కానీ వదినకే సమీరంటే కన్నెర్ర. ఆమె అందగత్తె కావటం అగ్ని అయితే చదువుల సరస్వతి కావటం దానికి ఆజ్యంలా తోడ్పడింది. మరదలు పెద్ద డాక్టర్ అవహేళన! ఏమన్నా నోరుమెదపని మెతకదనం కలదని చులకన!

చెల్లికి పెళ్ళి చేయాలని అన్నగారు ప్రయత్నించినా, ఆమె సంపాదన తినే అవకాశం పోతుందని పడనివ్వలేదు వదినగారు. కొత్తగా బేంక్ లోన్ తీసుకొని ఇల్లు కట్టడంతో అన్న చిరంజీవి జీతంలో చాలా భాగం కట్ అవుతున్నది. దానికితోడు అతనికిద్దరూ ఆడపిల్లలే! సమీర సంపాదన అంతా ఇస్తే దాన్ని నెలనెలా బేంక్‌లో వేసుకోవచ్చుని వదిన ఆశ! సమీరకున్న నగలన్నీ ఎప్పుడో ఆమె స్వంతం చేసుకుంది. మెడలో గొలుసు, చేతికి రెండు గాజులు, చెవులకు కమ్మలు తప్ప ఆమెకంటూ నగలు లేవు. ఉన్న కాస్తపొలం కూడా ఇల్లు కొనమని అమ్మించింది. వదినగారి ఉద్దేశం గ్రహించినా సమీర ఏమీ అనుకోలేదు. కానీ దాన్ని బలహీనతగా భావించి మరింత జులుం చెలాయించసాగింది వదిన రజని.

ఉద్యోగంలో చేరి మూడునెలలు గడిచాయి. మధుకర్ ఊరినుంచి వచ్చి ఓసారి కలిసి మాట్లాడి మళ్ళీ వెళ్ళిపోయాడు.

భార్య నుంచి విడాకులు తీసుకునే హడావుడిలో ఉన్నానని, అదవగానే వస్తా, వివాహం చేసుకుందామని చెప్పి వెళ్ళాడు. ఈ సంగతులేవీ సమీర ఇంట్లో వాళ్ళకు తెలియవు. తెలిస్తే తుఫానే చెలరేగేది. మధుకర్ వచ్చినప్పుడు అతని కోరిక ప్రకారం ఓ పూట గండిపేటకు వెళ్ళి వచ్చింది. నర్సింగ్ హోమ్‌కు సెలవు పెట్టి.

చీకటి పడుతుండగా ఇంటికి వచ్చిన సమీర పెద్ద దుమారాన్నే ఎదుర్కొంది ఇంట్లో. తన కోసం వదిన నర్సింగ్‌హోమ్‌కు ఫోన్ చేస్తే సెలవు పెట్టినట్టు తెలిసింది. ఇంటికి రాగానే చిన్నపిల్లని నిలదీసినట్టుగా నిలదీసింది.

అడగటం తప్పుకాదు. కానీ ఆ అడిగే పద్ధతి సమీరని ఆవేశపడేటట్టుగా చేసింది. అయినా తన పరిస్థితులు చక్కబడేవరకూ ఎవరితోనూ గొడవ పెట్టుకోదలచుకోలేదు. తన మూలంగా అన్నయ్య కూడా అశాంతి నెదుర్కోవల్సి వస్తుంది.

అందుకే మనసుకు కష్టం వేసినా, క్లాస్‌మేట్స్ అంతాకలిసి సెలవుపెట్టించి గండిపేటకు పిక్నిక్‌కు లాక్కుపోయారని చెప్పి తప్పించుకుంది.

• • •

మధుకర్ భార్యతో విడాకులకు ప్రయత్నిస్తున్నాననే ఒక్క ముక్కే చెప్పి వెళ్ళాడు. కానీ అతడు టెలిగ్రామ్ అందుకుని వెళ్ళాక చాలా సంఘటనలే ఎదుర్కొన్నాడు. అవన్నీ చెప్పి ఆమె మనసు కలవరపెట్టకుండా పరిస్థితులను తనే సరిచేయాలనుకున్నాడు. నిజానికి అతనికి తెలిసిన వివరాలు కూడా కొంచమే.

లాయర్ ద్వారా ఓ నిజాన్ని విని దిగ్భ్రాంతి చెంది ఇంటికి వెళ్ళి తులసిని నిలదీశాడు.

ఆమె నిర్భయంగా చూసి చిరునవ్వు నవ్వింది.

" నిజమే! నీకు చెప్పలేదు. స్వార్థంతోనే చెప్పలేదు. నాపరిస్థితి అలా ఉంది. నేను నమ్మిన సూర్యం పచ్చకామెర్లు వచ్చి మరణించాడు. అమ్మమ్మో మరణించేముందు విల్లు మార్చి రాసింది. నీద్వారా ఓ కొడుకునో కూతుర్నో కంటే తప్ప నాకు ఆస్తి అనుభవించే హక్కులేకుండా చేసిపెట్టింది. అటు సూర్యమూ లేక, ఇటు నువ్వు కూడా విడాకులిస్తే నాగతేం కావాలి? తోడబుట్టిన అన్నయ్యేమో వివాహం చేసుకొని ఇల్లరికం వెళ్ళాడు "

మధుకర్ నిర్విణ్ణుడై చూశాడు.

" ఇక విడాకుల ప్రస్తావన మర్చిపో బావా! పైగా త్వరలోనే మనకు బాబో, పాపో పుట్టబోతున్నారు. నీకు విడాకులివ్వడం జరుగదు. నాకంఠంలో ప్రాణముండగా నీకు విడాకులివ్వను. "

అతనికి తను ఊరినుంచి రాగానే తులసి ప్రవర్తించిన తీరు గుర్తొచ్చింది.

ఎంతో ఆప్యాయతతో ఆహ్వానించింది తనను. క్షణాలమీద స్నానానికి వేడినీళ్ళు సిద్ధం చేయించింది. స్నానం చేసి రాగానే మంచం మీద తెల్లటి లాల్చీ, లుంగీ తీసి ఉంచింది.

అతను [illegible] రాగానే పీట వేసి వెండి కంచంలో వేడివేడి అన్నం, ఘుమఘుమలాడే నెయ్యి, పప్పు, కూరలతో వడ్డించింది. అతను భోంచేస్తున్నంత సేపు పక్కనే కూచుని విసనకర్రతో విసురుతూ నెమ్మదిగా నవ్వుతూ అతని చదువు వివరాలు తెలుసుకుంది.

అతను దాపరికంలేకుండా సమీర గురించి, తమ మధ్య ఏర్పడిన సంబంధం గురించి చెప్పేశాడు. తులసి ముఖం మ్లానమైనా, అతను గమనించకముందే సర్దుకుంది.

అంత తృప్తిగా భోంచేసి రెండేళ్ళు గడిచాయని చెబుతూ, నవ్వుతూ ఆమె వంక చూసి కలవరపడ్డాడు. చప్పున జారినపైట సర్దుకుంది ఆమె.

గడ్డపెరుగు వేసుకొని తింటూ మధ్య మధ్య ఆమెను గమనించాడు. తులసి మునుపటి కంటే వళ్ళు చేసి, తెల్లబడింది. పొడుగాటి జడకు కుప్పెలు పెట్టి తలలో మల్లెలు తురుముకుంది. లేత నీలం రంగు వుల్‌వాయిలు చీర, తెల్ల జాకెట్‌లో అందంగా ఉంది. కోలముఖం, నవ్వినప్పుడు మొగ్గలా ముకుళించే కళ్ళు, గడ్డం కింద అందమైన చిన్నపుట్టుమచ్చ, నవ్వినప్పుడు మెరిసే పన్ను ఆమెకు అందాన్ని ఇస్తుంది. ఆమె ఇప్పుడు పంథొమ్మిదేళ్ళు నిండిన సంపూర్ణ యవ్వనవతి! వయస్సు ఆమె శరీరంలో అందమైన మార్పులు తెచ్చింది. పెళ్ళొద్దని ఏడ్చే పదహారేళ్ళ పసితనపు అమాయకత్వం లేదిప్పుడామెలో.

కానీ............ ఆమె ముఖంలో, నవ్వులో, చూపులో, పలకరింపులో ఎక్కడో కృత్రిమత్వం తొంగి చూస్తుంది. మరొకటి కూడా గమనించాడు- ఆమె మంగళసూత్రాలను, మెట్టెలను ఉంచుకోవటం.

భోజనమయ్యాక కునుకు తీసి సాయంత్రపు చల్లగాలికి షికారెళ్ళి, కలవరపడుతూ తిరిగి వచ్చాడు. పెరట్లో పొగడ చెట్టుకు దగ్గరగా నవారుమంచంమీద దుప్పటి పరిచి, బొండు మల్లెలు ముందుపరుచుకుని మాల అల్లుతోంది.

వెళ్ళి ఆమెకెదురుగా మంచం మీద కూచున్నాడు.

మౌనంగా కళ్ళెత్తి చూసి మందహాసం చేసింది.

" ఏం బావా! అలా ఉన్నావేం? "

"నే విన్నది నిజమేనా? "

" ఏమిటి? "

ఎంతో తాపీగా ఉన్న ఆమె ధోరణి అతన్ని మరింత ఆశ్చర్యంలో ముంచింది. అస్తమిస్తున్న సూర్యకిరణం వెలుగుకు మెరుస్తున్నవెండి మెట్టెను చూస్తూ అన్నాడు.

" సూర్యం పోయి నెలరోజులైందిట. "

ఆమె ఎత్తిన తల దించలేదు. మనసులో ఎటువంటి భావాలు చెలరేగుతున్నాయో అతనికి అర్థం కాలేదు. కొద్దిక్షణాల నిశ్శబ్దం తర్వాత అంది-

" నేనే చెబుదామనుకున్నాను. మరిచిపోయాను. "

" మరి ....... "

" ఎందుకంత భయం? నీకు విడాకులివ్వనేమో అనా? ఆ భయం పెట్టుకోకు. విడాకుల గురించి ఏర్పాట్లు చెయ్యి."

" నాకు విడాకులిస్తే మరి నిన్నెవరు చేసుకుంటారు? "

" ఎవరూ చేసుకోకపోతేనేం బావా? పెళ్ళిలోనే ఉందా జీవితం! నాకెలాంటి కోరికలూ లేవు. బాగా చదివి విద్యాధికురాలినై సంఘంలో ఓ ఉన్నత స్థానం సంపాదించాలనివుంది. నీకు విడాకులిచ్చాక యూనివర్సిటీలో చేరి 'లా' చదవాలనుకుంటున్నాను. అవకాశమొస్తే పైచదువులు కూడా చదువుకుంటాను. జీవితంలో ఒంటరితనం అన్పిస్తే నీకు పుట్టే బాబునో, పాపనో దత్తు తీసుకుంటాను. ఏం బావా! ఇస్తావా నాకు? "

మధుకర్ అనుకోకుండానే సిగ్గుపడ్డాడు.

" ఇప్పుడెలా ఉన్నావో చెప్పనా? అచ్చం శోభనపు పెళ్ళికొడుకులా. తొందరపడ్డావ్ అనవసరంగా. లేకపోతే మనం విడాకులు తీసుకున్నాక, దగ్గరుండి నీ పెళ్ళి జరిపించి, నాచేత్తో సింగారించి గదిలోకి పంపేదాన్ని. ఇప్పుడైనా మించి పోయిందేం ఉంది. ఇంకోసారి ఆ వేడుక జరుపుకోవచ్చు. అవునా? "

" నువ్వు కాస్త కూడా సిగ్గులేకుండా మాట్లాడుతున్నావు. "

" ఎందుకు బావా సిగ్గు? చెప్పానుగా! నాకలాంటి కోరికలన్నీ నశించాయని. ముందు ఏ ఆశ్రమానికైనా వెళ్ళిపోయి భగవత్ చింతలో ప్రశాంతంగా గడపాలనుకున్నాను. కానీ దేవుడు జన్మనిచ్చింది నలుగురికీ ఉపయోగపడాలని! అందుకే 'లా' చదవాలన్పించింది. ఎంతోమందికి న్యాయం అందుబాటులో లేదు. కొందరికైనా నా సహాయం అందిస్తాను. నా ఆలోచన మంచిదే కదూ బావా? "

" చాలా గొప్పది కూడా తులసీ. తోటి మనిషికి సహాయం చెయ్యటమంటే దేవుడికి సేవ చేసినట్టేనని పెద్దవాళ్ళు అంటారు కదా! నీలో వచ్చిన మార్పు నాకు ఆశ్చర్యంగా ఉంది. కానీ నువ్వు కూడా నీమనసుకు నచ్చిన ఇంకెవరినైనా చేసుకుంటే ఇంకా బాగుంటుంది. సమీర కూడా సంతోషిస్తుంది. "

" ఆమెకెందుకు బావా సంతోషం?"

" నీకు సమీర గురించి తెలీదు. నీగురించి చెప్పగానే చాలా బాధపడింది. తను నాజీవితంలో ప్రవేశించటం ద్వారా నీకు అన్యాయం జరుగుతుందని బాధపడింది. అసలు నీకు విడాకులివ్వద్దంది కూడా. "

తులసి ఆశ్చర్యపోయింది.

" అదృష్టవంతుడివి బావా! అంతమంచి మనసున్న వ్యక్తిని పొందుతున్నందుకు. "

" నువ్వు కూడా మనసు మార్చుకునే ప్రయత్నం చెయ్యి తులసీ. "

తులసి పూర్తిఅయిన మాలను గిన్నెలో సర్ది తలెత్తి చూసింది. హఠాత్తుగా ఆమె చూపుల్లో విషాదం తొంగిచూసింది.

" నేనో నిజం చెబుతాను. నవ్వకుండా, ఎగతాళి చెయ్యకుండా నమ్ముతావా బావా! "

" అదేమిటి తులసీ. చెప్పు. నాకన్నా దాదాపు ఎనిమిదేళ్ళు చిన్నదానివి. నిన్ను అర్థం చేసుకోగల అనుభవం, వ్యక్తిత్వం నాకున్నాయనే అనుకుంటున్నాను. "

" ఆస్తి కోసం సూర్యం నన్ను ప్రేమించినట్టు నటించాడని తెలిశాక నేను బాధపడ్డా నెమ్మదిగా తేరుకున్నాను. టీనేజ్ ఇన్‌ఫాట్యుయేషన్‌కులోబడి అతన్ని ప్రేమించానని భ్రమపడ్డానని తెలుసుకున్నాను. పెళ్ళి మంత్రాలబలమో, పెళ్ళి తంతులో ఉన్న మహత్యమో కానీ- నామనసులో

హఠాత్తుగా ప్రవేశించావు నువ్వు. అది ఏ క్షణాన జరిగిందో గుర్తులేదు. కానీ రోజురోజుకీ

నీపట్ల పెరుగుతున్న అటాచ్‌మెంట్‌తో సతమతమయ్యాను. ఎప్పటికప్పుడు నాలో రూపుదిద్దుకుంటున్న ఊహలు, భావనలు నీకు రాయాలనుకునేదాన్ని. విడాకుల గురించి మర్చిపోమని చెప్పాలనుకునేదాన్ని. కానీ సూర్యం గురించి తెలిసిన నువ్వు నన్ను క్షమించి అర్థం చేసుకోవేమోనన్పించింది. పేపర్ ద్వారా తెలియచేసేకంటే ముఖాముఖి చెప్పటం మంచిదనుకున్నాను. నువ్వురాలేదు. రమ్మని రాసేందుకు నాకు మొహమాటం, సంకోచం. పెళ్ళప్పుడు నే చేసిన రభస, అల్లరి తలుచుకొని సిగ్గుతో చితికిపోయాను. కాబోయే ఎమ్మెస్‌వి. నీ భార్యగా విద్యలో నాకూ ఓ హోదా ఉండాలనుకున్నాను. అందుకే చదువుని నిర్లక్ష్యం చేయకుండా, ఆ ధ్యాసలో పడి నీ ఆలోచనలను కాస్త వెనక్కి పెట్టవచ్చనుకున్నాను.

కానీ గడిచిన ప్రతిక్షణం నా ఊహల్లో నువ్వే ఉన్నావు. మరీ బాధనిపించినపుడంతా మన పెళ్ళి ఫొటోల ఆల్బమ్ చూస్తూ గడిపాను. చెల్లికి తోడుగా ఉండి జీవితం చక్కదిద్దాల్సిన అన్నయ్యే ఇల్లరికపు అల్లుడిగా వెళ్ళిపోయి తన సుఖం తాను చూసుకున్నాడు.

ఇంకెవరితో పంచుకోవాలి నాబాధను. నువ్వొచ్చావు. నాఆశలన్నిటినీ తలకిందులు చేశావు. ఆనాడు బలవంతాన నీజీవితంలో ప్రవేశించవల్సి వచ్చింది. కానీ నాకోసం నీ ఆనందాన్ని మరోసారి బలిపెట్టమనటం మూర్ఖత్వం అనిపించింది. అందుకే నీకు అడ్డు తొలగాలనే అనుకున్నాను. ఇంకో నిజం నీకు తెలీదు. నేనంగీకరిస్తే తప్ప ఇప్పుడు నీకు విడాకులు దొరకవు. రెండేళ్ళు మనం ఏవిధమైన కమ్యూనికేషన్ లేకుండా గడిపినా, విడాకులు తీసుకునే క్షణందాకా నువ్వు నన్ను కలిసి మాట్లాడనేకూడదన్న సంగతి మెడికల్ విజ్ఞానంతో నిండిపోయిన నీ బుర్రకు తోచలేదేమో! ''

ఆశ్చర్యంతో, విచారంతో వింటూండిపోయాడు మధుకర్! మనసులో తల్లీతండ్రీ మరణించి ఏడుస్తున్న అయిదేళ్ళ పసివాడిని దయతో ఒడిలో తీసుకుని ఓదారుస్తున్న ఓ స్త్రీమూర్తి దర్శనమిచ్చింది. కన్నబిడ్డలతో సమానంగా ప్రేమించి లాలించిన మాతృమూర్తి కనిపించింది. కూతుర్ని, ఆస్తిని నమ్మి తన చేతుల్లోపెడితే తను ఆ నమ్మకాన్ని నిలబెట్టలేకపోయాడు.

మరోపక్క జీవితంలో దగాపడి విరాగిణిలా బతుకుతున్న సమీర ప్రేమభిక్ష అర్థించి మరీ ఆమె జీవితంలో కాలుపెట్టాడు.

'' నాకేం చేయాలో తోచటంలేదు. ''

'' ఏమీ ఆలోచించకు. నేను నీకు విడాకులు ఇచ్చేస్తాను. సమీరనే చేసుకో. నాకు కావాల్సింది నీ ప్రేమ బావా! జాలి, దయ కాదు. నన్ను ప్రేమించలేని నువ్వు నాకు అవసరంలేదు. నాకూ వ్యక్తిత్వముంది. కానీ నువ్వెంతటి విలువైన వ్యక్తివో నాకు ఈ రెండేళ్ళుగా అర్థమైంది. నామనసుకు నువ్వు తప్ప మరెవరూ నచ్చరు బావా! ఫరవాలేదు. నీకొడుకుని నాకిచ్చెయ్యి. వాడిలో నిన్ను చూసుకొని బతుకుతాను. ''

మధుకర్ స్తబ్దుగా కూచుండిపోయాడు.

'' సమీర అందంగా ఉంటుందా బావా? ''

మధుకర్‌లో చలనం వచ్చింది. చిరునవ్వు నవ్వాడు.

'' మీ ఆడవాళ్ళంతా ఒకటే'' అంటూ పర్స్ తెరిచి సమీర ఫొటోలు చూపించాడు.

తులసి కళ్ళల్లో క్షణంపాటు ఈర్ష్య కదిలింది.

'' బాగుందా? ''

'' చాలా బాగుంది. ''

'' కానీ ఆమె అందం చూసి కాదు నేనిష్టపడింది. ఆమె మనస్తత్వం, వ్యక్తిత్వం నన్నెంతో ఆకట్టుకున్నాయి. ఎమ్.డి. చేసింది కానీ భవిష్యత్తులో మంచి సర్జన్ అవుతుంది. ''

కాసేపు మౌనంగా ఉండి అడిగింది.

'' నేను బాగుంటానా బావా?''

చిన్నప్పటి అల్లరి తులసి కన్పించిందతని కళ్ళకు.

ఆమె ముక్కు పట్టి ఊపాడు.

'' కాదని ఎవరంటారు? మీ ఇద్దరూ అందమైనవాళ్ళే! ఎవరి అందం వాళ్ళది. కానీ మగవాడికి కావాల్సింది కేవలం అందం కాదు. మంచితనం, వ్యక్తిత్వం, సహనం, అవగాహన, భర్తమీద అనురాగం, కుటుంబంపట్ల బాధ్యత, నేర్పు- ఇవన్నీ ఉన్న స్త్రీ భార్యగా లభిస్తే ఆవ్యక్తి కంటే అదృష్టవంతుడింక ఎవరూ ఉండరు. అలాంటి అదృష్టవంతుడిని నేనని చెప్పవచ్చు. సమీరలో అవన్నీ ఉన్నాయి కాబట్టి... ''

" ఇంకా పెళ్ళి కాకుండానే నెత్తిన పెట్టుకున్నావు. పెళ్ళయితే కాలు కిందపెట్టనీయవేమో!

" నేను కూచోమన్నా తను నానెత్తిన కూచోదు."

" ఎంతప్రేమ! నాకిప్పుడు అసూయకలుగుతోంది ఆమె అంటే! "

మధుకర్ ముఖం చూసి ఫకాల్న నవ్వింది.

టపాటపా పెద్దపెద్ద చినుకులు పడసాగాయి.

ఆమె దుప్పటి, మల్లెపూలగిన్నె పట్టుకుంటే అతను మంచం తీసుకుని వసారాలోకి వచ్చాడు.

" ఇప్పుడేమిటి ఈ వర్షం. "

" సంవత్సరాది వెళ్ళాక రెండు, మూడు వానలు పడతాయి. పద! లోపలికి వెళ్దాం. "

• • •

వర్షం కురిసి వెలిశాక పెరట్లో, మసకవెన్నెట్లో మంచం వేసి, బూరుగు దూదితో కుట్టిన మెత్తటి పరుపు వేసింది తులసి.

భోజనం ముగించి వచ్చి పరుపు మీద పడుకున్నాడతను- వెల్లకిలా పడుకుని విదియనాటి నెలవంకను , తారలతో మినుకుమంటున్న నిర్మలాకాశాన్ని చూస్తూ.

అట్లాగే నిదుర, మెలకువ కానిసుమస్తావస్థలో ఊగిసలాడుతుండగా తులసి గురించిన ఆలోచనలు మనసునిండా ముసురుకున్నాయి.

ఎప్పుడు వచ్చి కూచుందో తులసి- పక్కలో



కూచుని తమలపాకులు చిలకలుగా చుడు తోంది. పాలమీగడలా మెరుస్తున్న తెల్లవాయిల్ చీర, తల్లో వికసించి పరిమళాల్ని విరజిమ్ముతో న్న బొండుమల్లెలు, తాంబూల సేవనతో ఎర్రబడ్డ పెదవులు- ఆమె నడుము తొడలకు చల్లగా తగిలేసరికి వళ్ళు జలదరించి, దూరం జరిగి పడుకున్నాడు.

" ఎందుకు బావా అంత కలవరపాటు? సమీరకు అన్యాయం చేయకూడదనా? "

" నాకెందుకో చికాగ్గా, ఇబ్బందిగా అన్పి స్తుంది. "

" ఈ మాట భర్త భార్యతో అంటున్నదను కుంటే నవ్వొస్తుంది కదూ! అఫ్‌కోర్స్ ఆ బంధాన్ని నాచేతులారా నేనే తెంపేశాను. "

" అలా మాట్లాడకు తులసీ! "

పక్కకు వత్తిగిలి ఆమెకు తగలకుండా జాగ్ర త్తపడుతూ పడుకున్నాడు.

తమలపాకు చిలకలు అతని నోటికందించబో యింది.

" నాకలవాటు లేదు. "

" ఫరవాలేదు. ఇక ముందు అయితేనే మంచిది. "

" నీపిచ్చికానీ- మేమిద్దరం డాక్టర్లం. పని చేసిచేసి అలిసిపోయి వస్తాము. నాకిట్లా చిలక లందించే ఓపిక సమీర కుంటుందా? "

" నీకోసం ఓ అరగంట వెచ్చించలేదా? పోనీ నన్ను మీ ఇంట్లోనే పనిమనిషిగా ఉంచుకోండి. నే చేసిపెడ్తా ఈ సేవలన్నీ! "

" ఇప్పుడంటే అన్నావు కానీ ఇంకెప్పుడూ అనకు ఇలా! నా ఇంట్లో నువ్వుండటమే జరిగితే ఇలా సేవలు చేసేందుకు ఉంచుకోను. నామర దలి హోదాలో దర్జాగా ఉంటావు. "

అతని ఛాతీమీద చెయ్యి వేసింది.

మధుకర్‌కు వళ్ళంతా జివ్వుమంది. అతనికీ పరిస్థితి ఎంతో ఇబ్బందిగా ఉంది. కానీ ఏమంటే ఏ అర్థం తీసుకుని బాధపడ్తుందోనని భయం వేసింది.

" నేనెంతో దురదృష్టవంతురాలిననిపిస్తుంది బావా! నీలాంటి మనసున్న వ్యక్తిని పొందటమే అపురూపం. పొందీ పోగొట్టుకోవటం దుర్భరం కదూ! "

" ఇలాంటి మాటలతో నన్ను బాధపెడితే ఏమొస్తుంది నీకు?"

చిన్నబుచ్చుకుంది- " నాకు నా మనసులోని మాటను విప్పి చెప్పుకోగల మిత్రుడివి, ఆప్తుడివి, బంధువివి- నువ్వొక్కడివేగా బావా! రెండేళ్ళుగా మనసులో పెట్టుకుని మగ్గిపోయాను. కనీసం ఈ కొద్ది రోజులైనా మనసువిప్పి స్వేచ్ఛగా మాట్లాడనీ నన్ను. ఓ ఆడపిల్ల హృదయాన్ని గెల్చుకోగలిగి నందుకు గర్వపడక, భయపడ్తూ బాధపడతావే మిటి! "

" సమీర పరిచయం కాకపోతే నాకిది ఆనందం కల్గించేదేమో! "

" అది నా దురదృష్టం! దానికెవరేం చెయ్యగ లరు. "

" నిన్ను నువ్వు అలా కించపరుచుకుని కృంగిపోతుంటే నాకు ఆనందంగా, గర్వంగా అన్పిస్తుందా చెప్పు? "

" నేనేం చేయను? నామనసు పొరల్లో ఇన్ని రోజులుగా పేర్చుకున్న భావాలు నీ సమీపంలో నా ప్రమేయం లేకుండానే బయటపడుతు న్నాయి. "

" ఈవిధంగా ఆలోచించటం మానెయ్ ఇక. యూనివర్సిటీలో చేరబోతున్నావ్! ఎంతోమంది వ్యక్తులు పరిచయమవుతారు. నాకన్నా ఉన్నత మైన వ్యక్తిత్వం గలవారు, నిన్నాకర్షించగలవారు ఉంటారు. గతం పీడకల అనుకుని నిన్ను కోరే వ్యక్తిని చేసుకుని స్థిరపడు. "

" అది అసంభవం! నేనేం నీ మెడకు గుదిబండలా తగులుకోను. భయపడకు. కానీ నిన్ను తప్ప మరెవ్వరినీ ప్రేమించే స్థితిలో లేదు నామనసు. ఇక అలాంటి సలహాలిచ్చి నామనసు ను ముళ్ళతో గుచ్చకు. "

విసురుగా లేచి లోపలికి వెళ్ళిపోయింది

లేచిన విసురులో ఆమె జడకుప్పె అతని బుగ్గని తాకింది. మాలనుంచి విడివడ్డ రెండు, మూడు మల్లెలు పక్కమీద రాలాయి.

వాటి సువాసనకు ముచ్చటపడి చేతిలోకి తీసు కుని గుండెలమీదుంచుకున్నాడు.

తులసి ధోరణి అతని మనసును కలవరపెట్ట సాగింది. కానీ పాపం తనతో సంసారం చేయమ

బలవంతపెట్టటం కానీ, విడాకులివ్వనని మొండి కేయటం కానీ చేయటం లేదు కదా! మనసులో ఏదైనా నిరాశ, దుఃఖం, బాధ ఉంటే ఎవరికైనా చెప్పుకోవాలి. తనకెవరున్నారు చెప్పుకునేందుకు నేను తప్ప! బాధ కలిగించేదేమిటంటే ఆమెనేదార్చి ధైర్యం చెప్పే స్థితిలో లేడు తను.

ఆమె తాకినపుడంతా వంట్లో రక్తం వడివడిగా ప్రవహిస్తోంది. అది అన్ని బాధలనూ మించి అతనెమర్కోలేక పోతున్న పెద్ద బాధ.

వయస్సు ఉధృతంగా, వెల్లువలా ముంచెత్తే సమయంలో ఎదుట ఉన్నది పరాయి స్త్రీ అన్న భావన కలగదు- అందులో ఆ అనుభవం అర్థమయ్యాక- కళ్ళు మూసుకు పడుకుంటే ఊహల నిండ సమీర! రకరకాల భంగిమలలో!

నిజమైన ప్రేమ అనేది ఉన్నచోట ఎందుకిన్ని అవాంతరాలూ, ఛేదించ వీలుకాని అడ్డుగోడలూ నిర్మిస్తాడా దేవుడు! ? నేను వచ్చేస్తాను సమీరా! తులసి విడాకులివ్వకపోతే పోనీ- మనం ఫారిన్ వెళ్ళిపోదాం. అక్కడే సెటిల్ అవుదాం! నన్నీ విరహాగ్నిలో పడేసి నువ్వు మాత్రం హాయిగా నిదరపోతుంటావు కదూ! నేనసలు నీకు గుర్తొస్తానా అని నా అనుమానం! నిన్నొదిలి ఎక్కువ రోజులుండలేనిక!




గాఢనిద్ర లోంచి తెల్లవారుఝామున మెలకువ వచ్చింది.

వెలుగు రేఖలింకా విచ్చుకోలేదు. ఎక్కడి నుంచో కమ్మని సువాసన!

సమీర కలలోకి వచ్చిన అనుభూతి నుంచి ఇంకా తేరుకోలేదతడు. నెమ్మదిగా కళ్ళుతిప్పి బాత్‌రూమ్‌వంక చూశాడు.

అటునుంచి సబ్బునురుగు, నీళ్ళు బయటకి వస్తున్నాయి.

ఒకమూలగా వాడిన మల్లెచెండు ఇంకా సువాసనలను విరజిమ్ముతోంది!

తులసి స్నానం చేస్తున్నట్టుగా ఉంది. అతనికెందుకో చటుక్కున సమీర గుర్తుకొచ్చింది. రక్తం మళ్ళీ వేడెక్కింది. అతనా ఆలోచనల్లో సతమతమవుతుండ గానే బాత్‌రూమ్ తలుపు తెరుచుకుంది.

వంటికి పల్చటి గులాబీరంగు జార్జెట్ చీరను చుట్టుకునుంది.

టవల్‌తో రెండుచేతులూ ఎత్తి తల వెనక్కి వంచి తుడుచుకుంటోంది తులసి.

ఆరూపం అతని గుండెల్ని మంచుముక్కల మధ్య నొక్కి పెట్టినట్టుగా చేసింది.

చేష్టలుడిగి చూశాడు. ఆచీకట్లో తను చూస్తున్నాడన్న విషయం ఆమెకు తెలియదో లేక తెలిసీ బావేకదా, భర్తేకదా అన్న నిర్లక్ష్యమో అర్థం కాలేదతనికి. సభ్యత కాదని తననితాను మందలించుకోలేని స్థితిలో కళ్ళు విప్పార్చి, కదలకుండా అలాగే పడుకుని చూడసాగాడు.

రెండుమడతలే ఉన్న పల్చటి చీర గుండెల మీద బిగించి ఉంది. తడిసిన వంటిమీద అతుక్కుపోయి ఆమె వంపు సొంపులను వీలైనంత స్పష్టంగా బహిర్గత పరుస్తోంది. తల వెనక్కివాల్చి చేతులెత్తి తుడుచుకుంటోంది! నగ్నంగా ఉన్న ఆ భుజాలు ....

వెర్రెక్కుతుందనిపించేస్థితిలో కళ్ళు మూసుకొని అటుపక్కకు తిరిగి పడుకున్నాడు.

నిజానికి రోషంగా, అవమానంగా అన్పించింది! ఆమాత్రం కోరికను అదుపులో పెట్టుకోలేని బలహీనుడా తను. స్త్రీ శరీరం కోసం అంత వెర్రెక్కి పోతున్నాడా తను! సమీర మీద తనకున్న ప్రేమనంత గొప్పగా వర్ణించుకోవటమెందుకు ఇక! సంసారం చేసేందుకు ఏస్త్రీ శరీరమైనా ఒకటేగా! ప్రేమకు, కామానికి మధ్యనున్న తేడా ఏమిటి! వయసులో ఉన్న ఏస్త్రీ నగ్న సౌందర్యమైనా తననిలాగే వెర్రెక్కిస్తుందా? ఒక డాక్టర్‌గా తనకు అనాటమీ గురించి తెలుసు! అయినా జీవితంలో తను ఒక రక్త మాంసాలున్న గుండెతో స్పందించే, మనసుకల

మనిషి.

మనిషికింతటి యుక్తా యుక్తాలు యోచింపనీయని ప్రగాఢమైన వాంఛ ఎందుకు కల్గుతుంది?

పూర్తిగా తెల్లవారే వరకూ అతను ఇటుపక్కకు తిరగనూ లేదు. నిద్రమంచం మీదినుంచి దిగనూ లేదు.

అతను లేచి లోపలికి నడిచేసరికి తులసి నిండుగా, హుందాగా చీర కట్టుకొని, పావలా కాసంత కుంకుమ దిద్దుకుని వంటింట్లో పని చూసుకుంటోంది. ఇల్లంతా శుభ్రంగా సర్దిఉంది. ఇంటిముందు కళ్ళాపిజల్లి రంగవల్లులు తీర్చి ఉన్నాయి.

ఊదొత్తులు, మల్లెల సువాసనతో కలగలిసి దేవుడి విగ్రహం ముందు వెలిగించిన ఆముదపు వత్తి వెలుగుతూ వెలువర్చే సువాసన ఇల్లంతా కమ్ముకుంది. ఇల్లంతా..... సాంబ్రాణి వాసనేమో..... అలుముకుని ఉంది. దేవుడి విగ్రహం మల్లెలమాల ధరించి నవ్వులు చిందిస్తూంది.

నిద్ర లేచేసరికి ఎంచక్కటి సుప్రభాతం! ఎంత ఆహ్లాదకరమైన వాతావరణం! ఇటువంటి వాతావరణంతో మొదలయే రోజు ఎంత మనశ్శాంతిగా గడుస్తుందో కదా!

తులసి కంఠస్వరం బాగుంటుంది. ఆమె వంటింట్లోంచి సన్నటి స్వరంతో వేంకటేశ్వరుని స్తుతి కీర్తన పాడుతోంది.

తొలిసారిగా అనిపించిందతనికి— తులసి చాలా చక్కటి గృహిణి అవుతుందని!

చెవులకింపైన సంగీతం— మృదువైన చల్లటి మాటలైనా సరే! కంటికింపైన దృశ్యం!— ఇల్లాలు అందకత్తె కాకున్నా శుభ్రత, సామ్యత కలిగిఉంటే సరి, కడుపునిండా కమ్మని భోజనం, మనసుకు కావల్సిన శాంతి, దేహానికి అవసరమైన సుఖం.....

వీటిని అమర్చగల ఇల్లాలిని ఏమగాడైనా ద్వేషిస్తాడా! ద్వేషిస్తే అతడు మానవతా ద్వేషి కూడా అయిఉంటాడు.

అందుకే అంటారు, రూపంలో లక్ష్మిలా కళకళ్ళాడుతూ, భోజనం పెట్టే సమయంలో తల్లిలా, సుఖపెట్టే సమయంలో రంభలా, అవసర సమయాల్లో చక్కటి సలహా ఇవ్వగల మంత్రిణిలా, సేవలు చేసేటపుడు దాసిలా, క్షమించవల్సి వచ్చినపుడు భూదేవిలా— స్త్రీ మగవాడి జీవితాన్ని పలురూపాలలో సౌఖ్యవంతం చేస్తుందని!

బ్రష్ చేసుకొని రాగానే కాఫీ అందించింది.

అది తాగుతూ పేపర్ చూసేలోగా షేవింగ్‌కు అన్నీ అమర్చింది.

అది కానిచ్చేసరికి స్నానానికి నీళ్ళు సిద్ధం.

స్నానం ముగించి వచ్చి ఆమె పెట్టిన దోసెలు తిన్నాడు.

ఆతర్వాత కౌలుకిచ్చిన పొలం గొడవలు, అయివేజుల గురించి చర్చించింది. అన్నీ తను చూస్తానని చెప్పాడు.

"పురుషుడు వివాహానికి తనకన్నా చిన్నదాన్ని ఎందుకు ఎన్నుకుంటాడో అర్థమైంది."

"ఎందుకు?" ఆమె ముఖంలో, నవ్వులో కుతూహలం, సరదా తొంగి చూశాయి.

"ఇలా సేవలు చేయించుకునేందుకు. కోపంవస్తే చెయ్యి చేసుకునేందుకు."

"ఫరవాలేదు. సర్జరీ, కేసులు, రోగాల నుంచి నీ మనసు వివాహం గురించి ఆలోచిస్తూంది."

"నేనోసారి విజయవాడ వెళ్ళొస్తాను."

"ఎందుకింత హఠాత్తుగా?"

"విడాకుల గురించి లాయర్‌తో మాట్లాడవద్దా?"

"నేను ఒప్పుకుని సంతకం పెట్టనిదే రావుకదూ."

అతను దిగ్భ్రాంతి చెందినట్టుగా చూశాడు

"భయపడకు. సంతకం పెడతాను."

"సమీర నా మనసులోకి రాకపోయినట్టయితే—"

"విడాకులిచ్చేవాడివికాదుకదూ?"

"ఏమో!"

"బావా!" ఆమెగొంతు గద్గదమైంది.

"ఏమైంది తులసీ!"

"విడాకులివ్వటం అంత ముఖ్యమా?"

"నువ్వనే దేమిటో తెలియటంలేదు."

"నాకు విడాకులివ్వకుండా నువ్వు సమీరను చేసుకుంటే ఏం?"

అతను మళ్ళీ అయోమయంలో పడ్డాడు.

నాగార్జునసాగర్ – ప్రాచీన బౌద్ధ సంస్కృతీ పీఠం. ఇక్కడ ప్రాచీన సంస్కృతీ, నవీన యంత్రాంగమూ కన్పిస్తాయి.

బౌద్ధ మతాచార్యుల పేరిట వెలిసిన నాగార్జునసాగర్ ఆనకట్ట ప్రపంచంలోని రాతికట్టడాలలోకెల్ల పెద్దది. బౌద్ధ సంస్కృత నిక్షేపాలు, త్రవ్వకాలలో బయటపడ్డ పట్టణ ప్రాంగణం, విశ్వవిద్యాలయం, స్థూపములు, గ్రంథములు, నాణెములు శ్రద్ధతో – నాగార్జున కొండ ప్రదర్శన శాలలో భద్రపరచబడ్డాయి. ఈ ప్రదర్శనశాలకు వెళ్లటానికి లాంచీ సౌకర్యం కూడా ఉంది.





'ఎత్తిపోతల' జలపాతాలు, మొసళ్ల క్షేత్రం కూడా నాగార్జునసాగర్‌కు పెద్ద ఆకర్షణ.

నాగార్జునసాగర్ – శ్రీశైలంల మధ్య కృష్ణానదిలో ఆహ్లాదకరమైన నౌకా విహారం, విహార యాత్రీకుల సౌకర్యార్థం ఏర్పరచబడిన అతిథి గృహాలు – నాగార్జునసాగర్ ప్రత్యేకతలు.

**ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున సాగర్‌కు రండి. మరపురాని మధురానుభూతిని పొందండి.**

**ఆంధ్రప్రదేశ్ పర్యాటక విభాగం**
మొదటి అంతస్థు, గగన్ విహార్,
యం.జె. రోడ్డు, హైదరాబాద్ - 500 001.
టెలిఫోన్లు : 556493, 42835, 77192,
70087, 233384, 233385.

# ఘనమైన రాతి ఆనకట్ట పరిసరాల్లో బౌద్ధమత చరిత్ర వైభవాలు తెలుసుకోండి.



"అది నీకే మంచిది తులసీ."

"ఇంకో పెళ్ళి చేసుకునే ఉద్దేశం నాకులేదుగా! నావల్ల మీకేం ఇబ్బందుంటుంది? నాతో కాపురం చెయ్యటం లేదేమని నిన్ను నిలదీసే వాళ్ళెవరున్నారు చెప్పు."

"తీరా ఇంతవరకూ వచ్చాక మళ్ళీ ఇదేమిటి తులసీ!"

"ముసలితనంలో నీ దగ్గర సేదతీరవచ్చుని బావా! ఏ బంధమూ లేకపోతే నీ ఇంట్లో ఉండలేను కదా!"

"నా మనసునెందుకిలా హింసిస్తావు తులసీ! నాకు భార్యగా కన్నా మరదలిగానే నువ్వు ఆత్మీయురాలివి. అంతేకాక—వయసులో కన్నా ముసలితనంలోనే భార్యాభర్తలు ఒకరి తోడులో ఒకరు సేదతీరాలనుకుంటారు. — అదీకాక నీకు విడాకులివ్వకపోతే సమీర నన్ను చేసుకోదు."

"మంచిది బావా! నీ ఇష్టం. కానీ ఈ పొలం గొడవలవీ చూశాక హైద్రాబాద్ వెళ్ళు" కళ్ళల్లో నీళ్ళు తిరగటంతో గొంతు రుద్ధమైంది.

"అలాగే!"

అంతకుమించి ఆమెతో మరేం మాట్లాడలేక లేచి మేడమీదికి వెళ్ళిపోయాడు.

అతని మనసు అశాంతిమయమైంది. తులసి ఎందుకింత బేలగా మారిందో అర్థంకావటం లేదతనికి.

ఒకటి మాత్రం నిజం! ఏ పరిస్థితిలోనూ సమీరకు మాత్రం అన్యాయం జరగనివ్వడు తను.

అతను కిందికి వెళ్ళేసరికి చెంపకు చెయ్యి చేర్చుకుని పొయ్యి ముందు విచారంగా కూచుని ఉన్న తులసి కనిపించింది. అన్నంపొంగి పొయ్యి ఆరిపోయినా తెలుసుకోలేనంత విచారంతో, పరధ్యానంగా కూచుని ఉంది.

షర్టు వేసుకొని బయటికెళ్ళిపోయాడు. అతని మనసంతా కలచి నట్లయింది. ఇక్కడికి రాకపోయి ఉంటే బాగుండేదని ఎన్నోసార్లు అనుకున్నాడు.

అతను తిరిగి ఇంటికి రాగానే తులసి మళ్ళీ మామూలు మూడ్‌లో ఉంది.

నవ్వుతూ, తుళ్ళుతూ భోజనం పెట్టింది. తిని నిశ్చింతగా నిద్రపోయాడు.

సాయంత్రం వేడినీళ్ళ స్నానంచేసి పెరట్లో కూచున్నాడు. మల్లెలు మాలకడుతూ ఎదురుగా కూచుంది తులసి.

"సరే బావా! నీకు కావల్సింది విడాకులేగా! ఈక్షణమే కావాలంటే సంతకం పెడతాను. కానీ మనం విడిపోయే ముందు— నాదో చిన్న కోరిక తీరుస్తావా?"

"కోరికా?"

"కోరికంటే కోరిక కాదు. కానుక అనుకో."

"లంచమా? సరేచెప్పు. ఏంకావాలి?"

ఆమె విడాకులపై సంతకం చేస్తాననగానే అతనికెంతో ఉత్సాహం వచ్చింది. ఉదయం ఆమెఉన్న మూడ్‌చూసి చెయ్యనంటుందనుకున్నాడు.

"తీరా అడిగాక నువ్వివ్వనంటే నాకు అవమానంగా అన్పిస్తుంది. పోనీ వద్దులే."

"లేదు, లేదు. తప్పకుండా ఇస్తాను. ఏమిటో చెప్పు."

"ఏమిటి నాకు భరోసా?"

"ప్రమాణం చెయ్యనా? నీచెయ్యి ఇలాఇవ్వు. అత్తయ్య మీద ఒట్టు. నీకేం కావాలో అడుగు ఇస్తాను."

"ఒట్టు తప్పవుగా."

"అబ్బబ్బ! ఏమిటి తులసీ! నా సంగతి తెలీదా?"

"తెలుసు కాబట్టే! తప్పక ఇస్తానని చెప్పావు. మాట తప్పకూడదు."

"త్వరగా అడుగు. ఆలస్యం చేస్తేనే మాట తప్పాలన్పిస్తుంది."

"నీ వారసుడిని నాకిస్తావా?"

"అదా? దానికా ఇంత ఆర్భాటం! అత్తయ్య మీద ఒట్టు. నువ్వు వేరే పెళ్ళి చేసుకోకపోతే తప్పక ఇస్తాను. సమీర తప్పక ఒప్పుకుంటుంది."

"సమీర ద్వారా కాదు బావా— నాకే ఇవ్వాలి!"

అప్పుడు చూశాడామెవంక— పిడుగుపడ్డవాడిలా!

"సమీరకు పుడితే నాస్వంతం ఎలా అవుతారు బావా! చెప్పు. పెద్దయ్యాకైనా తల్లిని వెదు

క్కుంటూ వెళ్లారు. అవునా? అందుకే నాకు నీద్వారా వారసుడు కావాలి. మన ఇద్దరి రక్తాన్ని పంచుకున్నవాడు, ఈ కలయిక జీవితాంతం తియ్యగా గుర్తు పెట్టుకునేలా చేసేవాడు కావాలి. ఆ పుట్టబోయేవాడు నీవు నేను ఒకటైతే ప్రాణం పోసుకున్నవాడు కావాలి.''

మధుకర్ ఇంకా నిర్వీణ్ణుడై చూస్తున్నాడు. అతని తల వేడెక్కిపోయి ఏక్షణానైనా పేలిపోతుందనిపించేంత టెన్షన్‌ను అనుభవిస్తోంది.

''ఒక భార్యగా భర్తని అడగకూడని కోరిక అడుగుతున్నానా బావా! చెప్పు? నాకేకానీ తల్లి ఉంటే నీ కాళ్ళు చేతులు పట్టుకుని బతిమలాడి నన్ను నీ స్వంతం చేసేది. అయినా నేను అత్యాశకు పోవటంలేదు. నిన్ను స్వంతం చేసుకోగల అవకాశముండీ చేసుకోవాలను కోవటం లేదు. నీ జేబులో నయాపైసా కూడా లేనినాడు ఉపవాసం చేయటం గొప్పకాదు బావా! జేబులో వంద రూపాయల నోటున్నా ఉపవాసం ఉండగలగాలి. అవునా?

నేను నిన్ను బెదిరించటం లేదు. బతిమాలుకుంటున్నాను. విడాకులివ్వబోయే ముందు నన్ను గర్భవతిని చెయ్యి. వాడిలో నిన్ను చూసుకుని సంతృప్తి పడతాను.''

''లోకం నాగురించి ఏమనుకుంటుంది?''

''ఏమీ అనుకోదు. నేనిక్కడ ఉంటే గదా! ఎక్కడికైనా వెళ్ళి రహస్యంగా పురుడు పోసుకుంటాను. ఆ తర్వాత పుట్టబోయే బిడ్డని నువ్వే నాకు పెంపకానికిచ్చినట్టుగా చెప్పుకుంటాను.''

''ఎందుకింత విచిత్రమైన కోరికలు కోరుతావు తులసీ.''

''మాట తప్పనన్నావు. అమ్మమీద ఒట్టేశావు.''

''నువ్వు కానుక అంటే నేనింకేదో అనుకున్నాను.''

''కానుక కాదా బావా? కానుక కాక మరేమిటి? నా జీవితంలో నాకింకేమీ మిగల్లేదు బావా! నాకు ఇంకెవర్నీ చేసుకునే ఉద్దేశం లేదు. కన్నెపిల్లగా మరణించాలని లేదు. రెండేళ్ళుగా నీమీద మమతను పెంచుకొని నీ కోసం ఎదురు చూస్తున్నాను. నాకూ కోరికలున్నాయి. కాని అవి నీతోనే తీర్చుకోవాలని ఉంది. ఆ అనుభవం, అనుభూతి ఎలాంటిదో నీ ద్వారానే తెలుసుకోవాలని ఉంది. నీ ప్రతిరూపాన్ని కడుపున మోయాలని ఉంది. నీ బిడ్డకు తల్లినివ్వాలని ఉంది. ఆ మధురానుభూతిని మిగిలించుకుని జీవితమంతా ఒంటరిగా గడిపినా సంతోషంగా బతికేయగలను. నేను నీ పట్ల చాలా తప్పులే చేశాను. నన్ను క్షమించలేవా బావా?

క్షమించి నా ఈ చిన్న కోరికను తీర్చలేవా? నువ్వు నాకేదైతే శాపం అవుతుందను కుంటున్నావో అది నాదృష్టిలో నాకు వరం. చెప్పుబావా? ఒక్కసారి నా కోరిక తీరుస్తావా?''

''నన్ను కాస్త ఆలోచించుకోనీ తులసీ. నీకు బిడ్డనివ్వాలనుకున్నా కూడా......''

''చెప్పు బావా? ఏమిటి నీ అనుమానం?''

''మీ ఆడపిల్లలంతా కథలు చదివి ఒక్కసారి కలుసుకోగానే బిడ్డలు కలుగుతారనుకుంటుంటారు. కానీ బిడ్డ కలగాలంటే..... దానికీ ఒకటైమ్ ఉంటుంది.''

''నేను డాక్టర్‌ని కానంత మాత్రాన నాకామాత్రం తెలియదనుకోకు బావా..... ఆపైన వాక్యం పూర్తి చెయ్యటం కష్టమనిపించిందేమో తల వంచుకుని సిగ్గుతో చిరునవ్వు నవ్వింది.

ఆమె ముఖంలో ఆ సిగ్గు అపురూపంగా ఉంది. ముగ్ధుడైనట్టుగా చూస్తుండి పోయాడు.

''ఇన్ని మాటలూ చెప్పావు. ఇప్పుడు సిగ్గేస్తోందా?'' అన్నాడు చివరికి.

''ఫో! వెనకా, ముందూ ఎవరూ లేక ఇలా చెప్పుకోవల్సి వచ్చినంత మాత్రాన నాకు మాత్రం సిగ్గు ఉండదా? నువ్వు అందరు మగవాళ్ళలాంటి వాడివైతే నాకింత కష్టం ఉండేదికాదు. కాస్త కవ్విస్తే దగ్గర చేరేవాళ్ళు. కానీ నువ్వు వ్యక్తిత్వం కలవాడివి..... అయినా అందరు మగవాళ్ళల్లాంటి వాడివే అయితే నేను నిన్నీ కోరిక కోరేదాన్ని కాదు. నీ ప్రతిరూపాన్ని పొందాలనుకునే దాన్ని కాదు. నీ అందం, నీ మంచితనం, నీ విజ్ఞానం, నీ వ్యక్తిత్వం....... అన్నీ మూర్తీభవింప చేసే ఓచక్కని పసివాడినివ్వు. వాడిలో నిన్ను చూసుకుంటూ గడిపేస్తాను.''

''బాబే పుడతాడని ఏమిటి నమ్మకం? పాప కలుగుతే?''

తల అడ్డంగా ఊపుతూ నవ్వింది. ఆమెకళ్ళు కాంతివంతం అయాయి. "నేను బాబునే కంటాను."

మధుకర్ ముఖంలో భయం, విచారం, దిగులు, అయోమయం— అన్ని రకాల భావాలూ కలగలిసి ప్రతిఫలించేయి. దీర్ఘంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు.

"బెంగపడకు బావా. సమీరకు ఈసంగతి తెలియనివ్వకుండా ఉంచితే సరిపోతుంది. నా స్నేహితురాలు ఒకమ్మాయి బాంబేలో ఉంది. మాది ప్రాణస్నేహం. వాళ్ళనాన్న పెద్ద ఇండస్ట్రియలిస్ట్. నేను కన్సీవ్ అవగానే అక్కడికి వెళ్ళిపోతాను. వాళ్ళ నాన్న కంపెనీలలో ఏదో ఒక చిన్న ఉద్యోగం చూసుకుంటాను. డెలివరీ అయాక కూడా అక్కడ బాగా అన్పిస్తే ఉండిపోతాను. తిరిగి వచ్చినా మన బాబుకి ఏ నాలుగో, అయిదో ఏడు జరిగేటప్పుడు వస్తాను. అప్పుడు ఇక్కడివాళ్ళకేదో చెప్పొచ్చు."

"నాకేమీ తోచకుండా చేస్తున్నావు. చిన్నపిల్లలా నువ్వు అడిగే విచిత్రమైన కోరిక నీకెంతటి కష్టాన్ని కలిగిస్తుందో తెలుసుకోవటం లేదు నువ్వు."

"నాకెన్ని కష్టాలు కలిగినా— అందులోనే నాజీవితమంతా ఉంది బావా! నీకేం అపకారం కలగనివ్వను. ఇక్కడి నుంచి వెంటనే వెళ్ళిపోతాను."

"అలా భయపడటం లేదు. నాదిగులంతా నీ గురించే. ఒకవేళ నీ కోరికకు నేను ఒప్పుకున్నా నువ్వు గర్భవతివే అయితే నిన్ను ఏ బాంబేకో పంపించి, స్నేహితురాలి పంచన ఓచిన్న ఉద్యోగం చేసుకుంటూ కష్టపడేట్టు చెయ్యాననుకో. నార్త్‌లో ఏ ప్రశాంత స్థలానికో తీసుకెళ్ళి నీకు డెలివరీ అయేదాకా కష్టపడ



కుండా అన్నీ అమరుస్తాను. కానీ నేను భయప డుతున్నది అదికాదు. వివేకం లేకుండా నువ్వు చిన్నపిల్లలా నిప్పువంకకు ఆకర్షింపబడు తుంటే నేనూ నీకు వత్తాను నివ్వటం అవివేక మేమో అన్పిస్తుంది."

"నువ్వు నిప్పువా బావా! ఏదీ ముట్టుకుని చూడనీ!"

తులసి అతని దగ్గరికి వచ్చి నిస్సంకో చంగా అతని మెడచుట్టూ చేతులు వేసి హత్తుకుంది. ఆమె వక్షం అతని ఎదకు మెత్త గా తగిలింది. ఉద్రేకం కలిగి పరిస్థితి తన అదుపు తప్పుతుందనిపించి, నెమ్మదిగా విడి పించుకోబోయాడు.

"ఉండనీ బావా! పెళ్ళయ్యాక తొలిసారిగా నాభర్త కౌగిలి కోరుకుంటున్నాను. నాకెంతో సంతృప్తిగా ఉంది. ఈ సంతోషాన్ని కాసేపు అనుభవించనీ! నేను మరీఅంత అంటరానిదా న్ని కానుగదా."

ఒకచేత్తో అతని నడుము చుట్టి, మరోచేతిని మెడచుట్టూ వేసి ఆరాటంగా అతన్ని హత్తుకు పోయింది. అనుకోకుండా అతని చేతులు ఆమె చుట్టూపడి కౌగిలి బిగిసింది. అతని పెదవులు ఆమె ముఖాన్ని తాకబోయి సమీర గుర్తుకొచ్చి సంకోచంగా, బాధగా ఆగిపో యాయి. కానీ ఆమె వంటి మెత్తదనం అతని రక్తాన్ని మరిగిస్తోంది.

"ఆకలేస్తోంది తులసీ"

తులసి చిలిపిగా నవ్వింది.

"అన్నం పెట్టవా?"

"మరిచేపోయాను. ఈపాటికి అన్నం చల్లారి పోయుంటుంది"నొచ్చుకుంది.

"నీ పక్కమేడమీద వేశాను. వెళ్ళి పడుకో" అంది తులసి భోజనాలయినాక.

"ఇక్కడైతే చల్లగా హాయిగా ఉంది."

"పక్కింట్లో నిన్న పాముని కొట్టారట బావా! ఇంకా నయం. మనపెరట్లోకి రాలేదది. తలుచు కుంటేనే నా గుండె బేజారైంది. వెళ్ళిపైన పడు కో. నాగదిలో వేశాను".

అతను మేడమెట్లు ఎక్కివెళ్ళాడు.

తులసి గదిలోకి అడుగుపెట్టగానే ఆశ్చర్యపో యాడు.

గదిలో డబుల్‌కాట్‌మీద తెల్లటి బెడ్‌షీట్‌పరి చిమల్లెలు జల్లిఉంది. పక్కనున్న స్టూల్‌మీద స్వీట్లు, పళ్లు, అగరొత్తులూ...!

వెళ్ళిమంచంమీద కూచున్నాడు. అతని మన సంతా ఆనందమో, బాధో, విచారమో తెలియని అయోమయస్థితికి లోనైంది.

ఆమెనెలా వారించాలో తెలియటంలేదు. ఆమె కన్యాత్వాన్ని పరిగ్రహించటం న్యాయమా? లేక మరోమంచి వ్యక్తిని చూసి వివాహం చే యటం న్యాయమా? అసలేలోకం తెలియని అమాయకురాలు. నూతిలో కప్పలాగ బావే లోకం అనుకుంటున్నట్లుంది. తను తప్ప లోకంలో వేరే మంచివాళ్లే లేనట్టు ప్రవర్తిస్తోంది. ఎట్లాచెబితే అర్థం చేసుకుంటుంది? అసలేమీ ఆలోచించని వ్వకుండా ఉక్కిరిబిక్కిరి చేస్తోందే తనను! మనసా, కాస్త నిగ్రహాన్నివ్వునాకు! ఆమెకు కాస్త వివేకాన్నీ ప్రసాదించు. నన్నీ విషమస్థితినుంచి బయట పడెయ్యి.

అనుకుంటూ అతనాగదిలోంచి వెళ్ళిపోదామ నుకుంటుండగా తులసి వచ్చింది.

కళ్ళప్పగించి ఆమెవంక చూస్తూండిపోయా డు.

జరీబార్డర్‌ఉన్న తెల్లటివెంకటగిరిచీరలో నిండుగా ఉంది. తలంటిపోసుకున్నజుట్టు వదు లుగా చెవులపైకి వాలి చెంపలమీద జీరాడు తోంది. చెవులకూ, మెడలోనూ ఉన్న ఆభరణాలు ఆమె చిరునవ్వుకు మెరుగులు పుడుతున్నట్టుగా మెరుస్తున్నాయి.

ఆకుపచ్చ, ఎరుపు కలగలిపి వేసుకున్న గాజు లు, జీవితంలోని పచ్చదనానికీ, ఉద్రేకానికీ సంకే తాల్లా ఉన్నాయి.

అన్నింటినిమించి ఆమె ముఖంలో మెరుస్తు న్న మొహమాటం, సిగ్గు కలగలసిన అదో రక మైన భావం!...

అతనుచొరవతీసుకోడని గ్రహించిన తులసి గదితలుపులు వేసి, ట్యూబ్‌లైట్ ఆఫ్‌చేసింది.

గదిలో వెలుగుతున్న జీరోబల్బ్, అంతవిశాల మైన గదిని కాంతితో నింపేందుకు తనశక్తిచాలద న్నట్టు నిస్సహాయంగా ఉండిపోయింది.

ఆమె అతనిచెయ్యిపట్టిలాగి మంచంమీద

కూచోబెట్టింది! తను నేలమీద కూచుని అతనిఒడిలో తలపెట్టుకుంది.

తొడలకు ఆమెచెంపల మెత్తదనం, వెచ్చని ఊపిరితగిలి ఉక్కిరిబిక్కిరయ్యాడతను.

"ఏమిటిది తులసీ—లేచికూచో."

"ఈనాలుగురోజులూ అయినా నన్ను స్వేచ్ఛగా, సంతోషంగా, తృప్తిగా—జీవితంలో ఇంకేమీ మిగల్లేదనిపించేలా గడవనివ్వు బావా! జీవితంలో ఈక్షణాలు నాకోఅపురూపమైన అనుభూతిలా మిగిలిపోనివ్వు. నీ జీవితానికి అడ్డురాకుండా మౌనంగా తప్పుకుని వెళ్ళిపోతాను. నానుంచి ఏ అపకారమూ జరగనివ్వను నన్ను నమ్ము. నన్ను ఏ ఆక్షేపణలూ, ఏ సంకోచమూ, ఏ భయమూ పెట్టుకోక మనస్ఫూర్తిగానీ స్వంతం చేసుకో."

"ఈరోజు ఇలా తొందరపడబోయినందుకు తర్వాత విచారిస్తావు. తులసీ.! నిన్నీమూర్ఖత్వంనుంచి తప్పించినందుకు నాకు కృతజ్ఞతలు కూడా చెప్పుకుంటావు.

"నాకేమీవద్దు బావా. ఈకొద్దిక్షణాలూ చాలు. నీ ద్వారా ఓ బిడ్డకు తల్లినైతే చాలు. ఇంకెన్నిసార్లు చెబితే అర్థమవుతుంది నీకు. నన్నెందుకింత సిగ్గులేనిదాన్ని చేస్తున్నావ్? ఇక ఆలస్యంచెయ్యకు. నూరేళ్ళజీవితానందాన్ని ఈ నాలుగురోజుల్లో అనుభవించనివ్వు"

ఆమెమొండితనం ఇక వదలదని గ్రహించాక తను ఆమె నిర్ణయానికి తలవొగ్గక తప్పదనుకున్నాడు. కాదంటే ఏ అఘాయిత్యానికి తలపెడుతుందో! చిన్నతనం నుంచీ ఆమెది అసలే ఉద్రేకప్రవృత్తి!

అందుకే ఓనిర్ణయానికి వచ్చాడు.

"సరే! కానివ్వు. మనం విడాకులు తీసుకున్నా ఆ సంగతి ఇక్కడ ఎవరికీ తెలియనివ్వకు. ఇక్కడే ఉండి డెలివరీ చేసుకుందువుగాని. బిడ్డకు ఏడాది నిండేదాకా ఇక్కడే ఉండు. ఈలోగా ప్రైవేట్‌గా ఎమ్.ఏ. చేద్దువుగానీ. ఈరెండేళ్లలో ఎప్పుడో ఒకసారి సమీరకు అంతా చెప్పేస్తాను. హైద్రాబాద్‌లోనేనీకో ఇల్లుకట్టిస్తాను. నిన్ను జాగ్రత్తగా చూసుకోవల్సిన బాధ్యత నాదే. కానీ..."

"చెప్పు. ఏమిటి?"

ఓ షరతుకు నువ్వొప్పుకుంటేనే!"

"ఏమిటది? చెప్పు. వందషరతులైనాసరే. ఒప్పుకుంటాను"

"ఈ నాలుగురోజులుతప్పనువ్వుమళ్ళీ నన్ను ఎప్పుడూ ఇలాంటి కోరికలు తీర్చమని అడగకూడదు. స్పష్టంగా చెబుతాను. మళ్ళీ మనం ఎప్పుడూ శారీరకంగా ఒకటికావటం జరగదు. దానికి ఒప్పుకుంటేనే నేనన్ని బాధ్యతలూ సంతోషంగా తీసుకుంటాను. సమీర నొప్పించి సంఘంలో నీ బిడ్డకు తండ్రిగా కూడా నిలబడతాను."

"లోకం అడిగితే—?"

"అవన్నీ నాకొదిలెయ్!"

ఆమె అతనితొడమీద ఆనించిన చెంపను సున్నితంగా కదిలించింది.

అతనుక్కిరి బిక్కిరై ఆమెను నెమ్మదిగా లేవనెత్తాడు. ఎన్నడూ లేనిది ఆమెసామీప్యం అతనికీనాడు కొత్తగాఉంది. భుజాలమీద వేసినచెయ్యి జడకిందనుంచి వెళ్ళివీపుమీద ఆగి, ఆమె శరీరాన్ని దగ్గరికి లాక్కుంది.

అచ్ఛాదనలేని విశాలమైన ఛాతీమీద తృప్తిగా తలానించింది. ఆమె శరీరంమీదనుంచి వచ్చేపరిమళం అతన్ని వివశుడిని చేస్తూంది.

మరింతదగ్గరికి తీసుకున్నాడు. అతడిలో ఉద్రేకం ఉరకలు వేస్తుంది. కట్టలు తెంచుకు ప్రవహించాలనిచూస్తోంది. తలలో అగ్నిగోళం మండుతున్నట్లనిపించింది. గోళాలు, విశ్వమూ, సర్వాంతరాళమూ గిర్రున తిరుగుతూ అతన్ని ఏవోలోకాలకో తీసుకుపోతున్నట్టుగా తోచింది.

అణువణువులోనూ ఉన్న ప్రతిరక్తబిందువూ ఓ నిప్పుకణంలా వంటిని కాల్చేస్తున్నట్టుగా తోచింది.

అతని పెదవులు ఆరాటంగా ఆచ్ఛాదనలు తొలుగుతున్న ఆమె దేహాన్ని స్పృశించసాగాయి.

తులసికి కాలం స్థంభించిపోతే బాగుండుననిపించింది.

ఆనాలుగురోజులూ అలా స్వర్గంలోలా గడిచిపోయాయి ఆఇద్దరికీ.

దాదాపు ఇరవైరోజులయాక హైదరాబాద్‌చేరాడు మధుకర్. వెంటనే సమీరను కలిసి గండిపేటకు తీసుకెళ్ళాడు.

'ఏమిటిది మధు. గెస్ట్‌హౌస్ ఎందుకు బుక్‌చే

శావ్?" అంది సమీరఆశ్చర్యపోతూ.

"నీతోతృప్తిగామాట్లాడి నాలుగునెలలైంది కదూ! అందుకని— ఈరోజు కళ్ళారా చూడనీ నిన్ను."

"ఎవరికైనా తెలిస్తే బాగుండదు"

అతనామాటలు వినిపించుకోలేదు. ఆమెచేతిని రెండుచేతులతో పట్టుకునినెమ్మదిగా అరచేతిని వేలితో రాస్తూ గమనించసాగాడు.

"జ్యోతిషంనేర్చుకున్నావా?"

"నీకోసం అదీనేర్చుకోవాలనుంది."

"తమాషాగా ఉన్నాయి నీమాటలు. ఆశ్చర్యంగా కూడా ఉంది. ఇంతకీ ఏమిటి విశేషాలు?"

అతను పరధ్యానంగానూ, ఎందుకో దిగులుగానూ కూడా ఉండటం గమనించింది.

"ఊర్లో అందరూ బాగున్నారా? తులసి బాగుందా?"

మౌనంగా తలూపాడు. సమీర చెయిపట్టుకుంటే అతనికి తెలిసింది, తన సర్వప్రపంచం ఆమెసన్నిధిలో ఉందని.

కానీ కామానికి ప్రేమకు మధ్యనున్నతేడా ఏమిటో అర్థంకావటంలేదు.

సమీరమీద ఇంతటిప్రేమ ఉన్నా తులసిసమక్షంలో తనెందుకంతటి ఉధృతమైన ఆవేశానికి లోనయాడు.

"నువ్వెందుకో ఈరోజు చాలా పరధ్యానంగా, డల్‌గా ఉన్నావు నిన్నిలా ఎపుడూ చూడలేదు."

"నీఉద్యోగం బాగుందా?"

"మామూలుగానేఉంది. ప్రైవేట్‌నర్సింగ్‌హోం కదూ. పనికాస్తఎక్కువ. అందులో మా డాక్టర్‌కు నామీద మరీనమ్మకం! దానితో కేసులు ఎక్కువగా నాకే వప్పచెబుతుంటుంది. ఆపరేషన్ కేసులుకూడా. ఆమెనార్త్ ఇండియన్. కాస్త అభ్యుదయభావాలు కలవ్యక్తి. అబార్షన్‌కేసులుకూడా టేకప్‌చేస్తుంది."

"ఇప్పుడు అబార్షన్ అందరూ చేస్తున్నారుకదా?"

"పెళ్లయినవాళ్ళకే. కానీ మాడాక్టర్ ఎక్కువగా పెళ్ళికాని వాళ్లకే అబార్షన్ చేసేందుకు ప్రిఫరెన్స్ ఇస్తుంది. వయసులో ఉన్నవాళ్ళు ఆవేశంలోనో తెలియని తనంలోనో, క్షణికావేశానికి లోబడో, మానసికంగాబలహీనులయ్యో ఓచిన్నతప్పుచేస్తే దానికి జీవితంబలి కాకూడదు. ముఖ్యంగా మనఇండియన్ అమ్మాయిలు చాలామటుకు మంచిపిల్లలే. వాళ్లల్లో ప్రేమలోపడి మోసపోవటమో, అత్యాచారానికిగురికావటమో జరుగుతుంది అని ఆమె ఉద్దేశం. నాకునచ్చేది ఏమిటంటే ఆమెభర్తకూడా ఆమెనర్థంచేసుకుని సహకరిస్తాడు."

"మనంకూడా అలా ఒకరినొకరం అర్థంచేసుకుంటూ ఎప్పటికీ పోట్లాడుకోకుండా బ్రతుకుదాం. మనమధ్య ఎప్పటికీ అభిప్రాయభేదమనేదే రాకూడదు. రానివ్వకూడదు"

ఆమెఒడిలో మోచేతులు మడుచుకుని, వాటిమీద తలపెట్టుకుని బోర్లాపడుకుంటూఅన్నాడు.

"ఇంకా... ఏమేం కలలు కంటున్నావు?"

"మనకోబుల్లి ఇల్లు. ఇంటిచుట్టూ తోట. రకరకాలపువ్వులు! తెల్లగా.బొద్దుగా, ముద్దుగాఉండే ఇద్దరుపిల్లలు— ఆడో, మగో ఎవరైనాసరే! నాకభ్యంతరంలేదు. కాని బాబుపుడితేమాత్రంనేను వంశీ అనిపేరు పెట్టుకుంటాను. మురళి నాకిష్టమైన పేరుమాత్రమే కాదు మురళీనాదం నన్ను పులకరింపజేస్తుంది.

"అదేం వీల్లేదు నేను ఏ వినోద్ అనో, మనోజ్ అనో పెట్టుకోవాలనుకుంటున్నాను"

"నేను భర్తను. నామాటే నువ్వువినాలి."

"నేను భార్యను. నామాట వింటే తప్పులేదు."

"ఇంటియజమానిని నేనా? నువ్వా?"

"నేనుమాత్రం ఇంటికి యజమానురాలిని కానా?"

"భర్తమాటే నెగ్గాలనేది మన పవిత్రభారత సంప్రదాయం."

"ఏంకాదు. పెద్దలు భార్యకే ప్రిఫరెన్స్ ఇచ్చారు. అందుకే భార్యాభర్తలు అంటారు కానీ భర్తభార్యలు అనరు. ఆలూమగలు అంటారు. పార్వతీపరమేశ్వరులంటారు. లక్ష్మీనారాయణులంటారు. చివరికి కలియుగదైవాన్నికూడా 'అలివేలు మంగపతి' అంటారు."

"మరేం ఫరవాలేదు. రావాలంటే నువ్వుకూడా సమీరామధుకర్ అని పేరుపెట్టుకో. అలా ఎందుకు పిలుస్తారంటే ఫలానా అమ్మాయి

# న్యూస్ రీడర్ కనురెప్పల చివరలు స్పష్టంగా కనిపించాయి అంటే



## అది సోలిడైర్ అయితీరాలే!



TS 33E (with shutters)

TS 32E

PET 14

# Solidaire

**-that seldom fails!**

ఫలానా అబ్బాయికి స్వంతం అని చె ప్పేందుకు.''

''నేనేం నీ ప్రాపర్టీనికాదు. నేనూ మనసున్న మనిషినే. నాకూ ఓవ్యక్తిత్వం ఉంది. నామాట కూడా నువ్వువినాల్సిందే!''

''అసలుసంపాదించి ఇంటిని పోషించేది ను వ్వా నేనా?''

''మహాగొప్ప. నేనూ సంపాదిస్తాను. నువ్వొక్కడి వేకాదు.''

''మళ్ళీ అదికూడానా? నువ్వసలు ఉద్యోగం చేసేందుకు వీల్లేదు.''

''నన్ను ఉద్యోగం చేయొద్దనేందుకు నువ్వెవ రు?'' అదినాఇష్టం. మీకుతోడునీడగాఉండి మీ జీవితాన్ని సుఖమయం చేసేందుకు పెళ్ళిచేసు కుని మీ ఇంటికి వస్తున్నాను. అంతేకానీ నా వ్యక్తిత్వాన్ని చంపుకునేందుకు కాదు.''

''అదికాదు సమీరా—ఆడవాళ్ళు చక్కగా ఉదయమే నిద్రలేచి, స్నానంచేసి, ఇంటిని, ముంగిలిని శుభ్రంచేసుకుని, దేవుడికి దీపంవెలి గించి భర్తకు, పిల్లలకు వండిపెడ్తూ...''

ఆమాట అంటూ వాడిపోయిన సమీర చూపు చూసి ఫకాల్న నవ్వేశాడు.

''అరే! అలా ముడుచుకు పోయావేం'' ఇదంతా నిజంగా అంటున్నాననుకున్నావా? ఉట్టి దేయ్! భవిష్యత్తులో మనకుఎప్పుడైనా పోట్లాడే అవకాశం వస్తుందో,రాదో, అముచ్చట తీరుతుందో లేదోనని ఇప్పుడే సరదాతీర్చుకుంటున్నాను. అయినాఇంతగొప్ప డాక్టర్ని దేశానికి, పేషంట్లకు దూరం చేసేంత పిచ్చివాడిననుకున్నావా?''

''తమాషాకు పోట్లాడుతున్నావని గ్రహించా నులే! కానీ నీధోరణిచూసి...''

మధుకర్ ముఖం ఎంతో ఉత్సాహంగా, ఆనందంగా ఉంది.

''భార్యగా నావిధులునిర్వర్తించేందుకు నాకే అభ్యంతరమూలేదు. అదినాకు సంతోషాన్ని స్తుంది కూడా. కానీ నావృత్తిపరంగా తీరికదొరకక ఎప్పుడైనా చెయ్యలేకపోతేమాత్రం బాధపడకూడ దు''

''నీగురించి నీకన్నా నాకే ఎక్కువ తెలుసను కుంటున్నాను.

'మనమధ్య ఓవేళ అభిప్రాయభేదం అంటూ వస్తే ఎవరిమాట సమంజసంగా ఉంటుందో కూల్‌గా ఆలోచించి నిర్ణయంతీసుకోవాలి. అంతే గానీ పోట్లాడుకోకూడదు.''

''ఓకే! ఏదేమైనా చివరిమాటనీదే.''

''ఇప్పుడీవేడిలో అన్నీ ఓ.కే. అంటారు. కాస్తచ ల్లబడ్డాక అధిపత్యం నిలబెట్టుకోవాలని చూస్తారు మీమగవాళ్ళు.''

''వేడిగా ఎక్కడుంది? వాతావరణం చాలాచ లిగాఉందిగదా! పైగావర్షం కూడా పడుతోంటే!''

సమీరభుజాలుపట్టి దగ్గరికి లాక్కుంటూ అన్నాడామాటలు.

''ఏమిటిది. వదులు. నీమీద నమ్మకంతో వస్తే...''

పట్టుసడలించాడు మధుకర్.

''ఇంతకూ ఏమంటుంది తులసి. విడాకులు తీసుకుంటున్నట్టేనా?''

మధుకర్‌ఆమెకు ఎంతవరకూ చెప్పటం మంచిదా అని ఆలోచిస్తున్నట్టుగా ఉండిపోయా డు.

''చెప్పు అలాకామ్‌గా ఉన్నావెందుకు?''

''ఆమెచేసుకుందా మనుకున్నతను ఈమధ్యే చనిపోయాడు.

''మరి....'' సమీర ఆపైన మాట్లాడలేకపో యింది.

''నాకువిడాకులిస్తానని చెప్పింది. నేను మన గురించి చెప్పాను. తననూ వేరే వివాహంచేసుకో మన్నాను. కానీ తను యూనివర్శిటీలో చేరి 'లా' చదువుతానంటోంది. ఆతర్వాత పైచదువులకు లండన్ వెళ్తానంది.''

''ఆ అమ్మాయి గ్రాడ్యుయేటా?''

''మా పెళ్ళినాటికే ఫస్టియర్ ఎగ్జామ్స్‌రా సింది. వద్దుఅంటుంటే అత్తయ్య బలవంతాన పెళ్ళిచేసి ఇంట్లోకూచోబెట్టింది. ప్రైవేట్‌గా కట్టి పాస్‌అయ్యింది. సెకండ్‌క్లాస్ వచ్చింది.''

''లా''కన్నా ఎమ్.ఎ.చేస్తే సర్వీస్ కమిషన్ ఎగ్జామ్స్ రాసి లెక్చరర్‌గా చేరవచ్చుకదా''

''అది ఆమెజీవితం, ఆమెఇష్టం. ఈసారికలి స్తే నీసలహా చెబుతాను''

''కానీ ఆమెజీవితం గురించి మనంకూడా

ఆలోచించాలి. నాకైతే ఎందుకో చాలావెలితిగా అన్పిస్తుంది. ఆమెను బాధపెట్టడమే జరిగితే అది అన్యాయమే. కానీ నిన్నువదులుకోలేన న్నించేంత బలీయంగా నీమీద అటాచ్‌మెంట్ పెరిగింది.''

అతను ఆమెను చెయ్యిపట్టి గుండెలమీదికి లాక్కున్నాడు.

''అందుకే ఏపిచ్చి ఆలోచనలూ పెట్టుకో కుండా భారంనామీద వదిలేసి నిశ్చింతగా ఉండమంటున్నది. మనభవిష్యత్తు గురించి నేనే వేవో కలలుకంటుంటే నువ్వు నాఆశలన్నీ నీ అనుమానాలతో భయాలతో చెదరగొడుతున్నావు. నాకున్నది ఒకటేచింత.''

''ఏమిటది?''

విడాకులు తీసుకున్నతర్వాత మాఅత్తయ్యా ఆస్థి నాకూ సగభాగంవస్తుంది. నువ్వు పరిచ యంకాక ముందు నాభాగం మాబావమరిదికిచ్చే ద్దామనుకున్నాను.''

''ఇప్పుడూ అలాగే చేయండి.''

''ఉద్యోగమో, ఏదో ఒకఆధారం దొరికేదాకాఆ స్థి ఉంచుకుందామనుకుంటున్నాను.''

''ఎందుకలా?''

''ఇప్పుడు నాజీవితంలో నువ్వుకూడా ఉన్నావు. మనంకాపురంపెట్టాలంటే...''

''ఏదో ప్రైవేట్ హాస్పిటల్‌లో చూసుకుని నెమ్మ దిమీద గవర్నమెంట్ జాబుకు ట్రైచేద్దాం. మెల్లి గా ఓ క్లినిక్ ఓపెన్ చేసి సాయంత్రాలు ప్రాక్టీస్ చేసుకుందాము.''

''నాకూ అలాగే అన్పిస్తుంది. మా అత్తయ్యా తనకూతురితో కాపురంచేస్తానన్న ఉద్దేశంతో రా సిచ్చింది. ఇప్పుడు నాకు దాన్ని అనుభవించే హక్కులేదనిపిస్తుంది.''

''ఏమాత్రం ఆస్తి వస్తుంది?''

''దాదాపు ఐదారులక్షలు. ఇంకా ఎక్కువేనేమో ఖచ్చితంగా తెలీదు.''

''ఎక్కడుంది?''

''విజయవాడదగ్గర ఊరు మాది. ఆ దగ్గర్లే పొలాలున్నాయి. రాజమండ్రిలో కొబ్బరితోటలు ఉంటే కౌలుకిచ్చారు. అవి అమ్మేద్దామంటుంది తులసి. చక్కెరఫ్యాక్టరీలో షేర్లున్నాయి. అన్నీమా ఇద్దరికీ సగంసగంరాసింది. అత్తయ్యపొలాలన్నీ కౌలుకిచ్చారు. వరిమడులుమాత్రం బాగానమ్మ కంతో మామయ్యకాలంనుంచి పనిచేస్తున్న రాఘ వయ్యే దగ్గరుండి చేయిస్తున్నాడు. ఆయనకు సంవత్సరానికి సరిపడే ధాన్యం, నెలనెలా జీతంకూడాఇస్తున్నాము. ఇవన్నీకాక నగలే ఓమూ డులక్షల విలువచేసేవి ఉన్నాయి తులసికి. వాటిని కూడా మాఇద్దరి పేరుమీద లాకర్‌లో పెట్టించింది అత్తయ్య.''

''మీ తులసి బాగుండదా?''

''పెళ్లప్పుడంత బాగోలేదనుకున్నాను. కానీ ఇప్పుడు అందంగానే తయారయింది.''

''మీరు విడిపోకపోతే ఆ ఆస్థిఅంతా మీఇద్ద రూ అనుభవించవచ్చుకదూ!''

''ఆఫ్‌కోర్స్! ఎందుకలా అడుగుతున్నావు?''

''విడాకుల ద్వారావిడిపోతే ఆస్థిలో సగభాగం నీకుచెందదనే క్లాజ్ పెట్టారా మీఅత్తయ్య?''

''లేదుకూతురితోవిడిపోయినా, ఏపరిస్థితిలో అయినానాకు సగభాగం చెందుతుంది.''

''అయితే ఇప్పుడాసగం మనంఉంచుకోవచ్చ న్నమాట.''

''ఉంచుకోవచ్చు. మాబావమరిది ఓలక్షాధికా రికి ఇల్లరికంవెళ్ళాడు. నాభాగం వచ్చేపొలాలత నికిచ్చేసి, కొబ్బరితోటలు, చక్కెరఫ్యాక్టరీ షేర్లు తు లసికి రాసేస్తాను. అవి అమ్మేద్దామంటుంది తను. కొబ్బరితోటలమ్మేస్తాను. కానీ, చక్కెరఫ్యాక్టరీ షేర్లు ఎలాఉన్నాయో ఓసారి రాజమండ్రి వెళ్ళి ఆవివరాలవీ చూడాలి.''

''మీ ఊరు విజయవాడ దగ్గరన్నావు. రాజ మండ్రిలో షేర్లుతోటలెందుకు కొన్నారు. దూరంక దా! చూసుకోవటం కష్టంకదూ?''

''రాజమండ్రి మా మామయ్య ఊరే! ఏవో కుటుంబగొడవలవల్ల ఆయన విజయవాడలో పొలాలు కొని అక్కడే సెటిల్‌అయారు.''

సమీర ఏదోఆలోచిస్తూఉండి పోయింది.

''ఏమిటంత ఆలోచన? ఇందాక ఎందుకలా అడిగావ్?''

''నాకోసం అంతఆస్థిని వదులుకోనేందుకు సిద్దపడ్డావంటే లోకంలో ఇంకానిజమైన ప్రేమమి గిలిందన్పిస్తుంది.''

"ఒక్కఆస్తినేకాదు. నీకోసం అవసరం అయితే ఆ పరిస్థితే వస్తే ప్రాణంవదిలేసేందుకు కూడా సిద్ధంగా ఉన్నాను"

అతనినోటిని అరచేత్తో మూసింది.

ఆమె చేతిని పక్కకుతీసి, సున్నితంగా అరచేతిని ముద్దుపెట్టుకుని చిలిపిగా నవ్వుతూ "ప్రేమికుడి నోరు మూసే పద్ధతిఅదికాదు." అన్నాడు.

ఆమెసిగ్గుపడింది.

"ఇంతదూరం నీకోసమేవచ్చాను. నాకేంబహుమతిస్తావు?"

"ఎందుకొచ్చావు?" చిలిపిగా అడిగింది.

"నాఆస్తి ఎలా ఉందో చూసుకుందామని"

"సిగ్గులేదు. రోజురోజుకీ నీభాష మారిపోతుందే!"

"పెళ్లయితే ఇంకామారుతుందికదా. ముందుగా ఇది ప్రొబేషనరీ పీరియడన్నమాట."

అతనిచేతులు ఆమె భుజాలమీదినుంచి వీపుమీదికి జారాయి. అతను ఆవేశపడుతున్నాడని అర్థమై, లేచేందుకు ప్రయత్నించింది.

"ప్లీజ్! వద్దు. వెళ్లాం. ఇక వంటరిగా ఉంటే ఇలాగే అనిపిస్తుంది."

"నమీ! ఎందుకొద్దంటున్నావ్! కాదనకు. ఇక మళ్ళీ మూడునెలలదాకా నిన్ను చూడటం కుదరదు. విడాకుల గొడవతో విజయవాడలో లాయర్ చుట్టూ తిరగాల్సివస్తుంది. రాఘవయ్యగారు కా



లుజారిపడి మంచంమీదున్నారు. ఎముక విరిగింది. ఇంకా నెలదాకా మంచం దిగలేరు. ఆ వరిమడి దున్నించి, నాట్లుపెట్టించే వ్యవహారాలు కూడా నేనే చూడాల్సి వస్తుంది.''

"బాగుంది. ఈగొడవల్లోపడి నర్సరీగురించి మరిచిపోతావేమో. సరే! అప్పుడు సాగర్‌లో ఏదో అయిపోయింది. మళ్ళీ తొందరపడటం నాకిష్టంలేదు.''

"అంతవరకూ నిన్నుచూడకుండా ఉండాలంటే నావల్లకాదు. నువ్వు నాస్వంతం అనే ఊహ ఉంటే నీకోసం ఎంతటి కష్టాలైనా పడాలనిపిస్తుంది. కాని ఈసారి రావటమేజరిగితే—ఆర్య సమాజ్‌మందిర్‌లో పెళ్ళికొడుకుగా కూచునేందుకే వస్తాను. లేదా- నామీద నమ్మకంలేదంటే చెప్పు. ఇక్కడే ఉండిపోయి ముందుగా నిన్ను వివాహంచేసుకునే వెడతాను. తులసి వైపు నుంచి ఏగొడవలూ ఉండవు లీగల్‌గా''

"అలావద్దు. విడాకులయాకే మనపెళ్ళి.''

"నామీద నమ్మకం లేదుకదూ! అందరు అమ్మాయిల్లాగా నన్ను ఓ మోసగాడిగానే ట్రీట్‌చేస్తున్నావు.''

"ఆడవాళ్ల సమస్యలు, భయాలు మీమగవాళ్ల కర్థంకావు.''

" ఏమైనా అవుతుందని భయమా?''

"అఫ్‌కోర్స్!''

'నీబిడ్డకు తండ్రిగానేను నిలబడనని అపనమ్మకం కదూ!''

"అలా నిలబడలేని పరిస్థితులొస్తే?''

"ఎలాంటి పరిస్థితులూ నన్ను నీనుంచి విడదీయలేవు. నీకు ఇంకానామీద నమ్మకం లేదంటే నిన్ను బలవంతం చేసేంత మూర్ఖుడినికాను. అది చాలా అసహ్యం కూడా''

సమీర రెండుక్షణాలు మౌనంగాఉండిపోయింది. మనసులోనే ఓ నిశ్చయానికి వచ్చింది. కామ్‌గా అతని పక్కన పడుకొని అతని చెయ్యితీసుకొని నడుంమీద వేసుకొంది.

"ఏదో కాంప్రామైజ్ అవుతున్నట్టుగా సిద్ధపడకు. ఇదికేవలం బయోలాజికల్ నీడ్ తీర్చుకోవటం కాదు. నిన్ను దగ్గరికి తీసుకోవటంతోపాటూ నీ మనసునుకూడా పొందుతున్న తృప్తికావాలి.''

"ఇంకా...? నాకిప్పుడు ఇరవైఏడేళ్ళు. వయసు తనధర్మం తాను నిర్వర్తిస్తుంది. సంస్కారులైనా, విద్యావంతులైనా, విద్యాహీనులైనా, ధనికులైనా, బీదవారైనా—అందరి విషయంలోనూ శరీరధర్మం ఒక్కటే. నాకూ కోరికలున్నాయి. కానీ మనకోరిక తీర్చుకోవటంకోసం అమాయకులైన పసిపిల్లలను గుండెకోతకు అవహేళనకు గురిచేయకూడదు. స్త్రీగా అబరువు మొయ్యాల్సింది నేనే. పైగా నాకిప్పుడు ఆర్థిక స్వాతంత్ర్యంకూడా లేదు.''

"అయిందా ఉపన్యాసం ! అదంతా నువ్వుతల్లివై బిడ్డనుకని, నాతోడులేకుండా జీవించాల్సి వచ్చిననాడు! నాకంఠంలో ప్రాణముండగా అలాంటిది జరుగదు''

అతని మూడ్‌మార్చేందుకు పెదవులమీద ముద్దుపెట్టుకుంది సమీర. అది అతని ఆవేశాన్ని ఉధృతపర్చింది. ఈసారి ఆమె ఏఅడ్డూ చెప్పలేదు.




మధు విజయవాడకు వెళ్ళేసరికి లాయర్‌గారు ఊళ్ళోలేరు. ఏదోపనిమీద ఢిల్లీవెళ్ళారని తెలిసింది. ఉండి వెయిట్‌చేద్దామంటే వారందాకా రాడన్నారు.

ఊరికి వెళ్ళిన మధుకర్ పొలంపని, ఆవ్యవహారాలు చూస్తూ మరోనెలదాకా లాయర్‌ను కలిసేందుకు వెళ్లలేదు. మళ్ళీ వెళ్ళేసరికి ఆయన ఏదో పెళ్ళికి వెళ్ళారని తెలిసింది.

ఉసూరుమంటూ తిరిగివెళ్ళిపోయాడు. ఇంతలో బావమరిదికి ఫ్లూవచ్చి సీరియస్‌గా ఉందన్న కబురు వచ్చింది. తులసిని తీసుకుని రాజమండ్రి వెళ్ళాల్సి వచ్చింది. అక్కడే కొబ్బరితోటలు, షేర్లు చూసుకొని, అవసరమైన వ్యక్తుల

ను కలిసి, ఆస్థి చేతికి రాగానే అమ్మే ఏర్పాట్లు చూసుకొని ఊరుచేరేసరికి మరోనెల పట్టింది.

ఇక ఆలస్యం చేయకుండా లాయర్‌ను ఎలా అయినా, అవసరమైతే అక్కడే ఉండిఅయినా కలవాలనుకుని విజయవాడవెళ్ళాడు. ఒకపక్కన మీర ఎలాఉందో తెలియదు. ఏపరిస్థితిలోనూ తనకు ఉత్తరాలు ఇంటికి రాయవద్దని, మరీఅవసరమైతే నర్సింగ్‌హోంకు రాయమని అడ్రెస్ ఇచ్చింది. కానీ అవి వరాయివాళ్ళచేతిలో పడతాయనే భయంతో రాయలేకపోయాడు. విజయవాడలో పనిఅయాక అటునుంచటే వెళ్ళి ఓగంట సేపు మాట్లాడి తిరిగిరావాలనుకొన్నాడు.

లాయర్‌ను సులభంగానే కలిశాడు. ఆయన చెప్పిన వివరాలు విని నిశ్చేష్టుడయాడు. అత్తగారు మళ్ళీరాసిన విల్లుగురించి తెలీదతనికి.

"అమ్మాయితే చెప్పానే మీఊరికి వచ్చినప్పుడు. నీతో చెబుతుందనుకున్నాను. చెప్పలేదా?"

లేదన్నట్టుగా తల ఊపాడు.

"మీరు కలిసి కాపురంచెయ్యరని భయపడ్డట్టున్నారావిడ.అందుకే ఓబిడ్డను కని, ఓ కప్పు కింద ఇద్దరూ భార్యాభర్తల్లా కాపురంచేస్తేకాని ఆస్తి అనుభవించే హక్కులేకుండా చేశారు. ఏపరిస్థితిలో అయినా విడిపోతే ఆస్తి మీఇద్దరికీ చెందకుండా కొడుక్కు సగం, మిగతా సగం అనాథశరణాలయానికి చెందేట్టురాశారు. చెల్లెలిని అన్నగారు ఆమె బతికున్నంతకాలం పోషించి నెలనెలా ఓరెండువందలు ఇచ్చేట్టుగా ఆదేశించారు. ఒకవేళ మీరోబిడ్డనుకని, కాపురంచేసినా, ఆస్తికి గార్డియన్లలా ఉంటూ బతికున్నంతకాలం అనుభవించే హక్కు తప్ప దాని మీద మీకేఅధికారమూ ఉండదు. మీరు కాపురం చేసేట్టయితే ఆస్తి తులసికి, నీకు పుట్టే పిల్ల,లందరికీ మైనారిటీతీరాక సమానంగా చెందుతుంది—ఆడఅయినా మగఅయినా."

"నేను తులసిని వదిలేస్తే?"

"చెప్పాను కదా? ఆస్తి తులసికీ, నీకూ ఇద్దరికీ దక్కదు. మీరు కాపురం చేసేట్టయితేనే దక్కుతుంది. మీరు వదిలేస్తే ఆమె జీవితాంతం అన్నగారి పంచనఉండి అతని దయాధర్మం మీద ఆధారపడి బతకాలి. అయినా ఆఅన్నగారి చేతిలో ఆస్తి ఎంతకాలం ఉంటుందిలే. పేకాటకో, తాగుడుకో ఏడాది తిరిగేలోగా సమర్పించేస్తాడు. ఇక ఈఅమ్మాయి వదినగారి చేతికింద బతకాల్సి వస్తుంది. రాజేశ్వరమ్మగారు మరణించే ముందు రోజు రాసి సంతకంపెట్టారు. ఆవిడింక ఒక్కరోజు బతికున్నా మీరు తులసిని వదిలేస్తే కనీసం వరిమడి అయినాతులసికి వచ్చేలా మరోక్లాజ్ కలిపేవాడిని .

"నాకు తెలీకఅడుగుతానబ్బాయ్. ఆపిల్ల చేసుకుందామనుకున్న సూర్యం ఎలాగూపోయాడు. పిల్లచూస్తే దబ్బపండులాఉంది. వదిలేసుకోవటం ఎందుకు? నువ్వేపనీ చేయకుండా కూచుని అనుభవించేంత ఆస్తి చేతికి వస్తుంటే"

"అలా వీలుకాదు. కావాలంటే తులసిని నేనే పోషిస్తాను. మేము విడాకులు తీసుకునే ఏర్పాటు ఉంటే చెప్పండి."

"విడాకులు తీసుకోవటం ఎందుకు? దగ్గరుంచుకుని పోషించటం ఎందుకు? నీతరహా చాలావిచిత్రంగా ఉంది"

"నేనింకో అమ్మాయిని ప్రేమించానండీ! ఆమెనుతప్ప ఎవరినీ భార్యగా స్వీకరించేస్థితిలో లేను"

"ఆ (! ఫరవాలేదు. భావనకేముంది. మనమెలా అలవాటుచేసుకుంటే అలా కలుగుతుంది. ఇంత ఆస్తినీ..."

"అలావీల్లేదండీ! నేనా అమ్మాయినితప్ప మరెవరినీ భార్యగా పొందదల్చుకోలేదు. ఇక ఈనిర్ణయానికి తిరుగులేదు. మాకు విడాకులొచ్చే ఏర్పాటు ఉంటే చూడండి."

"తులసికి నువ్వుపెళ్ళయిన రెండేళ్లదాకా ఉత్తరమేమైనా రాశావా? కలిసి మాట్లాడావా? ఫోన్ అయినా చేశావా? ఎవరితోనైనా క్షేమసమాచారాలు తెలిపి తెలుసుకునేవాడివా?"

"ఇవేవీ జరగలేదు. కానీ రెండేళ్ళు విడిపోయిఉన్న తర్వాత తులసి నాకు రమ్మని ఉత్తరంరాసి, టెలిగ్రామ్‌కూడా ఇవ్వటంతో నిమ్మపల్లి వచ్చాను. ఇప్పుడక్కడే ఉంటున్నాను."

"ఇంట్లో వంటమనిషితప్ప మరెవరూ లేరా? మీ ఇద్దరే ఉన్నారా?"

"అవునండీ"

"అయితే నీకు విడాకులు దొరకటం కష్టమేన

బ్బాయ్!'' చేతిలో ఉన్న సిగరెట్‌ను యాష్‌ట్రేలో కుక్కి వివరంగా చెప్పేందుకు సన్నద్ధమయ్యాడు లాయరు.

''రెండేళ్ళు కలవకుండా ఆగినవాడివి నీభార్య టెలిగ్రాం ఇవ్వగానే వెళ్ళకుండా లాయర్‌ను కన్సల్ట్ అయి ప్రొసీడ్‌అయిఉంటే బాగుండేది. ఈపాటికి హాయిగా విడాకులు దొరికిఉండేవినీకు. తులసి తనంతటతాను అంగీకరించి సంతకం పెడితేతప్ప విడాకులు తేలికగా దొరకవు. స్త్రీకోరితే దొరికినంత సులభంగా పురుషుడుకోరితే విడాకులు దొరకవు. దానికి కారణం— స్త్రీకి చట్టంద్వారా రక్షణ కల్పించాలన్న సదుద్దేశమే! పిచ్చి, కుష్ఠు, అడల్టరీ— అంటే వ్యభిచారం—దాన్ని ప్రూవ్‌చేయగలగాలి కోర్టులో! ఇలాంటి కారణాలుంటే తప్ప తేలికగా విడాకులు మంజూరుకావు. విడాకులు దొరకకపోతే నువ్వు రెండో పెళ్ళి చేసుకోవచ్చు. కానీ నీభార్య సంతానవతి అయ్యేందుకు అనర్హురాలని కానీ, సంసార సుఖం ఇచ్చేందుకు అయోగ్యురాలని కాని డాక్టర్ సర్టిఫికెట్ ప్రొడ్యూస్‌చెయ్యగలగాలి. నువ్వు దొంగసర్టిఫికెట్ ఇచ్చినా కోర్టుకూడా మరోడాక్టర్ ద్వారా చెకప్ చేయించి అనుమాననివృత్తి చేసుకుంటుంది నీ భార్యకోరితే . ఇకపోతే జ్యుడీషియల్‌సపరేషన్ ఒక్కటే నీకు శరణ్యం. మళ్ళీ రెండేళ్ళు నీభార్యకు అన్నివిధాలా దూరంగా ఉండాలి. ఉన్నానని రుజువుచేసుకోవాలి. ఈపద్ధతిలో విడాకులు దొరికినా సంవత్సరందాకా నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకోకూడదు. ఈసంవత్సరకాలంలో మనసుమారి ఇద్దరూ కలిసే అవకాశం ఉందని చట్టం అభిప్రాయం. కోర్టు ప్రొసీడింగ్స్‌తో కలుపుకుని ఇదంతా అయ్యేసరికి నాలుగేళ్ళు పడుతుంది.''

''తులసి విడాకులిచ్చేందుకు సిద్ధంగా ఉంది.''

''నేన్నమ్మను. ఆస్తి గురించిన వివరాలన్నీ చెప్పానాఅమ్మాయికి. అవివిన్న తర్వాత కూడా అందుకు సిద్ధపడేందుకు తులసి తెలివి తక్కువది కాదని నానమ్మకం''

''ఇదంతా ముందే ఎందుకు చెప్పలేదు?''

''మీ రెండో వివాహ వార్షికోత్సవ దినాన్నే మీకీ విల్లుసంగతి చెప్పమని మీఅత్తయ్యగారి ఆదేశం! కూతురి మొండివైఖరిని కాచి వడపోసి తెలుసుకుందావిడ.

కేవలం ఆస్తికోసంకాకుండా, రెండేళ్లకాపురంలో ఒకరిపట్ల ఒకరికి ప్రేమ, అవగాహన కలుగుతాయేమో చూడమన్నారు. అలాంటివేవీ జరగక మీరిద్దరూ విడిపోయేందుకు సిద్ధపడితే అప్పుడు చూపమన్నారు. మీనడుమ సహజమైన ప్రేమ, సహచర్యంతో ఏర్పడే అవగాహన కలగాలని ఆవిడ తాపత్రయం.''

''నాకింకేదారీ లేదంటారా?''

''వివాహం చేసుకోదల్చుకున్న స్త్రీని ఉంచుకోవచ్చు.''

''అలా మాట్లాడకండి సార్''

''లేదాపెళ్ళిచేసుకుని ఉంచుకోవచ్చు. కానీ పెళ్లయిన ఆధారాలుండకూడదు. అది మీ ఆత్మతృప్తికోసమే. పెళ్లయిన రుజువులుంటే తులసి నీమీద కోర్టుకు కంప్లయింట్ చేసుకోవచ్చు. అప్పుడు పెళ్ళయిందని కోర్టునమ్మితే ఏడేళ్ళు జైలు శిక్ష, జరిమానా పడతాయి. లేదా ఆమెను మీరు ఉంచుకున్నారని కోర్టును నమ్మించి బయటపడవచ్చు.''

సమీరను ఆ స్థితిలో ఎంతమాత్రమూ ఊహించలేడు తను. గౌరవనీయమైన వైద్యవృత్తిలో ఉన్న ఓస్త్రీని కోర్టుబోనులో నించోబెట్టి లాయరు సభ్యకరమైన ప్రశ్నలు వేస్తుంటే భరించేశక్తి తనకేమాత్రం లేదు.

ఇప్పుడతనికి అర్థమైంది. తులసి ప్రవర్తన ఎందుకలాఉందో!

తనను రెచ్చగొట్టి ఫెర్టిలిటీ పిరియడ్ చూసుకుని మరీ తననెందుకు కవ్వించిందీ!

తనద్వారానే బిడ్డను కనాలని ఎందుకు తాపత్రయపడిందీ!

నలుగురూ చూసేలా తనకు సేవలు ఎందుకు చేసిందీ!

అందరూ గమనించేలా పెరట్లో తన మంచంమీద కూచుని నవ్వుతూ ఎందుకు కబుర్లాడిందీ!

''నువ్వాఅమ్మాయిని ఉంచుకున్నా ఆ అక్రమసంబంధం రుజువైనా కోర్టు నిన్నేమీ శిక్షించదు. ఆవిషయంలో చట్టంనుంచి స్త్రీకి రక్షణలేదు. నీభార్యకు నీతో రాజీపడి బతకటమో, విడిపోవ


అందం — ఆరోగ్యం
JEEVANTONE
బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.
జీవన్‌టోన్ లేబుల్‌ను కంపెనీకి పంపి పెద్ద బహుమతి టికెట్‌ను పొందండి
ఒక సీసా తాగింతర్వాత ఇంకా ఎన్ని సీసాలు తాగాలో మీరే నిర్ణయిం చేసుకోగలరు
ఆరోగ్యంగా లేకపోతే రోగాలపాలవుతారు
మంచి ఆరోగ్యం, బలం, శక్తి పుష్టిగా కండరాలు పొందిన తర్వాత ఈ మందును ఆపివేయడం మంచిది
Contact our new sole Distributors"
M/S. New Shakti Pharma,
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
Phone: 2866
JEEVANTONE
వి.పి.పి. కొరకు
జీవన్‌టోన్ ప్రాడక్ట్
పి.బి.నం. 880,17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-560 008
450 Grams Rs. 36/-
SINDU

టమో ఒకటేదారి. మీ మనసుకు మీరు జవాబు దారీ అనుకునే ఆత్మవిశ్వాసం ఆమెకు, నీకు ఉంటే పెళ్ళిచేసుకుని రుజువులు లేకుండా చేసుకుని కలిసి జీవించవచ్చు. అప్పుడు తులసి నిన్నేమీ చేయలేదు భరించి ఊరుకోవటంతప్ప. నీకు ఆస్తికూడా వస్తుంది. రాజేశ్వరమ్మగారి లాయర్ను నేను. నీకిలాంటి సలహా ఇవ్వకూడదు. కానీ చిన్నప్పటినుంచి నిన్ను తులసిని బాగా ఎరుగుదును. తులసి మొండితనం, ఆమె స్వభావం తెలుసుకాబట్టి నీ నూరేళ్ళజీవితం నాశనం కాకూడదన్న మానవతావాదంతో చెబుతున్నాను. నువ్వు నిజంగా ఆ అమ్మాయిని అంతప్రాణంగా ప్రేమిస్తుంటే ఇదొక్కటే నీకు శరణ్యం. తులసి నీకు విడాకులిచ్చేందుకు ఏమాత్రం ఒప్పుకోదు. నాకది బాగా తెలుసు.

కాసేపు మౌనంగాఉండి మళ్ళీ అన్నారాయన.

"ఇదంతా చెబుదామంటే నీ చిరునామా ఇవ్వలేదు తులసి. నేనే వాకబుచేసుకొని ఓసారి హైద్రాబాద్ వచ్చాను. నువ్వప్పటికే వెళ్ళిపోయావు."

"మంచిదండీ? ఎంతోవివరంగా చెప్పి చాలా మేలుచేశారు. చాలాచాలా థాంక్స్! ఇకవస్తాను."

ఆయన డ్రాయర్ తెరచి ఫైల్లో ఉంచిన కాగితాలుతీసి మడిచి బ్రౌన్కవర్లో పెట్టిఇచ్చారు.

"ఏమిటిది?"

"విల్లుతాలూకు కాపీ. తులసికీ ఒకటిఇచ్చాను."

మౌనంగా అందుకున్నాడు.

• • •

"డాక్టర్ సమీరా! మిసెస్ సింధియా అర్జంట్ పనిమీద బయటికెళ్ళారు. వార్డునెంబర్ త్రీలో ఈరోజు టాన్సిల్స్ ఆపరేషన్ ఒకటిఉంది కదా! అది మిమ్మల్ని చెయ్యమన్నారు. ఇఫ్ యూ వాంట్ ఐవిల్ అసిస్ట్యూ!" అన్నారు రాజన్.

"ఇట్సాల్రైట్! అంత అవసరం రాదనుకుంటాను. మీరు విశ్రాంతి తీసుకోండి సార్."

"ఓ.కే! దైవెన్! నాడ్యూటీ అయిపోయింది. నావర్క్ కరుణకు ఒప్పజెప్పి నేనింటి కెళ్తున్నా" అని వెళ్ళిపోయాడు. రాజన్ నవ్వుతూ.

రాజన్ పుట్టుకతో తమిళుడయినా హైదరాబాద్లో పెరగటం చేత తెలుగు చక్కగా మాట్లాడతాడు. ఏ యాసనైనా సులభంగా అనుకరించి తీరిక సమయాల్లో నవ్విస్తుంటాడు.

ఈమధ్య సమీరకు పని ఎక్కువైంది. సమీర చాలా సిన్సియర్గా, బాధ్యతగా, చక్కగా చేస్తుందని మిసెస్ సింధియా అన్నికేసులూ ఆమెకే ఒప్పచెబ్తోంది. దానికి తగినట్టే జీతంకూడా పెంచింది. సమీరకు పని చేయాలంటే ఎప్పుడూ సంతోషమే! కానీ ఈమధ్యే ఎందుకో మత్తుగా, నీరసంగా ఉంటోంది. నిద్రకూడా ఎక్కువయినట్టుగా అన్పిస్తోంది. అప్పుడప్పుడూ కళ్ళు తిరుగుతున్నాయి కూడా.

ఇదంతా పనిఎక్కువై, వేళకు తిండి, నిద్రలేక వచ్చే జనరల్ వీక్నెస్ అనుకుంటోంది. పైగా మధుకర్ ఆలోచనలతో మనశ్శాంతికూడా కరువైంది.

ఆరోజుకు వర్క్- అయినట్టే! ఇక ఆ ఆపరేషన్ ముగిస్తే!

ఆమె వెళ్ళేసరికి సిస్టర్ ఆ అబ్బాయిని ఆపరేషన్కు సిద్ధం చేస్తోంది. పళ్ళమధ్య పెట్టవలిసిన గాగ్ని సరిచూసింది. ఆపరేషన్ పరికరాలు స్టెరిలైజ్ చెయ్యబడి సిద్ధంగా ఉన్నాయి.

బ్లడ్సక్ చేసేమిషన్ సిద్ధంగా బెడ్పక్కన ఉంది. ఆపరేషన్ గౌను వేయబడ్డ ఆఅబ్బాయి వంక చూసింది సమీర. ఆరేళ్ళు నిండాయేమో ఎంతో ముద్దొస్తున్నాడు. సమీరను చూడగానే ముఖం విశాలంగా చేసుకొని నవ్వాడు. కల్మషంలేని ఆ నవ్వు సమీర మనసునెంతో మెత్తబడేట్టు చేసింది.

ఈలోగా ఆఅబ్బాయి కళ్ళమీద దూదిఉంచి బ్యాండేజ్ కట్టారు.

ఆ అబ్బాయిని ఆపరేషన్ టేబుల్మీదికి తీసుకొచ్చారు. అనస్థటిస్ట్వచ్చి ఇంజక్షన్ ఇచ్చాడు.

"నీ పేరేమిటమ్మా?"

"ఐయామె బోయ్! నన్ను అమ్మాఅంటావేం."

"ఓ! ఐయామ్సారీ! ఓ.కే! నీ పేరేంటి బాబూ!"

"కిరణ్!"

"నీకు తమ్ముళ్ళు, చెల్లెళ్ళు లేరా?"

"ఊహూ!"

"ఎందుకని?"

"మా మమ్మీని డాడీ వదిలేశారట. అందుకనే మాకెవరూ లేరట."

వింటున్న సమీర మనసు చివుక్కుమంది.

"మీ మమ్మీ పేరేమిటి?"

"లక్ష్మి!"

"గుడ్! చాలామంచి పేరు."

"చాలామంచి మమ్మీ కూడా."

"నీకు మీ మమ్మీ అంటే ఇష్టమా?"

"చా...లా...చాలా!"

"ఏం చేస్తారు మీ మమ్మీ!"

"స్కూ.....ల్లో.....పా....."

— మాట లాగిపోయాయి.

వీన్ ద్వారా కొద్దికొద్దిగా పెంటథాల్‌ని ఇస్తున్న అనస్థటిస్ట్ నెమ్మదిగా సూదిని తీసేశాడు.

"కిరణ్!"

"......"

హౌ ఆర్యూ!?"

".......!"

"స్టాలిన్ ఇంజెక్ట్ చెయ్యమంటారా?"

"ష్యూర్! డూఇట్ క్విక్!"

ఆ ఇంజక్షన్ చేశాక సెలైన్ అమర్చింది సిస్టర్. ఆతర్వాత గొంతుగుండా గొట్టం పోనిచ్చి అది లంగ్స్‌ని చేరుకున్నాక, దాని మరోచివర బాయిల్స్ అపరేటస్‌కు జాగ్రత్తగా అమర్చబడి ఉందో లేదో చూశాడు.

ఆమె ఆపరేషన్ పావుగంటలో ముగించింది. ఆమెచేతులు కదిలేతీరును, ఆ నైపుణ్యాన్ని అనస్థటిస్ట్ అభినందిస్తూ చూశాడు.

నర్సింగ్‌హోమ్‌లో ప్రతి ఒక్కరికీ సమీరపట్ల మంచి అభిప్రాయం ఏర్పడింది. ఆమె నవ్వే ఆత్మీయమైన చిరునవ్వు అందరినీ ఆకర్షించింది. పోస్ట్ గ్రాడ్యుయేట్ అయినా నిగర్వంగా ఉండే ఆమె ప్రవర్తన అంటే అక్కడి నర్సులకు, మిగతా కొలీగ్స్‌కు ఆమంటే ఇష్టం ఏర్పడేలా చేసింది.

సమీర థియేటర్‌లో నుంచి బయటికి రాగానే బెంచిమీద కూచున్న స్త్రీ ఆతృతగా లేచినిల్చుంది. ఆమెముఖం ఆందోళనతో, టెన్షన్‌తో పాలిపోయి ఉంది.

బహుశా పిల్లవాడి తల్లిఅయి ఉంటుందని అనుకుంది సమీర. ఆమెమనను కలచి నట్టయింది.

"ఎలా ఉంది డాక్టర్?"

"ఫరవాలేదమ్మా. అబ్బాయికేం భయంలేదు. మీరేం దిగులు పడకండి."

సమీర ఎంతో ఆప్యాయంగా చెప్పింది.

"ఐస్ తినిపించాలన్నారు." చేతిలో ఐస్ ఉన్న ఫ్లాస్క్ ఉంది.

"మీరు బాబుని సాయంత్రం ఇంటికి తీసుకెళ్ళవచ్చు. ఐస్ తినిపించి విశ్రాంతి తీసుకున్నాక తీసికెళ్ళండి. చీటీమీద సంతకం పెట్టిస్తాను."

"చాలా థాంక్సండీ!"

సమీర కళ్ళల్లో ఎందుకో సన్నటి నీటిపొర కమ్మింది. మౌనంగా తలవంచుకుని ముందుకు నడిచింది.

"మా మమ్మీని డాడీ వదిలేశారట"— బాబు మాటలు గుర్తొచ్చాయి.

నిశ్చింతగా తల్లీతండ్రీ నీడలో నవ్వుతూ, తుళ్ళుతూ ఎదగాల్సిన పసిపిల్లలకి దుస్థితి ఎందుకు కల్పిస్తారో!

మరో అరగంటలో పనిముగించి నర్సింగ్ హోమ్ లోంచి బయటపడింది. ఆయా వెనుకనుంచి గబగబావచ్చి పిలిచింది.

"నీకేందో ఉత్తరమొచ్చినదంట. ఇచ్చి పంపిన్రు."

ఆయాఇచ్చిన ఉత్తరం ఆశగా అందుకుంది. కానీ కవరుమీద వ్రాత అపరిచితమైనది. మధుకర్ చేతివ్రాత తనకు తెలుసు. ఇదిఎవరు రాశారో మరి!

బస్టాప్‌లో నిలబడ్డ రెండునిమిషాలకే రష్ ఎక్కువగాలేని బస్సువచ్చి ఆగింది. కిటికీ పక్కనున్న సింగిల్‌సీటు దొరికింది. టికెట్ తీసుకుని హాండ్‌బ్యాగ్‌లో వేసుకుని, ఉత్తరం చింపింది.

ముత్యాల్లాంటి చేతివ్రాత— కుదురుగా ఉంది. "గౌరవనీయులైన సమీర గారికి,

మీగురించి మావారు చెబితే విన్నాను. నిజాని

కి మీకిలా ఉత్తరం రాయవల్సి వస్తుందనుకోలేదు. కానీ పరిస్థితులు రాయిస్తున్నాయి.

మావారంటే నాకుచాలా ఇష్టం. చాలాప్రేమ కూడా.

ఎప్పుడోఊహ తెలియని వయసులో చదువాపించి మాఅమ్మ పెళ్ళిచేస్తుంటే ఏడ్చినమాట నిజమే!

దానికి మా బంధువులు మావారికి నామీద లేనిపోనివన్నీ కల్పించి చెప్పి నూరి పోశారు.

నాకు వేరేవ్యక్తితో ప్రేమ వ్యవహారాలున్నాయని కూడా చెప్పారట. నిజానికి అలాంటిదేమీ లేదు.

మావారు నాతో ఒక్కమాటకూడా మాట్లాడకుండా, కోపంతో వెళ్ళిపోయి ఎమ్మెస్‌లో చేరారు.

మాఅమ్మ బాధపడ్డా ఆయన చదువు మధ్యలో ఆగకుండా నెలనెలా అవసరానికి మించిన డబ్బుఅయన పేరుమీద బ్యాంక్‌లో జమవడేలా ఏర్పాట్లు చేసిమరీ పోయింది.

పెళ్ళయాక చాలా మారానునేను.

చదువంటే ఉన్నఇష్టం ఆపుకోలేక బి.ఏ. ప్రైవేటుగా కట్టిరాశాను.

ఆయన కోపంపోయి తిరిగి వస్తారుకదా అని ఎంతో ఆశగా ఎదురు చూస్తున్నాను.

తిరిగి వచ్చినపుడు మిమ్మల్ని చేసుకోదల్చానని చెప్పారు. మీరు గొప్పడాక్టర్ అటకదా! మీ ఫొటో చూశాను. మీరు నిజంగా గొప్ప అందగత్తే. అందంలో నేను మీముందు ఎందుకూ పనికిరానని ఒప్పుకుంటున్నాను.

కానీ అలాఅని భార్యను వదిలేయటం సమంజసమేనా?

నాకంటే విద్యాధికులు మీరు.

లోకం నాకంటే మీకే బాగాతెలును కూడా. నేనూ అంతే, ఇంతే అందగత్తేనే, ఆరోగ్యవంతురాలినే, గ్రాడ్యుయేట్‌నే!

పైగా పదిహేను లక్షల ఆస్తిఉంది నాకు.

ఇవన్నీ కాదని మిమ్మల్ని చేసుకుంటా నంటున్నారు మావారు.

పోనీ! చేసుకోనీలే! పెళ్ళికి, కాపురానికి మనసు



కదా ముఖ్యం అనుకుని మీ మధ్యనుంచి తప్పుకుందామనే అనుకున్నాను.

ఇంకా విడాకులు తీసుకోలేదుకదా, నా భార్యేకదా అన్న అహంకారంతో కావచ్చు, తనశారీరక సుఖాలన్నీ నాతో నిస్సంకోచంగా తీర్చుకున్నారు. తీర్చుకుంటున్నారు కూడా.

మొదటిసారి నేను వద్దువద్దని ఎంతో బ్రతిమాలాను. కనీసం కన్యగానైనా ఉంటే నన్నింకెవరైనా వివాహమాడేందుకు ముందు కొస్తారను కున్నాను. కానీ తనకోరికకు నన్ను బలవంతంగా ఆహుతి చేశారు.

పోనీ మిమ్మల్ని మరిచి నాతోనే ఉంటారన్న ఆశతో అడిగినపుడంతా ఆయన కోరిక తీర్చాను. మేమిపుడు అందరు దంపతుల్లా కాపురం చేస్తున్నాము.

కానీ ఆయన మిమ్మల్ని వదలరట. విడాకులివ్వమని సతాయిస్తున్నారు.

విడాకు లివ్వకపోతే మిమ్మల్ని కూడా చేసుకుంటాననీ, నేను కోర్టు కెక్కటానికి వీల్లేకుండా ఋజువులు, ఆధారాలు లేకుండా చేస్తానని అంటున్నారు.

నేనిప్పుడు గర్భవతిని కూడా. నాలుగోనెల నాకిప్పుడు. అబార్షన్ చేయించుకుని, విడాకులిచ్చి వేరే బ్రతుకుదామన్నా వీల్లేదనీ, పెద్ద ప్రాణానికి ముప్పని చెబుతున్నారు మాఊరి డాక్టర్గారు.

ఏం చేస్తారో మీఇష్టం. మీరే ఆలోచించి ఈ సమస్యకు ఓ పరిష్కారం ఆలోచిస్తారని ఆశిస్తాను.

నా భర్తతో నన్నిలా అయినా కలిపే సంస్కారం మీకుందని నానమ్మకం.

ఆయన ఇంతచేసినా ఆయనని ఇంకానేను ప్రేమిస్తూనే ఉన్నాను.

గౌరవాభిమానాలతో- తులసి.

పి.ఎస్. ఆయనకిప్పుడు విడాకులిచ్చినా, లేదా ఆయనే నన్నొదిలేసినా నాకడుపున పుట్టబోయే శిశువుకెవరు తండ్రిగా నిలబడతారు. మేమిద్దరం లోకంలో ఒంటరిగా ఎలా బ్రతకాలి? అమ్మా! నాన్న నిన్నెందుకొదిలేశాడని నా కొడుకు అడిగితే ఏంజవాబు చెప్పను? ఆలోచించండి.

సమీర ఆరాత్రి నిద్రపోకుండా ఆలోచించింది. ఆమరునటి రోజు మధుకర్వచ్చి నర్సింగ్హోమ్లో కలిసేవరకూ కూడా ఆలోచిస్తూనే ఉంది.



"ఇదంతా అబద్ధం! వట్టినాటకం."

"ఏది? నీవల్ల ఆమెతల్లి కాబోతుండటం అబద్ధమా?"

"ఆమె నన్నెంతో ప్రేమిస్తోందనీ, నన్నొదిలి బ్రతకలేననీ రాసిందే— అదంతాఅబద్ధం. ఆస్థి కోసం నన్ను తెలివిగా ట్రాప్చేసింది. సాధ్వారా బిడ్డనికని కాపురం చేస్తేతప్ప ఆస్థి దక్కదని, లేకపోతే అంతా ఆర్ఫనేజ్ కెళ్తుందని తెలిసి, టెలిగ్రామ్ ఇచ్చి పిలిపించి నన్ను ట్రాప్ చేసింది."

మధుకర్ అందించిన వీలునామా కాపీని నిశ్శబ్దంగా చదివి వెనక్కి తిరిగి ఇచ్చేసింది.

"నేను మోసగాడి ననుకోకు సమీరా! తులసి నన్నిట్లా ట్రాప్లోపెట్టి బిగించిందని తెలిసిన క్షణంనుంచి పిచ్చివాడినై పోయాను. నిజంగా నీమీద ప్రేమే లేకపోతే మళ్ళీ వచ్చేవాడిని కాదు. తులసితోనే కాపురంచేసి ఆస్థి అనుభవిస్తూ ఉండేవాడిని. నేను కాముకుడినే అయితే డబ్బు చేతికి వచ్చాక కోరికలు తీర్చుకోవటం మరీ సులభం. కాదంటావా? చెప్పు."

సమీర అతని మాటలు వింటూ మౌనంగా ఉండిపోయింది.

"నాకేమీ తోచక నీ సలహాకోసం సహాయంకోసం వచ్చాను సమీరా. ఆస్తినాకు అవసరంలేదు. నాకు కావల్సింది నువ్వు. మనంపెళ్ళి చేసుకుందాం దాపరికమేమీ వద్దు. అంతగా తులసి కోర్టుకెళ్తే శిక్ష నేననుభవిస్తాను. నాకు పెళ్ళయిందని నీకు తెలియదని చెప్పినువ్వు తప్పుకో. జైలునుంచి వచ్చాక అయినా మనంకలిసి

ఉండొచ్చుకదా.''

సమీర కళ్ళల్లోనీళ్ళు పొంగి వచ్చాయి. అతని తపన, ప్రేమ, ఆరాటం అర్థమవుతున్నాయా మెకు.

''పోనీ మనంపెళ్ళి చేసుకుందాం. కానీ ఋజువులు, సాక్ష్యాలూ లేకుండా చేసి కాపురం చేద్దాం. రెండేళ్ళు తులసికి దూరంగాఉండి కోర్టుద్వారా జుడీషియల్ సపరేషన్‌కు ప్రయత్నిస్తాను. నీకదీ ఇష్టంలేకపోతే జ్యుడిషియల్ సపరేషన్ సాధించాకే మనం వివాహం చేసుకుందాం. కాకపోతే తులసిని నేనే పోషించే బాధ్యత స్వీకరించాలి, ఆమెఅన్న బాధ్యతతెలీని మనిషి కాబట్టి.''

''మరి తులసికి పుట్టే బిడ్డగతి?''

''మనమే పెంచుదాం.''

''మరి ఆ అమ్మాయి ఏఆశతో బ్రతుకుతుందిక.''

''అది ఆస్థికోసం చేతులారా చేసుకున్నపని. తనే ఆలోచించుకుంటుంది.''

''ఆమెను అనుభవించిన క్షణంలో ఈవిషయం గుర్తురాలేదా? పోనీ ఆమెనిన్ను ఓబిడ్డనిమ్మని కోరిందే అనుకుందాం. మరి ఆవిషయం నాతో చర్చించాలన్న ఉద్దేశం నీకుకలగనట్టే కదా? నన్ను చేసుకున్నాక మరేయువతి అయినా తనను తల్లిని చేయమని కోరితే సరేనంటావా?''

''యుఆర్ టాకింగ్ టూమచ్!''

''హౌయూ బిహేవ్డ్ ఈజ్ టూమచ్!''

మధుకర్ పిచ్చివాడిలా చూస్తూకూచున్నాడు.

''నా ఇప్పటి పరిస్థితికి నిన్ను తప్పుపట్టను. ఎందుకంటే నా బాధ్యతలేనితనం అది. పూర్తిగా ఆలోచిస్తే అదికూడా కాదు. నువ్వుచాలా సిన్సియర్ అనిఅర్థం అయింది నావిషయంలో అది నిజం కూడా. అందుకే తొందరపడ్డాను. ఇక జరగాల్సిందేమీ లేదు. నాబ్రతుకేదో నేను బ్రతుకుతాను. ఎలాబ్రతుకుతాను? ఏమవుతానన్నది నీకనవసరం. కనీసం ఇకముందైనా నా జీవితంలో ప్రవేశించి అల్లకల్లోలం చేయకపోతే అదే పెద్ద అదృష్టం. వెళ్ళి నీ బ్రతుకు నువ్వు బ్రతుకు. నీబిడ్డను తండ్రినీడ తెలియని అనాథశిశువులా పెరగనివ్వకు. వెళ్ళిపో.''

''నేను నిన్ను ప్రేమించినంతగా నువ్వునన్ను ప్రేమించలేదు. అందుకే త్వరగా వదిలించుకుంటున్నావు.''

సమీర తీవ్రంగా చూసింది.

''వెళ్తాను, నాకీశిక్ష పడాల్సిందే! క్షణికావేశానికి లోనై పశువులా ప్రవర్తించి నాచేజేతులా నేనే నిన్ను దూరం చేసుకున్నాను. నిన్ను..... శాశ్వతంగా పోగొట్టు కుంటున్నాను.''

సమీర జవాబేమీ ఇవ్వకుండా వెళ్ళేందుకు బ్యాగ్ తీసుకుని లేచి నిల్చుంది.

''వెళ్తున్నావు కదూ! నేచేసిన చిన్నతప్పుకు నువ్వెంత శిక్ష వేస్తున్నావో నీకుతెలీదు. ఇంకోస్త్రీని ముట్టుకున్నందుకేగా! నేనూ ఈరోజు శపథం చేస్తున్నాను. నాకే శిక్ష విధించుకుంటున్నాను. మరణించేదాకా నేనింకే స్త్రీ శరీరాన్నీ తాకను. తులసిని వదిలేయను. ఒకేకప్పు కిందే ఉంటాను కానీ తులసి ఎన్నటికీ నాకు భార్యకాలేదు.''

పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకునేందుకు ప్రయత్నిస్తూ, వడివడిగా నడుస్తూ పార్కు గేటుదాటి బయటికి వచ్చింది.

చీకట్లు ముసురుకుంటుండటంతో ఎవరూ ఆమెకన్నీళ్ళు గమనించలేదు.

దగ్గర్లో ఆగిఉన్న ఆటోఎక్కింది.

మధుకర్ వచ్చేసరికే ఆటో వెళ్ళిపోయింది.

● ● ●

బస్‌దిగి నడిచి నెంబర్ వెదుక్కుంటూ వెళ్లింది సమీర. నంబర్ సరిచూసుకుని ఓఇంటి కాలింగ్‌బెల్ నొక్కింది.

తలుపు తీసిన గౌతమి అనుకోకుండా సమీర ఎదురుగా కనిపించేసరికి ఆనందం ఆపుకోలేక కౌగలించుకున్నంత పని చేసింది.

''రావె! నువ్విక్కడే ఉన్నావనీ, కలవమనీ రాధిక రాసింది. తను కెనడాకు వెళ్ళిపోయింది కదా? ఎలాఉన్నావు? విశేషాలేమిటి?''

''ఏమున్నాయి విశేషాలు! మామూలుగా ఉంది జీవితం!''

''అదేమిటంత డల్‌గా ఉన్నావు. నువ్వే నయం. మీరంతా హాయిగా పి.జి. చేశారు. నేను చూడు. అంతటితో చదువాపేసి ఓక్లినిక్ ఓపెన్ చేసుకుని కునికిపాట్లు పడుతున్నాను.''

''ఏదో ఒకటి. ఒకరికింద పనిచేయకుండా

స్వంతంగా బ్రతుకుతున్నావు గదా! మీ వారేరీ?''

''ఇప్పుడేరారు. క్లబ్బుకెళ్ళి ఏ ఎనిమిదింటికో వస్తారు. జీవితంమరీ మెకానికల్ అయిపోయిందే!''

''పిల్లలా?''

''ఉన్నా కనీసం కాస్త కాలక్షేపమయేది!''

''నువ్విక్కడున్నట్టు నాకూ రాధికే చెప్పింది. వద్దామంటే ఏరోజుకారోజు తీరిక లేకుండా పోయింది.''

''సింధియా నర్సింగ్‌హోమ్ చాలాపెద్దదే! జీతం కూడా బాగానే ఉంటుందనుకుంటాను.''

''మిగతావాటికన్నా ఎక్కువేలే! అయితే దానికి తగ్గట్టు పనికూడా ఉంది. పని ఎక్కువున్నందుకు నేనేం బాధపడటంలేదు. అన్నిరకాల కేసులూ ట్రీట్ చేయటంతో మంచి అనుభవం వస్తుంది గదా.''

''ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టకూడదూ?''

''అందుకు ధైర్యమూలేదు. తీరికాలేదు డబ్బు కూడాలేదు.''

''మీకేదో ఆస్తి ఉందనుకుంటాను. మీ అన్నయ్యా నువ్వూ ఇద్దరేగా? ఆమాత్రం నీకోసం ఖర్చుపెట్టరా?''

''అతనికి ఇద్దరు ఆడపిల్లలున్నారు. పోనిద్దూ.''

''నువ్వేమీ మారలేదే! అదేరకమైన మాటలు! సర్దుకుపోయే స్వభావం నీది.''

''జీన్స్‌తో పాటు సంక్రమించే కొన్ని గుణాలు అంతతొందరగా మారవు.''

''సరే! ఏం తీసుకుంటావ్? కాస్తటిఫిన్ చేసుకుందామా? నీకుబాగా ప్రైచేసిన దోసె ఇష్టంకదూ! ఫ్రిజ్‌లో కాస్తపిండి ఉంది. వేసిపెట్టాను పద. మాఇల్లు చూస్తూఉండు. నేనీలోగా దోసెవేస్తాను.''

''ఇప్పుడా హైరానా ఎందుకులే గౌతమీ!''

''భలేదానివే! ఫ్రెండ్‌కోసం దోసె వేసిచ్చే పాటిశ్రమ కూడా పడలేనంటావ్! అయితే రేపొద్దున నేను నీదగ్గరికొస్తే 'ఎందుకులే హైరానా' అనుకుంటావ్. అవునా!''

''నీతోనూ, రాధితోనూ నేను వాదించలేను.''

''అలా ఒప్పుకుని కామ్‌గా కూచో.''

''ఇల్లు స్వంతమేనా?''

''ఆఁ! ఆయన బ్యాంక్ ఆఫీసర్‌కదా! లోన్ తీసుకున్నారు. మాబావగారు కాస్త క్యాష్‌కూడా ఇచ్చారు పొలం రాయించుకుని.''

''త్రీ బెడ్‌రూమ్స్ మీ ఇద్దరికీ ఎక్కువేకదూ.''

''ఎక్కువే! కానీ ఆయన తరపు వాళ్ళంతా బాగా స్టేటస్ మెయింటైన్ చేస్తారు. అందుకే ఇల్లుఅద్దె కివ్వటం ఇష్టంలేదు. లేకపోతే అటుపక్కనున్న చిన్న వరండా అటాచ్డ్ బాత్‌ఉన్న బెడ్‌రూమ్ ఇద్దామన్నాను నేను. ఎవరైనా వర్కింగ్ లేడీస్ ఉంటారుకదా! వారికిస్తే సరిపోతుందని! ఆయన ఒప్పుకోలేదు దానికి.''

''అదృష్టవంతురాలివే! ఉండటానికో స్వంతకప్పు ఉండటం అన్నిటికన్నా ముఖ్యం ఈరోజుల్లో.''

''నీకూ మంచి ఉద్యోగం వచ్చాక ఇల్లు కట్టుకుందువులే. అవునూ కువైట్ వెళ్ళాలని మా డాక్టర్ కజిన్ అప్లై చేస్తున్నాడు. నువ్వు కూడా చేయరాదూ?''

''చూద్దాం! దేశం విడిచి వెళ్ళాలంటే ఎలాగో ఉంది.''

''ఇంకో వారమేటైమ్ ఉంది. త్వరగా ఆలోచించుకో.''

''నాకు ముస్లిమ్ కంట్రీస్ అంటే భయమే!''

''పోనీ రాధికకైనా రాయరాదూ? అక్కడే ఏదైనా జాబ్ చూడమని.''

''మనం రాయనవసరం లేదు. వెళ్ళేముందే తనునాకు పాస్‌పోర్ట్ సంపాదించి పెట్టింది. ఇప్పుడు నాకు ఉద్యోగం వెతికే పనిలోనే ఉన్నానని రాసింది.''

''మీ ఇద్దరూ పి.జి. చేస్తూ కలుసుకున్నారు. మళ్ళీ ఇప్పుడు కెనడాలోకూడా కలిసి ఉంటారన్నమాట.''

''ఎవరు ఎవరితో కలిసిఉన్నా ఏంలాభం? నీకు మీఆయన, తనకి వాళ్ళాయన తోడున్నారు కదా. నేనెంత కాలం తోడుంటానని!''

గౌతమి దిగులుగా, విచారంగా చూసింది.

డైనింగ్ టేబుల్ ముందు కూచుని కామ్‌గా దోసె తినటం మొదలెట్టింది సమీర. గౌతమి

కూడా తనప్లేట్ తెచ్చుకుని కూచుంది.

"నువ్వు పెళ్ళి గురించిన ఆలోచన మానేసిన ట్టేనా ఇక?"

"అయితే రాధిక వెళ్ళేముందు నీతో ఏం చెప్పలేదన్నమాట."

"ఊహూ! ఏమిటి? ఏమైంది?"

"ఆ ప్రకరణం కూడా ముగిసింది."

"అలా పొడిపొడిగా చెబితే ఎలా?"

"నన్ను దోసె తిననివ్వవా?"

"సరేతిను. పచ్చడి ఇంకాస్త వేయనా?"

"పచ్చడి కారంగా, ఘాటుగా బాగుంది."

"తిను. కారం తిని, తిని అల్సర్ తెచ్చుకుంటా వేమో, కాస్త గమనించుకో. పెరుగు కానీ నెయ్యి కానీ తినవు మళ్ళీ."

"ఇప్పుడు పెరుగు తింటున్నా."

"సంతోషం. అయితే ఐస్‌వేసి చల్లటి మజ్జిగ ఇస్తాను తాగు. ఈ ఎండలకు మంచిది."

"ఆవకాయ వెయ్యికాస్త."

"ఆబుద్ధి ఇక మారదు. హాస్టల్లో ఉండగా నా పచ్చళ్లన్నీ తినేసేవాళ్ళు మీఇద్దరూ. ఏపచ్చడి కలుపుకున్నా మీరే గుర్తొస్తుంటారిప్పటికీ."

"అయితే మంచిదే! అలా అయినా గు ర్తుంటాం."

"నిజమే సమీ! ఎంత సంతోషంగా గడిచాయో హాస్టల్‌రోజులు. జీవితంలో గోల్డెన్ పీరియడ్ అదే."

'మీఆయన వింటే విడాకులిస్తాడేమో!"

"ఆ మొద్దవతారానికంత సున్నితత్వం కూడానా."

"అదృష్టవంతురాలివి. సంతోషించక ఏడు స్తావేం మరి?"

"అప్పటి సందడిలేదే జీవితంలో."

"అబద్ధాలాడకు. నీ చిరునవ్వే చెబ్తుంది ను వ్వు సంతోషంగా ఉన్నానని."

"పోదూ! పెద్ద డాక్టర్‌నవ్వాలనుకున్నాను. రీసెర్చిలు కూడా చేద్దామను కున్నాను."

"సంసారంలో చేసుకోవోయ్ రీసెర్చిలు."

"మూడేళ్ళుగా చేస్తున్నదదే! కానీ ఫలితమే కనిపించ లేదింతవరకూ."

గౌతమి అన్నతీరుకు ఫకాల్మనవ్వింది సమీర.

అంత తృప్తిగా నవ్వటం రాధిక వెళ్ళాక అదే మొదటిసారి అనుకుంది.

"నేనోపని మీద వచ్చానే!"

"ఏమిటి? చెప్పుత్వరగా!"

"నన్నోసారి పరీక్షించాలి."

"ఏమైంది నీ ఆరోగ్యానికి?" కంగారు పడింది.

"ప్రకృతి తనధర్మం నెరవేరుస్తుందని— అనుమానంగా ఉంది."

"నువ్వనేదేమిటి?"

"ఎలా అయిందీ, ఏమైందీ తర్వాత చెబుతా ను. ముందు నాఅనుమానం నిజమా? అబద్ధమా చెప్పు."

"క్లినిక్‌లోకి వెళ్దాంపద."

పదిహేను నిమిషాల తర్వాత గ్లౌజ్ తీసేసి చేతులు కడుక్కుని నేప్‌కిన్‌తో తుడుచుకుంటూ వచ్చింది.

"నాలుగో నెల అని నా అనుమానం. అయినా ఫీటస్ అంతగా ఎదిగినట్టుగా లేదు. నీ పొట్టకూ డా ఎక్కువ పెరగలేదు. డాక్టర్‌వై ఉండీ అను మానం రాలేదా?"

'సింప్టమ్స్ స్పష్టంగా కనిపించలేదు. నిద్ర కాస్త ఎక్కువ కావటంతప్ప."

"పిరియడ్స్?"

"కాస్త అవటంతో— ఎనీమిక్‌గా అవుతు న్నందుకిలా అనుకున్నాను."

"వేవిళ్ళేమీ లేవా?"

"ఊహూ!"

కాసేపు మౌనంగా కూర్చుని అడిగింది హఠా త్తుగా.

"ఎవరతను?"

"మధుకర్ అని. ఎమ్మెస్. చేస్తుండేవాడు."

బాధలకూ ఓ అవుట్‌లెట్ ఉండాలి. అందులో ఇలాంటి వాటికి ముఖ్యంగా.

రాధిక వెళ్ళటంతో ఆమెకు మనసువిప్పి చె ప్పుకునే మనుమలే కరువయ్యారు.

కానీ రాధికవెళ్తూ, వెళ్తూ గౌతమికూడా హైద్రా

బాదు లోనేఉందనీ, ఏడాదికిందటే ట్రాన్స్‌ఫర్ మీద వచ్చారనీ, వెళ్ళి కలవమనీ అడ్రెస్ ఇచ్చి వెళ్ళింది.

అన్ని రోజులుగా దాచుకున్న బాధ బయటికి వచ్చింది.

గౌతమితో అన్ని విషయాలూ చెప్పింది.

"మరి నువ్వు కూడా..... కష్టమేకదా ఈ స్థితిలో ఒంటరిగా. అయినా అతనంతటి ప్రేమతో నిన్ను స్వీకరించాలనుకుంటే, వదులుకోవటం మూర్ఖత్వమేమో! మనిషికి ఓతోడు అవసరం చాలా ఉంది జీవితంలో."

"అతని ద్వారా ఆ అమ్మాయి తల్లి కాబోతోందన్న విషయమే నన్ను కృంగదీస్తూంది."

"తల్లే కూతురి గురించి అంత భయపడిందంటే ఆ అమ్మాయిదెంత విపరీత మనస్తత్వమై ఉంటుందో ఆలోచించు. అన్ని రోజులుగా లేనిది విల్లు గురించి తెలిశాకే అతన్ని రప్పించి, అన్ని మాటలు చెప్పిట్రాప్ చేసిందంటే అర్థమవుతోంది ఆమె తెలివితేటలు. అత నేతప్పనిసరి పరిస్థితుల్లో అలా చేశాడేనన్న ఆలోచన కూడా తోచలేదా? పోనీ మనిషి మంచివాడు కాకపోతే ఆస్తితెచ్చే ఆ అమ్మాయిని కాదని నీదగ్గరికి పరిగెత్తుకు వచ్చే అవసరం ఏముంది? ఎంత ఆలోచించినా అతను కావాలని చేసినపెద్ద అపరాధం ఏమిటో నాకు తెలియటం లేదు."

"ఏమో! నేనలా సరిపెట్టుకోలేక పోయాను. అతనెందుకంత త్వరపడాలి ఆమె విషయంలో."

"తనకారణం అతడు చెబుతూనే ఉన్నాడు."

"నిజంగా ప్రేమించేవాడైతే అలా వెళ్ళ గలడా?"

"ప్రేమించని వాడైతే ఎందుకొస్తాడే నీకోసం?"

"ఆమెకు పుట్టే బిడ్డనేం చేయాలి?"

"ఏం? పెంపుడు తల్లివై పెంచలేవా? ఆ అమ్మాయిని ఇంకా చదివించి ఏ ఉద్యోగంలోనో స్థిరపడేట్టు చేస్తే, తనమంచి, చెడు తనే చూసుకుంటుంది."

"..........."

"సరే! మరి ఇప్పుడేం చేస్తావ్?"

"ఆలోచించుకోవాలిక."

"ఏదైనా మించి పోకముందే చూసుకో."

సమీర ఏమీ అనలేదు.

"అబార్షన్ చేయించుకో. ఇక ఆలోచించేదేముంది? ఎన్నో ఆలోచిస్తాం. కానీ విధి ఎట్లా రాసిపెట్టుంటే అలా జరుగుతుంది."

సమీర కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

గౌతమి చూస్తూ నిర్లిప్తంగా కూచుండి పోయింది.

చివరికి నెమ్మదిగా అంది— "నాక్లినిక్‌లో అబార్షన్ చేసేందుకు పెద్దగా వసతులు లేవు. లేకపోతే నేనే మానేజ్ చేసేదాన్ని. నాకుతెలిసిన లేడీ డాక్టర్ ఒకామె రామచంద్రాపురంలో ప్రాక్టీస్ పెట్టుకుంది. నువ్వు సరేనంటే అక్కడికెళ్దాం. ఎవరికీ తెలియకముందే అయితే మంచిది."

సమీర మౌనంగా తలవూపింది.

"నేను ఫోన్‌చేసి మాట్లాడి డేట్‌ఫిక్స్ చేస్తాను. ఎప్పుడనేదీ మీ నర్సింగ్‌హోమ్‌కు ఫోన్‌చేసి చెప్తాను. నేనే మీఇంటికొచ్చి ఫ్రెండ్ పెళ్ళని తీసికెళ్తాను. నీ ఫోన్‌నెంబర్, ఇంటి అడ్రెస్ ఇచ్చివెళ్ళు."

సమీర మౌనంగా కాగితం, కలం అందుకుంది. రాస్తుంటే ఆమెచేతులు వణికేయి.

అన్నమాట ప్రకారం రామచంద్రాపురంకు తీసుకెళ్ళింది గౌతమి. ఆమె క్లినిక్ అంటే చిన్నదేమోననుకుంది. కానీ చిన్న నర్సింగ్‌హోమ్‌లా ఉందనుకున్నది సమీర.

అబార్షన్ చేయించుకోవాలని సాధారణంగా ఏ స్త్రీకీ ఉండదేమో! సమీర కూడా అలాంటి మిశ్రిత భావాలతోనే తబిబ్బాయింది ముందు.

సమీరను ఆ డాక్టర్‌కు పరిచయం చేసింది గౌతమి.

టూకీగా వివరాలు చెప్పింది.

"వెళ్ళి పోవచ్చు కదమ్మా అతనిదగ్గరికి?"

"నాకెందుకో ఇష్టం లేదండీ అలా. వెళ్తే అతని మీద ప్రేమతో వెళ్ళాలి. కానీ అత్యున్నతమైన చోట దెబ్బతింది నా మనసు. ఇక అతన్ని కలవటం జరగదు."

"నీకు ఇంట్రెస్ట్ ఉంటే బిడ్డను కనొచ్చు. ధైర్యంగా పెంచుకోవచ్చు. ఇండియాలో అది సాధ్యం కాకపోతే ఫారిన్‌కెళ్ళొచ్చు. మెడిసిన్‌లో పి.జి. చేశావు. మెరిట్ స్టూడెంట్‌వి. ఆలోచించు



కుంబానంటే ప్రైమ్ ఇస్తాను. ఎల్.ఎమ్.పి. చెప్పు!"

సమీర మాట్లాడలేదు. " పెద్దగా కంగారు పడేదేంలేదు. ఇంకా త్రీవీక్స్ ఆగవచ్చు అబార్షన్‌కు. నెమ్మదిగా ఆలోచించుకో " అంది గౌతమి.

సమీర మౌనంగానే ఉంది.

" కష్టంలెండి డాక్టర్. మీకు ఆమె గురించి, ఆమె బంధువుల గురించి తెలీదు. నా ఉద్దేశంలో అబార్షన్ చేయటమే మంచిది. మీ దగ్గరికి ఒక్క పూట కోసం వచ్చేందుకు కూడా వాళ్ళ వాళ్ళను కన్విన్స్ చేసి తీసుకురావల్సి వచ్చింది. "

" ఆ అమ్మాయి ఇష్టం. వేయమంటే చేస్తాను."

గౌతమి సమీర వంక చూసింది.

" మళ్ళీ వద్దాం. ఈసారి నేనొక్కదాన్నే వస్తాను." అంది సమీర.

" నీ ఇష్టం. కానీ బాగా ఆలోచించు. "

ఇద్దరూ లేచి డాక్టర్‌కు థాంక్స్ చెప్పి ఫీజ్ ఇవ్వ బోయారు. కానీ ఆవిడ తీసుకోలేదు.

• • •

ఈ మధ్య నర్సింగ్‌హోమ్‌లో పిల్లలే ఎక్కువగా అడ్మిట్ అవుతున్నారు. అదేం విచిత్రమో లేబర్ కేసులు కూడా ఎక్కువయ్యాయి.

పడ్డ బాధనంతా ప్రస్తి [illegible] చూసు కుని మరచిపోతున్న తల్లులు, వారికి ఆప్యాయంగా స్తన్యం పట్టే తల్లులనూ చూస్తుంటే,

ఆమె హృదయం దిగులుతో బరువెక్కేది.

అలాగే ఏడాది, మూడేళ్ళలోపు పిల్లలు జ్వరాలతో జబ్బులతో నర్సింగ్‌హోమ్‌లో చేరితే తన స్వంత పిల్లాడే బాధపడుతున్నట్టుగా తోచేది.

మెనింజైటిస్, లివర్, జ్వరం, నిమోనియా, డయేరియా- పసిపిల్లలను భయంకరంగా బాధించేవి.

పిల్లలకు సెలైన్ ఎక్కించాల్సి వస్తే సమీర చాలా బాధపడేది. వారివి లేత కాళ్ళు. వెయిన్ దొరకటం కష్టం. కాలిదగ్గర చర్మం కోసి, రక్తనాళాన్ని పట్టుకొని అందులో పాలిథిన్ ట్యూబ్ పోనిచ్చి దాని ద్వారా సెలైన్ ఎక్కించాలి. ఓపెన్ మెథడ్!

ఒక మూడేళ్ళ అబ్బాయికి లివర్ బయాప్సీ చేయటంవల్ల లివర్ దెబ్బ తిని ఇంచుమించు కోమా స్టేజిలోకి వెళ్ళిపోయాడు. మిస్టర్ సింథియా అవుటాఫ్ స్టేషన్. మిసెస్ సింథియా తలనొప్పి జ్వరంతో ఇంటి దగ్గరే ఉన్నారు.

ఆ అబ్బాయి స్థితి చూసి సమీరకు కాళ్ళు, చేతులు చల్లబడ్డాయి. సింథియా లేనప్పుడిలాంటిది- అదీ తన వల్ల జరిగిందని తెలిస్తే నర్సింగ్‌హోమ్ కెంతో చెడ్డ పేరు వస్తుంది.

ఆ అబ్బాయి తల్లి సమీర చేతులు పట్టుకుని ఒకటే ఏడుపు- భర్త చనిపోతే వీడ్ని చూసుకుని బ్రతుకుతున్నానంటూ.

సమీర మనసు నీరైపోయింది.

కార్డినోస్ కోసం సిస్టర్‌ను పంపితే లేదని వెనక్కి వచ్చింది. చుట్టు పక్కల ఒకటి, రెండు మెడికల్ షాపులున్నాయి కానీ ఆవిడ ఏడుస్తూ కూలబడిపోయింది.

ఆయాను బ్రతిమాలుకుని డెకడ్రాన్ ఇంజక్షన్ తెమ్మని పంపించింది డబ్బులిచ్చి. ఈ లోగా సిస్టర్ సహాయంతో గ్లూకోజ్ పెట్టింది.

ఆయా ఇంజక్షన్ తేగానే గబగబా ఓ డోసు ఇచ్చింది. ఆ తర్వాత ప్రతి నాలుగు గంటలకూ ఓ డోస్ ఇస్తూ డ్యూటీఅవర్స్ అయిపోయినా ఉండి పోయింది. చీకటి పడుతుండగా పిల్లాడు కాస్త కోలుకున్నాడు.

తరువాత ఆ కేసు కరుణకిచ్చి ఇంటికి వెళ్దామంటే ఆ పిల్లాడి తల్లి ఒకటే ఏడుపు తన చేతులు పట్టుకుని వదలలేక ప్రతి గంటకూ పరిస్థితి గమనిస్తూ ఉండి పోయింది. తెలతెలవారుతుండగా అబ్బాయి పరిస్థితి పూర్తిగా మెరుగు పడింది.

గబగబా ఇంటికెళ్ళి స్నానం చేసి మళ్ళీ బయలు దేరింది.

" ఏదైనా అంటే హాస్పిటల్ సాకు దొరికింది. రాత్రంతా డ్యూటీ అయినా రాలేదంటే ఏమనుకోవాలి. అవతారం చూస్తుంటే అనుమానం నిజమనిపిస్తుంది. ఆడపిల్లలున్న ఇంట్లో ఇలాంటి పనులు. అన్నగారికేమో చెల్లెలిమీద ప్రేమ. మేనత్త ఇలాంటి దంటే నాపిల్లల్ని ఎవరైనా చేసుకుంటారా? "

వదిన గారి గొణుగుడు మామూలే! కానీ బాధల్లో ఉన్న వ్యక్తులకు ఏ కాస్త ఒత్తిడి కలిగినా వర్షించే మేఘంలా ఉంటుంది మనస్థితి. కళ్ళల్లో నీళ్ళు కళ్ళల్లోనే ఇంకింప చేసుకుంది.

వెళ్ళేసరికి మరో జంట ఎనిమిది నెలల పిల్లాడిని తీసుకొచ్చారు, డయేరియా!

తీసుకెళ్ళి సెలైన్ పెట్టింది సిస్టర్ సహాయంతో. సెలైన్ ఇచ్చే సమయంలో కాలు కదపకుండా పట్టుకోవాలి. కదిపితే సూది బయటకు వచ్చేస్తుంది వెయిన్‌లోంచి. ఆ తల్లేమో పసిబిడ్డ కాలు పట్టుకుని నిలబడేందుకు కూడా ఏడుస్తోంది హృదయ విదారకంగా. చివరికి ఆమె భర్త నిలబడ్డాడు.

సమీర రెండు మూడుసార్లు గట్టిగా చెప్పింది- అయిదారు గంటల్లోనే పిల్లాడు కోలుకుని చక్కగా నవ్వుతాడని. దాంతో కాస్త గుండెదిటవు చేసుకుని కూచుంది తల్లి!

ఇలాంటి సంఘటనలు చూసి, చూసి సమీర మనసు రోజురోజుకీ బలహీన పడసాగింది.

పొట్టలో అమాయకంగా, ధైర్యంగా, నిశ్చింతగా ప్రాణం పోసుకుంటున్న పిండానికి తెలుస్తుందా- తల్లి ఆ రూపు తెలియని బిడ్డను ప్రాణం పోసుకోకుండా కత్తితో ఛేదించేందుకు అనుమతి ఇస్తుందని!

గౌతమి మాత్రం ఖచ్చితంగా చెప్పింది-

పుట్టాక తండ్రికోసం ఆ శిశువు పడే బాధను తీర్చగలవా? ఇప్పుడున్న బలహీనస్థితిలో తండ్రి లేని లోటు తెలియకుండా పెంచగలనంటావు. కానీ ఈత మొదలు పెట్టే ముందున్న బలం, నీటిలో దిగాక ఉండదనిపిస్తుంది.

" నాకింతవరకూ మాతృత్వం ఏమిటో, తల్లి కాబోయే స్త్రీ మనో భావాలెలాంటివో తెలీదు నిజమే!"

" కానీ తండ్రిలేని పిల్లలు అనుభవించే నరకం ఎలాంటిదో నాకు తెలుసు- ఎందుకంటే ఊహ తెలీని వయసులోనే భర్తను పోగొట్టుకుని అన్నగారి పంచన చేరిన తల్లికి నేను బిడ్డను కాబట్టి. మామయ్య కూతుర్లతో పోల్చుకుని నేనెంతో బాధ పడ్డాను. నీ ఇష్టం. చివరి నిర్ణయం నీదే. కానీ ఎలాంటి స్థితిలో కూడా నీకు ఏ సహాయమైనా చేసేందుకు నేను సిద్ధమేనని మరచిపోకు.

" పోనీ! పుట్టే బిడ్డను నాకిచ్చేస్తావా చెప్పు దత్తు తీసుకుంటాను. "

చీర కుచ్చిళ్ళు లాగినట్టయి ఉలికిపడి చూసింది. టేబుల్ కిందికి వంగి చూస్తే ఏడాది పసిబిడ్డ! ఫారెక్స్ బేబీలా, ఉంగరాల జుట్టుతో అమాయకమైన కళ్ళతో నవ్వుతున్నాడు.

వంగి అందుకుని ఎత్తుకుంది.

ఆ బాబు వళ్ళు దూదిలా మెత్తగా ఉంది. అటు- ఇటు చూసింది ఎవరి బాబో అని. ఎవరూ కనిపించలేదు.

ఈ లోగా ఆ పసివాడు సమీర ముక్కు గిల్లాడు. చెవులు పరీక్షించాడు. నోట్లో వేలు పెట్టబోయాడు. చివరికి మెడలోని గొలుసు లాగిదాన్ని పరీక్షించాడు.

సమీరకు ఆ బాబును చూస్తుంటే తనకూ అలాంటి బాబు కావాలన్పించింది.

ఇంతలో ఆయా అటువైపు వచ్చింది.

" ఎవరి బాబో చూడమ్మా. దేగాడుతూ వచ్చేశాడు. "

" ఆ కొత్తగా వచ్చిన క్రిస్టియన్ల బాబమ్మా. వాళ్ళాయనకు రేపు కిడ్నీ ఆపరేషనంట. నీదగ్గరికే వచ్చాడు నయమే. మెట్లవైపు వెళ్తే పడిపోతుండె. ఏమయ్యా! అమ్మకాడ బాగాలేదా? మా సమీరమ్మ బాగుందా? " అంటూ ఎత్తుకుని వెళ్ళింది.

" ఏం డాక్టర్! కార్డినోస్ స్టోర్ రూమ్‌లో అయిపోయిందంటున్నారు. ఓ కుర్రాడికి న్యూమోనియా వస్తే టెట్రామైసిన్ ఇచ్చాను. కార్డినోస్ కూడా ఉంటే మంచిది. ఈ మధ్య నర్సింగ్‌హోమ్ విషయాలు పట్టించుకోవటం లేదు సింధియా. ఇలా అయితే వచ్చిన మంచి పేరంతా పోతుంది. " అన్నాడు రాజన్ వస్తూనే.

" వాళ్ళకు ఏవో ప్రాబ్లమ్స్ ఉన్నట్టుంది. "

ప్రాబ్లమ్స్ లేని వాళ్ళెవరు డాక్టర్ లోకంలో!

దేనిదారి దానిదే అనుకుని తీసేసుకుని తిరగాలి. నేను సంతోషంగా ఏ సమస్యాలేకుండా ఉన్నాను అనే మనిషిని ఒక్కరిని చూపించండి " అన్నాడు రాజన్.

సమీర చిరునవ్వుతో కళ్ళు దించేసుకుంది.

" మీరు కూడా ఈ మధ్య డల్‌గా అయ్యారు. చాలా అసహనంగా కన్పిస్తున్నారు. ఎనీ ప్రాబ్లమ్ డాక్టర్? కెన్ ఐ హెల్ప్ యూ ఇన్ ఎనీ వే! "

రాజన్ ఎంతో అభిమానంగా అడిగాడు.

సమీర కళ్ళల్లో తిరగబోతున్న నీటిని బలవంతంగా నిగ్రహించుకుని లేని నవ్వొకటి నవ్వింది.

" నో! థాంక్స్! "

" మీరేం అనుకోకండి ఇలా చెబుతున్నానని! మీరు ఉడ్‌బీ మదర్ అని సిస్టర్లు, కొలీగ్స్ చెవులు కొరుక్కుంటున్నారు....ఇంకా చెప్పాలంటే సింధియా గురించి, మీగురించి అనుకుంటున్నారు. అందుకే మీకు సడన్‌గా మూడొందలు పెంచారని, అందుకే వారి మధ్య తరుచు గొడవలవుతున్నాయని. "

సమీర దెబ్బ తిన్నట్టుగా చూసింది.

ఆమె ఎ తీవ్రంగా గాయపడ్డదో గ్రహించాడు రాజన్. ఆమె ముఖం పాలిపోయింది. వెంటనే పెదవి బిగపట్టింది.

"మీరేం బాధపడకండి. ఇదొక మహారణ్యం. ఇందులో లేడిని వేటాడే క్రూర జంతువులే ఎక్కువ. వాళ్ళు నింద వేసి హింసించటానికి ముందు మీరే వారిని నిందించేందుకు సిద్ధంగా ఉండాలి. అలాంటి కచడా పద్ధతే మంచిది. మీలా మెతకగా ఉంటే రేపటినుంచి ఆయా కూడా అంటుంది మీ ఎదుటే. అసలిదంతా మీ ఇంపార్టెన్స్ భరించలేని సీనియర్ కొలీగ్స్ సృష్టించిన రూమర్ అనుకుంటున్నా. "

ఆ తర్వాత సమీర ముభావంగానే డ్యూటీ చేసి బయట పడింది.

• • •

సమీరకు చూస్తుండగానే నాలుగు నిండి అయిదో నెల వచ్చింది.

ఇంట్లో ఆమెగురించి అన్న గారికి కూడా తెలిసింది. ఆమె నేమీ అనలేక, ఆమెను హింసించే భార్యనూ ఏమీ అనలేక మౌనంగా కుమిలిపోతున్నాడు.

నోరు మెదపకుండా మూగగా పళ్ళు బిగువున భరించసాగింది సమీర.

మధుకర్‌ను తన జీవితం నుంచి పంపివేసినా అతన్ని తన మనసులోంచి పంపేయలేక పోయింది. భార్యతో అతనెలాంటి అనుభవం పంచుకున్నాడో ఆమెకు తెలీదు. కానీ అతనితో తను పంచుకున్న అనుభవం కేవలం శరీరాలదే కాదు- ఆత్మలది కూడా అన్నంత మధురమైన అనుభూతిని మిగిల్చింది.

బిడ్డ కలిగాక పెంచలేని పరిస్థితులే వస్తే అతనికే అప్పగించాలనుకుంది.

వదినగారు ఇంటిలోంచి పొమ్మని పోరుపెడ్తోంది. దాదాపు పది, పన్నెండు నెలలుగా ఉద్యోగం చేస్తున్నా బస్ ఛార్జీలకు తప్ప మిగిలినదంతా వదినకే ఇస్తూ వచ్చింది.

ఒక మనిషికి మనమంటే పడకపోతే ఆ మనిషితో కలిసి ఒకప్పుకింద ఉండాల్సి రావటం ఎంత నరకమో ప్రత్యక్షంగా అనుభవిస్తుంటే తెలిసి వస్తోందామెకు.

ఇప్పుడు వదిన పోరే తట్టుకోలేక పోతే ఇక లోకాన్ని ఎల్లా ఎదిరించ గలనన్పించింది.

ఏదైతే అదయింది. వచ్చేసి తన దగ్గరే ఉండమని గౌతమి పిలిచింది.

ఏం చెయ్యాలో తెలియని స్థితిలో ఉండగా రాధిక దగ్గరినుంచి వీసా అందింది. వస్తున్నావా? లేక ఇండియా వచ్చి తీసుకొచ్చుకోవాలా? అని బెదిరిస్తూ ఉత్తరం రాసింది.

జరుగుతున్న విషయాలన్నీ రాశానని గౌతమి చెప్పింది. తనే దగ్గరుండి ప్లేన్ ఎక్కిస్తానని రిప్లై కూడా రాశానని చెప్పింది.

సమీర ఏం చెయ్యాలన్న ఆలోచన అయినా చేయకముందే ఆమెను జాబ్ రిజైన్ చేసి పొమ్మని చెప్పారు మిస్టర్ సింథియా ఆమె మూలంగా నర్సింగ్‌హోమ్‌లో వ్యాపిస్తున్న రూమర్లు భార్యకు తెలిస్తే ఇంకేం కొత్త సమస్య లెదుర్కోవాలోనని భయపడ్డారాయన.

చేసేది లేక ఇంట్లోంచి వచ్చేసి గౌతమి దగ్గర ఉండి ప్రయాణానికి సిద్ధమయింది.

నర్సింగ్‌హోమ్ నుంచి వచ్చేస్తుండగా రాజన్ ఆమె ఎక్కడుంటున్నదీ తెలుసుకున్నాడు.

తన అడ్రెస్‌ఇస్తూ చెప్పాడు- " ఎలాంటి అవసరం వచ్చినా రండి. ఐ ట్రీట్‌యూ యాజ్ మై సిస్టర్! ఎంత పెద్ద కష్టం వచ్చినా భయపడకండి. కష్టాన్ని తేలికగా చూడటం నేర్చుకోండి. అప్పుడది మిమ్మల్ని భయపెట్టదు. వెతికితే ప్రతి సమస్యకూ ఓ పరిష్కారం ఉంటుంది. "

కృతజ్ఞతతో చూసింది- దానిని మాటలలో వ్యక్తపర్చలేక. కానీ అతనికది అర్థమైంది.

ఏ విచిత్ర పరిస్థితుల్లో స్త్రీలు ఇటువంటి సమస్యలో చిక్కుకుంటారో మాత్రం అతనికెప్పుడూ అర్థంకాదు.




సరిగ్గా సమీర కెనడా వెళ్ళిపోయిన మరునటి రోజు వచ్చాడు మధుకర్ ఆమె కోసం నర్సింగ్ హోమ్‌కు.

" మాకు తెలీదు. రాజన్‌కు తెలుసునేమో?" అన్నారు అంతా.

రాజన్ అతని వంక ఆశ్చర్యంగా చూశాడు. ఏ అన్న గారో, తమ్ముడో అనుకున్నాడు.

" సమీర జాబ్‌కు రిజైన్ చేసింది " అన్నాడు.

" ఇప్పుడే తెలిసింది. ఆమె అడ్రెస్ తెలుసా మీకు? "

" మీరు ఆమె ఫ్రెండా? "

" కాదు - ఒకప్పటి ఫియాన్స్! "

పీక్కుపోయిన ముఖంతో ఎలాగో ఉన్న ఆ యువకుడి ముఖంలో గాంభీర్యం, నిర్లిప్తత గమనించగానే రాజన్‌కు చటుక్కున స్ఫురించింది- సమీర స్థితికి అతడే కారణమై ఉండవచ్చని.

" ప్లీజ్! కూచోండి. నాడ్యూటీ అవర్స్ అయిపోయాయి. ఓసారి వార్డ్సులో చూసి వచ్చేస్తాను. "

● ● ●

కొద్ది సేపటిలో నర్సింగ్‌హోమ్ ఎదురుగా ఉన్న రెస్టారెంట్‌లో కూచుని కాఫీకి ఆర్డర్ ఇచ్చారు.

" మీకు సమీరకు మధ్య గొడవలొచ్చాయా? "

" అఫ్‌కోర్స్! అవి మూడోవ్యక్తికి చెప్పుకోలేనివి! "

" షి ఈజ్ ఎ నైస్ ఉమన్! కాస్త కూడా లౌక్యం తెలియని మనిషి అన్పిస్తుంది చూస్తే! "

" అందుకే మేమిలా విడిపోవల్సి వచ్చిందేమో! "

" ఆమె కెనడా వెళ్ళింది. "

మధుకర్ పక్కలో బాంబు పడ్డట్టు అదిరి పడ్డాడు.

" జాబ్ దొరికిందా అక్కడ? "

" నాకా వివరాలు తెలీవు. ఫ్రెండ్ దగ్గర కెళ్ళిందని మాత్రం తెలుసు. మెంటల్‌గా చాలా టార్చర్ అనుభవించింది పాపం- అందులోనూ ఫిఫ్త్ మంత్ ప్రెగ్నెంట్ కూడా. "

మధుకర్ ముఖంలోకి ఆశ్చర్యం, ఉద్వేగం, సంతోషం, అంతలోనే విచారం గబగబా పాకి వచ్చాయి.

" ఆమె అడ్రెస్ నాకు తెలీదు. కానీ డాక్టర్ గౌతమి అని ఆమెకు ఎమ్.బి.బి.ఎస్.లో కొలీగ్ అట- ఆవిడకు తెలుసు. నిన్న దగ్గరుండి ప్లేన్ ఎక్కించింది మేమిద్దరమే! అన్నగారేమో ఇంట్లోంచి తరిమేశారు- ఇండియన్ సెంటిమెంట్స్! "

మధుకర్ మనసులో వివరించలేనంత దుఃఖం కలిగింది. గౌరవంగా, హుందాగా బ్రతుకుతున్న సమీరనీస్థితికి దిగజార్చింది తనే!

● ● ●

గౌతమి అందించిన కాఫీ తాగి కప్పు టీపాయ్ మీదుంచాడు.

గౌతమి మౌనంగా చూస్తోంది.

" నాకు గవర్నమెంట్ జాబ్ దొరికింది. వైజాగ్‌కు వేశారు పోస్టింగ్స్. ఆమె ఆవేశం తగ్గించుకుని నా గురించి ఆలోచిస్తుందేమో, తీసికెళ్దామని వచ్చాను. నాతో సహజీవనం సాగించకున్నా ఒకే ఇంటిని రెండు పోర్షన్‌లుగా మార్చుకుని ఫ్రెండ్స్‌గా అయినా ఉండాలని అనుకుంటూ వచ్చాను. "

" నేను మీ బాధ అర్థం చేసుకోగలను. కానీ ఏం చెప్పి ఓదార్చాలో తెలియటం లేదు. "

" సమీర సంతోషంగా ఉంటే అంతే చాలు- ఎక్కడున్నా సరే "

"సమీరకు ఊహతెలిసినప్పటి నుంచీ కష్టాలే అనుభవిస్తూ వచ్చినది. కెనడాలో రాధిక దగ్గర సుఖపడ్తుందని మాత్రం తెలుసు. మననంటారా- అది ప్రపంచంలో ఏ మూలకెళ్ళినా ఒకలాగే ఉంటుంది. ఆమె మిమ్మల్నింకా ప్రేమిస్తూనే ఉందని మాత్రం చెప్పగలను. అందుకే అబార్షన్‌కు ఒప్పుకోలేదు- "

కాస్తాగి తర్వాత నెమ్మదిగా అంది.

" తాము విపరీతంగా ఇష్టపడే వ్యక్తికి ప్రతిరూపంగా కలిగే పిల్లలంటే స్త్రీలకు చాలా ఇష్టమని అన్పిస్తోంది నాకు "

" అలా అనుకునే మోసపోయాను నేను- నువ్వంటే ఇష్టం బావా! సమీరనే చేసుకో. విడాకులిస్తాను. కానీ నీ ద్వారా బిడ్డ కలిగితే జీవితమంతా వాడినే చూసుకుంటాను అని తులసి బలవంతపెడితే నమ్మాను. చివరికదే సమీరకు నామీద అయిష్టాన్ని, విరక్తిని కలిగించింది. "

గౌతమి ఏమీ అనలేదు.

" పోనివ్వండి. మాకు పుట్టబోయే బిడ్డ అయినా నన్ను సమీరను కలుపుతాడని ఆశిస్తాను. ఇది నా అడ్రెస్. మీ అడ్రెస్ మారినా, సమీర అడ్రెస్ మారినా తెలియ చేస్తారా? "

" తప్పకుండా "

" ప్రస్తుతానికామె వాతావరణ మార్పుతో నైనా కోలుకుంటుందని ఆశిద్దాం. తనకు ఏ బిడ్డ కలిగిందీ తెలియ చేస్తారా? "

" అలాగే! "

" తులసితో నేను జ్యుడీషియల్ సపరేషన్ కోసం ట్రై చేస్తున్నాను. అది దొరకగానే సమీరకు కాస్త నాగురించి- రికమెండ్ చేయగలరా! "

జాలిగా నవ్వింది గౌతమి. " చెబుతాను. సమీర మారుతుంది లెండి. "

మౌనంగా పేంట్ జేబుల్లో చేతులుంచుకుని వెళ్తున్న అతనివంక చూస్తూ ఆలోచిస్తుండి పోయింది గౌతమి.

● ● ●

సమీరకు వెళ్ళగానే చిన్న ఉద్యోగమొకటి చూసింది రాధిక.

" నిన్ను పోషించలేక కాదు. నీకో వ్యాపకం ఉండాలని. ఇక్కడి హాస్పిటల్స్, డాక్టర్లు ఈ వాతావరణం- చాలా నచ్చింది నాకు. ఇక్కడ నిన్నెవరూ పట్టించుకోరు. స్వేచ్ఛగా ఉండవచ్చు. ట్రీట్‌మెంట్ అంతా ఒకటే. కాకపోతే ఇక్కడి పద్ధతులు కాస్త వెల్ అడ్వాన్స్‌డ్. ఇన్‌స్ట్రుమెంట్స్ మెషీన్స్ అధునాతనమైనవి.

ఉద్యోగం చేసుకుంటూ ఎఫ్.ఆర్.సి.ఎస్. చేద్దువు గానీ. ఇండియాకు వెళ్ళగానే మంచి జాబ్ దొరకొచ్చు.

తెలుగువాళ్ళంతా కలిసి పెట్టుకున్న ఓ అసోసియేషన్ ఉందిక్కడ. శరత్ అని ఓ సౌత్‌ఇండియన్ ముఖ్యుడు అందులో. ఈ మధ్యనే పరిచయమయ్యాడు. హార్ట్‌సర్జరీలో స్పెషలైజేషన్ చేస్తున్నాడు. మావారికి మంచి ఫ్రెండ్ "

జాబ్‌లో చేరేందుకింకో రెండు రోజులు టైమ్ ఉండటంతో సమీరకా చుట్టుపక్కల ఉన్న ప్రదేశాలు చూపించింది.

" మీ ఫ్రెండ్‌కు మొదటినుంచీ మాటలు తక్కువ మాట్లాడే అలవాటుందా? " అన్నాడు రాధిక భర్త శంకర్.

" అవును. ఏం? " అంది రాధిక.

" మరి నీకెలా ఫ్రెండ్ అయినట్టు! - మరిచిపోయాను. మంచి శ్రోతలే మంచి ఫ్రెండ్స్ అవుతారు కదూ! "

రాధిక గిల్లటంతో కెవ్వుమన్నాడు శంకర్.

" చూడండీ. అత్త కూతురని మోజుపడి కట్టుకుంటే ఎలా గిల్లేస్తుందో ఈ రాక్షసి! మా అమ్మను తెచ్చి పెడతాను నెత్తిన. "

" నాకేం అభ్యంతరం లేదు. కానీ ఆవిడ రెండో రోజే ఇండియా పారిపోతానంటే నీకే డబ్బు వేస్ట్! "

" గయ్యాళివి. నీతో ఎవరు వేగుతారు. ఆవిడైతే మితభాషి కాబట్టి భరించారేమో! "

" నువ్వు కూడా నేర్చుకోరాదూ మితభాషత్వం! "

" తిట్టే నోరు తిరిగే కాలు ఊరుకోవట- మా నానమ్మ చెప్పేది. "

" మా అమ్మమ్మ చెప్పలేదా నీతో- నీకంటే బాగా నాకే తిట్టటం వచ్చని. "

" చెప్పింది. అనుభవిస్తే కానీ తెలీదు కదా! "

" ప్రాక్టికల్స్! ప్చ్! పూర్ ఇండియన్! నానుంచి తప్పించుకోవటం ఇక నీతరం కాదు. "

" ఆ బ్రహ్మతరం కూడా కాదు. "

పైకలా సరదాగా పోట్లాడుకున్నా ఒకరిపట్ల ఒకరికి విపరీతమైన ఇష్టం అని సమీరకు అర్థమయింది.

ఎంత ఇష్టం లేకపోతే ఆమె కోసం అయిదేళ్ళు ఆగుతాడు- !

రాధిక కూడా సుదీర్ఘకాలం సాగే మెడిసిన్ చదివిందీ అందుకే. అతనికోసమే.

రోజులు సరదాగానే గడుస్తున్నాయి సమీరకు- మధుకర్ గుర్తొచ్చినప్పుడు తప్ప! పెరుగుతున్న గర్భాన్ని చూస్తున్న కొద్దీ ఆమెకు క్షణక్షణం మధుకర్ గుర్తొస్తున్నాడు.

భోజనం సహించేదికాదు. మందులు తినాలనిపించేది కాదు. కానీ రాధికను చిన్నప్పటి నుంచి పెంచిన అలివేలు మాత్రం సమీరను మందలించి వేళకేం కావాలో గమనించి అమరుస్తుంది.

గౌతమి సలహామీద ప్లేన్ ఎక్కేటపుడే బొట్టు తీసేసింది సమీర. చేతి కెటూ గాజులుండవు- డాక్టర్ కాబట్టి. చీరలు కూడా నిరాడంబరంగా లైట్ కలర్స్ కడుతుంది. పుట్టే బిడ్డకు, నిత్యం ఎదుర్కోవల్సి వచ్చే సమాజానికి అంతకు మించి ఏం సమాధానం చెప్పాలో తెలియ లేదు. ఎటూ తనిక పెళ్ళి చేసుకునేది లేదు. బొట్టు తీసేస్తే ఏమైంది? అదొక ఆచారం అంతే! కానీ తన మూలంగా రాధిక కూడా అటు భర్తకు, ఇటు తెలిసినవాళ్ళకు సమాధానం చెప్పలేక బాధపడ

కూడదని ఆ నిర్ణయం తీసుకుంది.

శంకర్ కానీ, అలివేలుకానీ ఆమె మీద విపరీతమైన జాలితో ఏమీ మాట్లాడనిది అందుకే

ఓసారి మాటల మధ్య శంకర్ అడిగాడు. "మీవారేం చేసేవారు? ఎలా పోయారు? " అని.

సమీర బదులు రాధిక జవాబు చెప్పింది.

" అతనూ డాక్టరే! మోటర్‌బైక్ యాక్సిడెంట్‌లో పోయాడు. "

" ఎంతకాలమైంది అతను పోయి? "

" నాలుగు నెలలు. "

" మనం ఇండియానుంచి వచ్చాక. అవునూ! మీరు మా పెళ్ళికి రాలేదేం? "

" వైజాగ్ దూరం అందుకే రాలేక పోతున్నానని రాస్తూ గ్రీటింగ్స్ పంపలేదూ? "

" ఏమో! మరిచిపోయాను. "

" మంచిది! తమకు మతిమరుపెక్కువని తెలును మాకు. అందుకే తమరు శ్రమపడకండి. " అందిరాధిక

శరత్ వారిని కలిసేందుకు ఎప్పుడొచ్చినా ఎక్కువగా సమీరతోనే సర్జరీ గురించి, తను చూస్తున్న కేసుల గురించి మాట్లాడే వాడు.

ఆమె అభిప్రాయాలు అడిగేవాడు అప్పుడప్పుడు. ఆమె చెప్పే సమాధానాలకు ఇంప్రెస్ అయేవాడు.

ఎవరి జోక్యమూ పట్టనట్టుగా తనలోకమేదో తనదన్నట్టుగా ఉండే శరత్ అంటే గౌరవ భావ





మేర్పడింది సమీరకు.

బత్తాయి వొలుస్తూనో, ఆపిల్ చెక్కు తీసి ముక్కలు చేస్తూనో దగ్గరే కూచుని వారి మాటలు వినే అలివేలుకు జబ్బుల గురించి, వైద్యం గురించి సమీర అతనికి ఇంగ్లీష్‌లోనూ, తెలుగులోనూ ఇస్తున్న వివరణ, జవాబులు వింటుంటే ఆశ్చర్యంగా ఉండేది. సమీర తను సేకరించిన పుస్తకాలవీ శరత్‌కిచ్చి వాటి మంచి, చెడూ డిస్కస్ చేస్తుండేది.

'' మీ చదువు ఎంతవరకొచ్చింది? ఇక్కడే సెటిల్ అవుతారా? ''

'' చదువయాక కూడా ఇక్కడే ఓ రెండేళ్ళుండి వీరు కేసుల్ని ట్రీట్ చేసే పద్ధతి గమనించాలి. ఇక్కడే వర్క్‌చేసి ప్రాక్టికల్ నాలెడ్జ్ సంపాదించాలి. మరి మీరు ఇక్కడే ఉంటారా? లేక వెళ్తారా? ''

'' ఇండియా ఇప్పుడప్పుడే వెళ్ళను. వెళ్ళినా ఏ అయిదేళ్ళ తర్వాతో. అక్కడికెళ్ళి చేసేదేమీ లేదు. ఉద్యోగాలు దొరకవు! స్వంతంగా పెట్టుకునే స్థోమతలేదు. అయిన వాళ్ళెవరూ లేరు. ''

'' నాకూ ఎవరూలేరు. ఉన్న తల్లి కూడా ఈ మధ్యే చనిపోయింది. ఆస్తి మాత్రం ఉంది. మా అమ్మగారు అంతా కేష్‌గా చేసి ఎఫ్.డి.ల్లో వేసి పెట్టింది. నేను ప్రాక్టీస్ పెట్టుకుంటాననే చేసుంటుందలా. ''

సమీర అలాగా! అన్నట్టుగా చూసి ఊరుకుంది.

'' మీకిక్కడి గవర్నమెంట్ హాస్పిటల్‌లో జాబ్ కావాలంది రాధిక. నాకన్నా శంకర్‌కే మంచి ఇన్‌ఫ్లూయెన్స్ ఉందిక్కడ. నాకెందుకు చెప్పిందాని. ''

'' శంకర్ కూడా ట్రై చేస్తున్నారు. ''

'' శంకర్ ట్రై చేస్తే తప్పక దొరుకుతుంది. ''

శరత్ అన్నట్టే మరో వారంలో గవర్నమెంట్ హాస్పిటల్‌లో జాబ్ దొరికింది సమీరకు.

మొదట రాధిక కోసం ట్రై చేద్దామనుకున్నాడు. కానీ తర్వాత ఆలోచించాడు- రాధికకు గవర్నమెంట్ జాబ్ దొరకకున్నా తనున్నాడు. కెనడాలో ఉండటం రాధికకు కష్టమవదు. కానీ సమీర కెనడాలో ఓ అయిదేళ్ళపాటు ఉండాలంటే గవర్నమెంట్ జాబ్ ఉండాలి. ఏదో కాస్త సంపాదించుకోగలిగితే ఇండియా వెళ్ళాక నర్సింగ్‌హోమ్ పెట్టుకోగలుగుతుంది.

అతనలా విశాల హృదయంతో ఆలోచించి సమీరకు ఆజాబ్ వచ్చేలా చేశాడు. అందులో అతని స్వార్థం కూడా కాస్త ఉంది. రాధికకు ఎంతో ఇష్టం అయిన ఆమెకు ఆ హెల్ప్ చేస్తే, రాధికకు తన మీద ప్రేమపొంగి పొరలుతుంది!

ఆ అకేషన్‌ను శరత్‌తో కూడా కలిసి- నలుగురూ సెలబ్రేట్ చేసుకున్నారు.

ఆ రాత్రి రాధిక తన ఎదమీద మోచేతులాన్చి పడుకున్నపుడు అడిగాడు శంకర్.

'' ఆర్యూ హాపీ నౌ! ''

'' చా....లా! ''

'' అందుకే ఇంతకష్టపడ్డాను. ''

'' ఎందుకు? ''

'' అలా అయినా నన్ను ఇంకాస్త ప్రేమిస్తావని!

కాసేపు అర్థం కానట్టుగా చూసింది. ఆ తర్వాత రాధిక మొహంలో అనిర్వచనీయమైన భావం కదలాడింది. కొద్ది క్షణాలు మాటే రానట్టుగా, మూగగా చూసింది.

'' బావా! '' రాధికకు భావావేశం వచ్చిందని గ్రహించాడు శంకర్ ఆ పిలుపునుబట్టి.

'' నేను నిన్ను ప్రేమించటం లేదనా నీ ఉద్దేశం!''

'' తెలుసు కానీ... అప్పుడప్పుడు ఓ అనుమానం. నీకు నామీదెంత ప్రేముందో పరీక్షించుకోవాలని! ''

'' నేను నిన్ను ఎంత ప్రేమిస్తే నీకు తృప్తి కలుగుతుందో చెప్పు. ''

' నీకెన్ని వరాలు కావాలో కోరుకో అన్న దేవత వంక చూసినట్టుగా చూశాడు.

ఆమె పొడుగాటి కను రెప్పల నీడబెడ్‌లైట్ కాంతిలో అందంగా కన్పిస్తుంది.

'' నీ సమస్తప్రపంచం నేనే అవాలని ఉంటుంది. నాతో గడపటమనే వ్యాపకం తప్ప మరింకేదీ నీకీ లోకంలో ఆకర్షణీయంగా అనిపించ కూడదనిపిస్తుంటుంది. నా ప్రతి చిన్న ఊహని, ఆలోచనని, కష్టాన్ని, సుఖాన్ని నీతో పంచుకోగలగాలనిపిస్తుంది. అలాగే నీ ప్రతి ఒక్క

ఆలోచన, ఊహ నాగురించే అయి ఉండాలన్పిస్తుంది. ఒక మాటలో చెప్పాలంటే నీదనేసర్వస్వం నాకు నాదనే సర్వస్వం నీకు అర్పించుకుని- ఒకరికోసం ఒకరు అన్నట్టుగా గడపాలన్పిస్తుంది. చెప్పేందుకు నాకు మాటలు రావటంలేదు. కానీ అప్పుడప్పుడు నిద్ర పట్టని రాత్రులు లేచి, ఆదమరిచి నిదురబోతున్న నీవంక చూసుకునేటపుడు నాకేమన్పిస్తుంటుందో చెప్పనా? నవ్వవు కదూ!-

" ఈ ఉద్యోగాన్ని, రీసెర్చినీ వదిలేసి నిన్ను ఎత్తుకుని గోదావరి ఒడ్డునున్న మా పల్లెకు తీసుకెళ్ళిపోయి హాయిగా పొలం దున్నుతూ గడపాలన్పిస్తుంటుంది. నేనలసి పోతున్నాను రాధీ! ఈ కృత్రిమ ప్రపంచం, ఈ ఆర్టిఫిషియల్ నవ్వులు, ఈ సివిలైజేషన్- అన్నిటినీ వదిలి పారిపోయి, గోదావరి జలాల పిల్ల కాలువలోని నీటిలా స్వచ్ఛమైన వాతావరణంలో జీవించాలన్పిస్తుంది.

" పల్లెలో అయితే మనల్ని విడదీసే విషయం ఏదీ ఉండదు. నేను పొలంలో ఉంటే పొలంలో, ఇంట్లో ఉంటే ఇంట్లో నిన్ను నాపక్కనే ఉంచుకోవచ్చు కదూ!

" ఒక్కోసారి టెలిస్కోప్‌లోంచి విశ్వాంతరాళంలోని గోళాలను స్టడీ చేస్తుంటే, అనంతంగా ఎదిగిన నీ రూపం కన్పిస్తుంది! ఈ ప్రేమకు, వెర్రికి అర్థం ఏమిటి? ముప్పై మూడేళ్ళు వస్తున్నా నాకు నీ ప్రేమలోంచి బయటపడి వాస్తవ ప్రపంచాన్ని గుర్తించాలని లేదు. "

" చాలా ఏళ్ళు దూరంగా ఉన్నాం కదా? అందుకలా అన్పిస్తుందేమో! నీమీద నాకు ప్రేమ కాన్సన్‌ట్రేషన్ లేదనుకోవటమే నీ ఫూలిష్‌నెస్! పైకి ఎక్స్‌ప్రెస్ చేయకున్నా నా ఊహలనిండా ఎప్పుడూ నువ్వే ఉంటావు. అసలు నిజమైన ప్రేమ ఉన్నపుడే అలాంటి అనుమానాలొస్తాయి. నాకు శవాలన్నా రోగాలన్నా చచ్చే భయం.

ఎముకల్ని ముట్టుకోవాలంటే అసహ్యం! మైక్రోస్కోప్ లెన్స్‌కింద కదిలే బాక్టీరియాను చూస్తే కడుపులో తిప్పేది. అయినా అదంతా ఎందుకు భరించానంటావు- నీమీద ఎంతటి గాఢమైన ఇష్టం లేకపోతే! " అందిరాధిక

" అందుకే యావరేజ్ మార్కులతో పాస్ అయావు. మీ ఫ్రెండ్ చూడు గోల్డ్‌మెడలిస్ట్! ఆమెకు సబ్జక్ట్ మీద ఉన్న కమేండ్, ప్రాక్టికల్ నాలెడ్జ్ చూస్తే చాలా ముచ్చటేస్తుంటుంది. శరత్ కూడా ఇదే అన్నాడు. "

" నిన్ను చూస్తే అందుకే నాకు కోపం! మంచి మూడ్‌నంతా బురదపులిమినట్టుగా అసహ్యంగా చేస్తావు. అంత ఇష్టంలేకపోయినా నేను కాబట్టి ఎక్కడా ఫెయిల్ అవకుండా చదివి పాస్ అయాను. ఇంకొకరైతే నీకూ, ఆ చదువుకు ఓ దండం పెట్టి వెళ్ళేవారు. అయినా ఎందుకలాంటి కోరిక కోరావు. "

" నీకెంత ప్రేమ ఉందో టెస్ట్ చేద్దామని. "

" అందుకే బలవంతాన ఇష్టంలేని సబ్జక్ట్ చదివించావా? "

" ఆస్ట్రానమీలో రీసెర్చి చెయ్యాలంటే ఎంతో కాన్సన్‌ట్రేషన్ ఉండాలి. నాధ్యాస నీమీదినుంచి మళ్ళించు కోవాలంటే నీకూ ఏదో ఓ పనిపెట్టాలనుకున్నాను. ఆ రోజుల్లో నీకోసం డబ్బు, కీర్తి సంపాదించి నిన్నో స్టేటస్ అనే గొప్ప సింహాసనం మీద కూచోబెట్టి సంఘంలో గొప్పగా ఫీల్ అయేలా చేయాలనుకున్నాను. మాకేమీ ఆస్థి లేదని మామయ్యకు అభ్యంతరం! అందుకే నా ఉద్యోగంలో అభివృద్ధి సాధించి మీకు సమానమైన స్థితిని పొంది గర్వంగా నిన్నందుకోవాలని. నేనెలా ఉన్నా నన్ను చేసుకుంటావని తెలుసు. కానీ నిన్ను చేసుకున్న తర్వాత ఇక రీసెర్చీ ఉండదు. అభివృద్ధీ ఉండదు. అందుకే మెడిసిన్‌లో చేరమన్నది. మీనాన్న నీ పెళ్ళిని పోస్ట్‌పోన్ చేసే అవకాశం కోసం కూడా నువ్వందులో చేరటం మంచిదనిపించింది.

" ఇప్పుడైనా అర్థమైందా? నీకోసం సప్త సముద్రాలు ఈది వచ్చానని? "

" ప్లేన్‌లోనే ఎగిరి వచ్చావుగా? ఈది వచ్చానంటావేం! " అమాయకత్వం నటిస్తూ అన్నాడు.

" మెడిసిన్‌లో ఒక్కో సంవత్సరం పాస్ అయినపుడంతా నాకు ఒక్కో సముద్రం దాటినట్లనిపించేది. నాకు మరీ కష్టం అనిపించినప్పుడంతా నీ ఉత్తరాలు చదివి ధైర్యం తెచ్చుకునేదాన్ని. ఒక్కో ఏడాది గడుస్తూ నన్ను నీకు దగ్గరగా తెస్తున్నాయన్న ఊహవల్ల కలిగే సంతోషంతో మరింత ఉత్సాహం తెచ్చుకుని చదివేదాన్ని. సమీర చదువులో నాకెంత సహాయం చేసిందో తెలుసా? నాకు విపులంగా అర్థమయేలా మళ్ళీ

పాఠాలు చెప్పేది. నోట్స్ కూడా సులభంగా ఉండేలా రాసిచ్చేది. ''

'' అలా అయితే నువ్వు సప్త సముద్రాలు కాదు- తొమ్మిది సముద్రాలు ఈది వచ్చావు నా కోసం! - పి.జి.తో కలిపి. ''

'' మాటలతోనే గడిపేస్తావా? నిద్రపోనిస్తావా?''

'' నన్ను నిద్ర పుచ్చి, నిద్రపో! ''

ఆమె మీదికి పొర్లుతూ కొంటెగా అన్నాడు.

'' నాకు నిద్రొస్తోంది. ''

'' వస్తుంది. రాక్షసివి! ఎప్పుడూ నిద్ర అంటుంటావు. ఇక్కడికొచ్చిన కొత్తలో ఎంత ఇబ్బంది పడేవాడినో.

ఇక్కడి అమ్మాయిలు ఇండియన్స్ అంటే ఇష్టపడతారెందుకు అనుకునేవాడిని. తర్వాత ఓ గర్ల్‌ఫ్రెండ్ చెప్పింది. ఇండియన్స్‌కు ప్రేమ, శీలం, అనే సెంటిమెంట్స్ ఎక్కువ! అందుకు అని ''

రాధిక కోపంగా చూసేసరికి నవ్వుతూ బెడ్‌లైట్ ఆఫ్ చేసి ఆమెను దగ్గరికి తీసుకున్నాడు.



సమీరకు రోజులు యాంత్రికంగా గడుస్తున్నాయి. రాధిక అన్ని విధాలా ఆమెను ఉత్సాహంగా ఉంచే ప్రయత్నం చేస్తోంది. కానీ శంకర్ ఎక్కడ విసుక్కుంటాడోనని భయపడుతోంది సమీర.

రాధిక ఎంతో టెన్షన్ అనుభవించిన ఆరోజు రానే వచ్చింది.

చంద్రబింబంలాంటి మగబిడ్డను అలివేలు పొత్తిళ్ళలో ఎత్తుకుని నిల్చుంటే సమీరకు ఆనందంతో కళ్ళు చెమర్చాయి. తన లోకమంతా పుట్టిగంటయినా గడవని ఆ పసిగుడ్డు చుట్టూ రానే నిండి ఉందనిపించిందామెకు.

రాధిక చాలా గ్రాండ్‌గానే సెలబ్రేట్ చేసింది. 'ఏపేరు పెడ్దాం' అన్నరాధిక ప్రశ్నకు సమాధానం అప్రయత్నంగా వచ్చింది సమీర నోటివెంట.

''వంశీ'' అని.

''వెరీగుడ్! అయితే ఏడునెలలుగా ఈ పేరు గురించే ఆలోచించి ఉంచుకున్నావా? కానీ శంకర్ పావం—డిసప్పాయింట్ అవుతాడేమో!''

''ఏం?''

''కృష్ణా అని పెడ్దాం అనుకున్నాడు. పోనీ వంశీకృష్ణ అనిపెడితే?''

''మనఇండియన్స్‌కి దేవుడిపేర్లంటే ఎందుకింతఇష్టం? అందరూ ఆపేరే పెట్టుకుంటారేం?''

''అలా అయినా కాస్త ఆధ్యాత్మిక చింతన కలుగుతుందనేమో''

★ ★ ★

సమీరకు ఇల్లు కూడా ఇచ్చింది గవర్నమెంట్!

శంకర్, రాధిక తప్పనిసరిగా న్యూయార్క్‌కు వెళ్లాల్సి వచ్చింది.

సమీర ఒంటరిదవుతుందన్న భయంతో అలివేలును ఉంచేసింది రాధిక. అలివేలుకూ సమీరతో ఉండాలంటే ఇష్టమే:— వంశీ అంటే ఆవిడకు చాలా ఇష్టమైపోయిందీమధ్య.

''చిన్నప్పటినుంచీ నన్ను పెంచావు. ఇప్పుడు వంశీనిపెంచాలని ముచ్చటపడుతున్నావు. ఈ సరదా ఎప్పటికి తీరుతుంది?'' అందిరాధిక నవ్వుతూ.

''నీ కడుపునా ఓ కాయకాస్తే చూడాలని ఉంది.''

''బాప్‌రే! ఆవిడ మాటలు వినకు. నువ్వు మాత్రం పిల్లనో, పిల్లాడినో కను.''

శంకర్ జోకేసేసరికి సమీర కూడా పకపకా నవ్వేసింది.

సమీర బాధ్యత శరత్ కప్పగించి వెళ్ళింది రాధిక.

వంశీ ఇప్పుడు ఇల్లంతా పాకుతున్నాడు. ఏది కనిపిస్తే దానిని నోటిలో పెట్టుకుంటున్నాడు. అలివేలు సరదాకి రెండుపంచేసిన నిమ్మకాయ

దొప్ప చేతిలో పెట్టింది.

దాన్ని నోట్లోపెట్టుకుని ముఖం విరుస్తుంటే విరగబడి నవ్వింది.

సమీర ప్రపంచమంతా వంశీనే!

కొడుకుతో ఆడుతుంటే కాలం ఎట్లాగడుస్తున్నదీ తెలిసేదికాదు. ఒక్కోసారి ఆశ్చర్యంగా, భయంగా అనుకునేది—'ఈవరాల కొండనా తాను కత్తితో ఛిద్రంచేయించాలనుకుంది' అని. ఆ ఊహ వస్తే తానే కత్తిపట్టుకుని వంశీమీదికెళ్ళినట్టు, వాడు బోసినవ్వులతో అమాయకంగా తనను చూస్తున్నట్టు అనిపించేది. భయంతో వళ్ళు జలదరిస్తుండగా వాడిని మరింత దగ్గరికి హత్తుకునేది.

వంశీ లేకపోతే తనకు ప్రపంచమెంత శూన్యంగా ఉండేదో తలుచుకుని దేవుడికి ధన్యవాదాలు చెప్పుకునేది.

ఆ వరాన్ని, సంపదను ఇచ్చిన మధుకర్ గుర్తొస్తే మనసు భారంగా అయేది. దానికి తగినట్టు వంశీలో స్పష్టంగా మధుకర్ పోలికలు కన్పించసాగాయి. ఆభుజాలు, ఆవిగ్రహం, ఆనుడుము, ఆఉంగరాలజుట్టు, నవ్వినపుడు చికిలించుకుపోయే కళ్లు, కనుబొమలు - వాడు పెద్దవాడైతే అచ్చు మధుకర్‌లాగే ఉంటాడనుకునేది.

చివరగా ఆమె ఆలోచనలు అంతమయేది రాధికమీద కృతజ్ఞతా భావంతో! రాధికే లేకపోతే ఈ సంతోషాన్ని తానింత తృప్తిగా అనుభవించేదా?

ఆమె ఎఫ్.ఆర్.సి.యస్.కు తయారవుతూంది.శరత్ సలహామీద ఆప్థాల్‌మాలజీ స్పెషలైజ్ చెయ్యాలను కుంటోంది.

★ ★ ★

లాన్‌లో సమీరపెద్ద స్విమ్మింగ్‌బాల్ వేస్తూంది. వంశీ కొద్దిదూరం దానివెనుక దోగాడుతూ వెళ్ళి అది అందాక, రెండు చేతులతో పట్టుకుని మెల్లిగా లేచి నిలబడి రెండడుగులు వేసి, మళ్ళీ కిందపడుతున్నాడు.

శరత్ వెళ్ళేసరికి కనిపించిన దృశ్యమది!

అతన్ని చూసి వంశీ కేరింతలు కొడ్తూ వెళ్ళి కాలుపట్టుకుని లేచి నిలబడ్డాడు. శరత్ నవ్వుతూ ఎగరేసి ఎత్తుకున్నాడు.

"ఎలాఉంది మీ చదువు?"

"బాగానే సాగుతోంది. ఐయామ్ వెరీమచ్ శాటిస్‌ఫైడ్ విత్ వాట్ ఐ హావ్ నౌ!"

"నేను ఇండియా వెళ్లిపోదామనుకుంటున్నాను." అన్నాడు శరత్!

"ఎప్పుడు?"

"వీలైనంత త్వరగా!"

"ఏమిటింత సడెన్‌గా డిసైడ్ చేసుకున్నారు?"

"మాతృభూమిమీద బెంగ...!" అన్నాడతను చిరునవ్వుతో.

శరత్ చాలానిష్కల్మషంగా నవ్వుకలడనుకుంది.

"ఇండియా అంతా కాశ్మీర్‌నుంచి కన్యాకుమారి దాకా చుట్టి రావాలనుంది. భిన్నప్రదేశాలూ, భిన్నసంస్కృతులు కల మనదేశమంటే ఇష్టం నాకు. చదువవగానే ఇండియా అంతా చుట్టాలని ఎప్పటినుంచో కోరికగా ఉంది."

"ఆతర్వాత?"

"ఏముంది? ఓనర్సింగ్‌హోమ్ ఓపెన్‌చేయాలి- అన్నిరకాల ఫెసిలిటీస్‌తో, ఇంతవరకూ ఏనర్సింగ్‌హోమ్‌కూలేని హంగులన్నీ అమర్చాలి."

మౌనంగా వింటూండిపోయింది సమీర. ఈదేశంలో కాలుపెట్టినపుడు రాధిక ఉంది. శంకర్ ఉన్నాడు. శరత్‌కూడా ఉన్నాడు. కానీ ముగ్గురూ వెళ్ళిపోతుంటే తిరిగి ఒంటరితనం చుట్టుకుంటుందేమో!

'తన పిచ్చి కానీ- ఎవరూ ఎవరికీ చివరివరకూ తోడు రారు. ఏదో ఒక మజిలీలో ఆగిపోక తప్పదు' అసలీ ప్రపంచంలోనే మనిషి ఎన్నిరోజుల, క్షణాల అతిథో ఎవరికి తెలుసు! అన్నీ ఉన్నా మనసు ఆనందంలో మూగపోతుంది. అన్నీ పోగొట్టుకున్నా దుఃఖంతో మొద్దుబారుతుంది.

అందుకే పెద్దలు ఆధ్యాత్మికచింతన ఉత్తమ మార్గంగా చాటి చెప్పారు. ఉన్నాడో, లేడో తెలియని పరమేశ్వరుడికి జీవితాన్ని, మనసునూ అర్పించుకోవటంలో ఉన్నతృప్తి అనంతం, అత్యద్భుతం!

ఈవయసుకే తనకు వైరాగ్యం వచ్చేసిందే!

"ఏమిటి మీలో మీరు నవ్వుకుంటున్నారు?"

"ఏం లేదు."

ఆమె చెప్పటం ఇష్టంలేక దాటేస్తోందని అర్థంచేసుకుని ఆటాపిక్ మార్చాడు.

"మరి మీరెన్ని రోజులుంటారు ఇక్కడ?"

"ఏమో!

'ఇండియాకు రావటం జరిగితే నన్నుకలవండి."

"తప్పకుండా! అయినా మీరు వెళ్ళేది ఇప్పుడే కాదు కదా."

"అమెరికాలోని కొన్ని ఇంపార్టెంట్‌ప్లేసెస్ విజిట్ చేద్దామనుకుంటున్నాను. రేపే వెళ్తున్నాను. తిరిగొచ్చాక వెళ్ళిపోతాను."

"మంచిది!! మీ ప్రయాణం చక్కగా సాగాలని ఆశిస్తున్నాను."

"ఇంతచక్కటి తెలుగు వింటుంటే మనసుకు హాయిగా ఉంది."

"అర్థమైంది."

"ఏమిటి?"

"మీకు ఇండియామీదున్నబెంగ!"

ఇద్దరూ నవ్వుకున్నారు.

"వీడినినాకు ఇచ్చెయ్యరాదూ!"

"ఎందుకు?"

"చక్కగా పెంచుకోవచ్చని."

"ఓచక్కటి తెలుగమ్మాయిని చూసి పెళ్ళిచేసుకోండి."

"పిల్లలు కావాలంటే పెళ్ళిచేసుకోవాలా?"

"మన స్వంతరక్తంలో ఉంటే తీపి వేరు. ఎంత మంది పిల్లలకు ట్రీట్‌మెంటిచ్చాను. ఓపేషెంట్‌లో సెలైన్ ఎక్కించాను. వీడికి మాత్రం సన్నసూదిగుచ్చుకున్నా భరించలేకపోతుంది. అందుకే అంటారు- 'బ్లడ్‌ఈజ్ థిక్కర్ దాన్ వాటర్' అని."

"నారు పీకేసచ్చాడు. పిడికిళ్ళు చూడండి ఎంతతెలివితేటలుట్టిపడేలా ఉన్నాయో! ఇంత విశాలమైన ఫాలం ఉంటే మంచి మేధావంతుడవుతారంటారు."

"చిన్నప్పటినుంచి చూశారుకదా! అందుకే బాగా అటాచ్‌మెంట్ పెరిగుంటుంది."

"కొంచెమేమిటి! చాలానే పెరిగింది. ఎక్కడికెళ్ళినా బాబు మీద బెంగ కలుగుతుందనిపిస్తుంది."

"అందుకే ఛేంజ్ కోసమైనా పెళ్ళిచేసుకోండి."

"ఛేంజ్‌కోసం పెళ్ళిచేసుకుంటారా?"

"ఒక్కొక్కరు ఒక్కోకారణం కోసం పెళ్ళిచేసుకుంటారు. అన్నింటికన్నా - జీవితంలో కష్టం, సుఖం పంచుకునే ఓతోడు కావాలన్న భావంతో చేసుకోవటం మంచిది."

"వెల్! అలాఅయితే నేను లవ్‌మేరేజ్‌చేసుకోవలసి ఉంటుంది. కానీ నన్ను కూడా ప్రేమించే అమ్మాయి రావాలిగా! నేనొక్కడినే ఇష్టపడితే చాలదు."

సమీర సరదాగా నవ్వేసింది.

"మీ తీరు చూస్తుంటే ప్రేమలో పడ్డట్టే ఉంది. ఎవరో చెప్పండి. రాయబారం నడుపుతాను."

ఇబ్బందిగా నవ్వాడు.

"ఎందుకంటే- ఆ అమ్మాయి అందరిలాంటిది కాదు."

"ఏం?"

"ప్రేమనేది పరిచయంచేసేగుణం లేనట్టని పించింది."

"అయితే చాలా కఠినురాలన్నమాట."

"అలాకాదు. ఏమో! నాకు చెప్పటంరాదు."

"గర్విష్టి అయినా అయివుంటుంది."

"ఊహూ! గర్వం ఎలా ఉంటుందో అసలు తెలియనంతలా ఉంటుంది."

"అందంగా ఉంటుందా?"

"కళ్ళు మాత్రం చాలా అందంగా ఉంటాయి. అందాన్ని మించిన వ్యక్తిత్వం!"

"అయితే ఆమెను మేము మీ కళ్ళుపెట్టుకుని చూడాలంటారు."

"ఫరవాలేదు. మీకూ జోకులు వచ్చు."

"ఇది పొగడ్తా? అవమానించడమా?"

అతను మళ్ళీ నవ్వేశాడు. కానీ అతని ఎక్కడో మనసులో అతను వేరేదేమో మధనపడుతున్నట్టుగా. ఏదో చెప్పాలని తపనపడుతున్నట్టుగా

కన్పించాడు.

''నాకేదైనా చెప్పాలనుకుంటున్నారా?''

''మేముఎవరమూ లేకుండా ఒంటరిగా ఇక్కడుండటం మంచిది కాదేమోనని! ఇక్కడి ప్రజల్లో ఫ్రస్ట్రేషన్ ప్రబలిపోయింది. ఏమూడ్‌లో ఏంచేస్తారో తెలియటం లేదు.''

''రాధిక అదే రాసింది- న్యూయార్క్‌లో చిన్న జాబ్‌దొరికినా సరే చాలు। వచ్చేద్దువుగాని అని. వాళ్లకు చాలా పెద్ద క్వార్టర్ ఇచ్చారట. కలిసి ఉందామని రాసింది.''

''వెళ్ళటమే మంచిది.''

కాసేపు ఉండి వెళ్ళిపోయాడు.

చిత్రమైన వ్యక్తి అనుకుంది. ఒక్కో క్షణం ఎంతో సరదాగా దగ్గరగా అనిపించేట్టు ప్రవర్తిస్తాడు. మరుక్షణంలో ఎంతో ముభావంగా, రిజర్వ్‌డ్‌గా మారిపోతాడు.

★ ★ ★

ఆ తర్వాత మూడేళ్లు అక్కడే ఉండిపోయింది. తన నర్సింగ్‌హోంలో చేరమని, ఆమె 'కోసం ఫ్లాట్‌కూడా కుదిర్చానని' శరత్ రాయటంతో వచ్చేసింది.

వంశీ కప్పుడు మూడునిండి నాలుగోఏడు నడుస్తూంది. జీవితం పట్ల నిర్లిప్తత ఏర్పడ్డ సమీర ఇప్పుడు పూర్తిగా తెల్ల చీరలే కడుతోంది.

ఏర్‌పోర్ట్‌కొచ్చి రిసీవ్ చేసుకుని నేరుగా తన కోసం తీసుకున్న ఫ్లాట్‌కు తీసుకెళ్ళాడు.

'ఎంతపేచెయ్యాలి దీనికి?''



"ఆ అవసరం లేదు."

"అదేమిటి! రెంట్‌కి తీసుకున్నానన్నారు."

"నెల నెలా పదిహేను వందలు 'పే' చేసే కంటే రెండు లక్షలు పెట్టి కొనటమే నయమ న్పించింది. మీకు నచ్చిందికదా. ఇక హొటల్‌కె ళ్ళి భోంచేద్దాం పదండి."

"మీ ఇంటికి తీసికెళ్తే మీ శ్రీమతి కోప్పడు తుందా?"

"నామతి నాకుండనేఉంది. మధ్యలో ఈ శ్రీమతి ఎవరు?"

"అయితే మీరింకా... పెళ్ళిచేసుకోనేలేదా?"

"ఎందుకంత ఆశ్చర్యం?"

వంశీ తల్లి ఒడిలో కూచుని శరత్ వంక చూస్తున్నాడు. కుతూహలంగా పరిసరాలు చూస్తు న్నాడు. శరత్ పిలిస్తే సిగ్గు పడ్తూనే వెళ్ళాడు.

"అలివేలు ఏదీ?"

"దేశంలో కాలు పెట్టగానే వాళ్ళబంధువులె వరినో చూస్తానంది. మీ అడ్రస్ కాగితమిచ్చి పంపించాను. వస్తుందో వారం రోజుల్లో."

"శంకర్ విశేషాలు ఏమిటి? నాకుత్తరాలు రా యటమే మానేశాడు. పిల్లలా?"

"ఒక పాప, బాబు-కవలలు."

"పిల్లలో అసిగేలపెట్టేవాడు. భలేగుంది!"

"చెప్పండి"

"ఏమిటి?"

"పెళ్ళెందుకని చేసుకోలేదు?"

చూస్తుంటే నాకు పెళ్ళయితేకానీ మీరు నిశ్చింతగా నిద్రపోరని పిస్తోందే"

"అదే మీ అమ్మా, తాతయ్యుండుంటే సంబంధా లు వెతికేవాళ్ళు. బలవంతపెట్టే వాళ్ళు. ఇక నేవెదుకుతానుంటుంటే మీకు సంబంధాలు."

"మీరుపెం శ్రమపెట్టుకోవద్దు. పెళ్ళి మానేశా ను."

"ఎందుకని? అప్పుడెవర్నో ప్రేమించానన్నా రు."

"ఆమె కిపి వరితో పెళ్ళయింది."

సమీర నిర్విణ్ణురాలైనట్టు చూసింది.

"అంతే... పాప! పాప సిపమో! మనసు దాని

పే మొగ్గుతుంది."

"లంచ్ చేసేదాకా మౌనంగా ఉన్నారు.

"ఏమంటుంది మీ మాతృభూమి"

"తల్లి ఒడిలో తలపెట్టుకుని పడుకున్న ట్లుంది".

మళ్ళీ కాసేపు మౌనం వహించారు. హఠాత్తుగా అడిగింది.

"నాకెందుకంత ఖరీదైన ఫ్లాట్ కొన్నారు? పది వందలు అద్దె కట్టాలన్నా కష్టమేనే."

"ఇన్నేళ్లు ఫారిన్‌లో జాబ్‌చేసికూడా డబ్బు కోసం బాధపడుతున్నారా?"

"అదంతా వంశీకోసం... వాడికున్నది నేనే కదా! నాకే హఠాత్‌మరణమో సంభవిస్తే వాడు బికారి కావటం ఇష్టం లేదు నాకు."

"ఛ! సిల్లీగా మాట్లాడకండి. అలాంటిదేదీ జరగదు. ఒకవేళ జరిగినా మీ బిడ్డని నాబిడ్డక న్నా ఎక్కువగాపెంచుకుంటాను. నన్ను నమ్మండి!"

"మిమ్మల్ని నమ్మి నెలనెలా నాసేవింగ్స్‌ని ధార పోయమంటారు."

"అదిరెంట్‌కి కాదండీ మేడమ్! మీరు ఫ్రీగా ఉండొచ్చు. నా నర్సింగ్‌హోమ్‌కు నాఅంతటి అసిస్టెంట్ ఒకరు కావాలన్న స్వార్థంతో మిమ్మ ల్ని రప్పించాను. వచ్చిన వాళ్ళ ప్రతిభ గుర్తించి ఎవరూ లాక్కుపోకుండా ఇవన్నీ ఎరట!"

"ఏమిటో నాప్రతిభ!"

"సమీరా ఎమ్.బి.బి.ఎస్; ఎమ్.డి; గైనకాల జిస్ట్, స్పెషలిస్ట్ ఇన్ ఆబ్ధామాలజీ, ఎఫ్.ఆర్.సి. ఎస్"

★ ★ ★

"ఏమిటి? ఒక్కసారి కూడా రాలేదు మళ్ళీ"

"రోజూ నర్సింగ్‌హోమ్‌లో కలుస్తున్నాముగా."

"నిజం చెప్పండి?"

"ఇది ఇండియా కాబట్టీ. ఇక్కడ అనుక్షణం ఇతరుల అదృష్టానికి ఈర్ష్యతో రగిలిపోయే మన షులుంటారు. కాబట్టీ. ఇక్కడ నిప్పులేకుండానే పొగ పుట్టించే మనుషులుంటారు. కాబట్టే. ఇత రుల జీవితాలు పరిశీలించి థీసిస్ రాయగల స్కాలర్లు ఉంటారు. కాబట్టే...!"

సమీర కర్థమైంది. ఆరోజు నుంచీ శరత్‌కు దూరంగా, అపరిచితురాలిగా ఉండటం అలవా

టు చేసుకుంది.

శరత్‌కూడా ఆమె జీవితం అపవాదుల మయం కావటంఇష్టం లేక, ఆమె ఇంటికి వెళ్ళ టమూ మానేశాడు. నర్సింగ్‌హోమ్‌లో ఉండగా కూడా క్లుప్తంగా ముభావంగా తప్పచనువుగా, సరదాగా మాట్లాడటం మానేశాడు. అప్పుడప్పు డు వంశీ గురించి, అలివేలు గురించి వాకబు చేసేవాడు.

★ ★ ★

"ఇదేమిటి గౌతమీ! ఎవరీ మధుకర్?"

భర్త నోటివెంట ఆపేరువినిఆశ్చర్యంగా వంటింట్లోంచి వచ్చింది గౌతమి.

భర్త చేతిలో ఉన్న విజిటింగ్ కార్డ్‌తీసుకుంది.

"ఎక్కడ దొరికిందిది మీకు?"

"నీ ఫిజియాలజీ టెక్స్ట్‌బుక్‌కున్న నల్ల కవర్‌మ డతలో !"

"అది సరే! ఇప్పుడు నా పుస్తకాలెందుకు తీశారు."

"మాఫ్రెండ్ చెల్లి ఎమ్.బి.బి.ఎస్.లో చేరింది. పాపం వాళ్ళు చాలా పేదవాళ్ళు. అనాటమీ, ఫిజి యాలజీ, బయోకెమిస్ట్రీ పుస్తకాలివ్వమంటే, ఇంతకూ ఎవరీ మధుకర్!"

"మాఫ్రెండ్‌కి కాబోయి మానేసిన హజ్బెండ్"

"అదృష్టవంతుడు. కంగ్రాట్యులేట్ చెయ్యాలి- డాక్టర్‌ని కట్టుకోనందుకు."

"నా వల్ల మీకు కలిగిన నష్టం ఏమిటిట?"

"సమతులాహారం!"

"ఆ! ఇంకా బొజ్జ పెంచుకోవాలని ఆశ-ఇప్ప టికే పేంట్లు సైజుమార్పించేందుకే టైలర్‌కి బోలె డు డబ్బులు తగలేస్తున్నాం."

"వచ్చే జన్మలో హాయిగా ఆడపిల్లనై పుట్టి నాకిష్టమొచ్చినంత తింటూ బొజ్జపెంచుకుంటా ను. నీకేం! వంటింట్లో చేరి వంట చేస్తూనే గిన్నెలు ఖాళీచేస్తావు. నాకు మాత్రం ఖాళీగిన్నెలు చూ పిస్తే తిడతానని సమతుల్య ఆహారం గురించి లెక్చర్లు చెబుతావు"

"అయిందా గొణగటం! అయినా నా మెడి సిన్ పుస్తకాలన్నీ కట్టగట్టి అటకెక్కించటంలో మీ ఉద్దేశ్యం?"

"సదుద్దేశమే!"

"ఏమిటో! అంత లా...వు సదుద్దేశం?"

"అలావెక్కిరిస్తూనే ఉండు! ఎప్పుడో రైలెక్కి స్తాను—పుట్టింటికి."

"పంపించండి! ఈ చాకిరీ చెయ్యలేక నాకూ విసుగేస్తోంది. కాస్త అలా తిరిగి వస్తాను. కానీ రమ్మని రాస్తారుకదా? అప్పుడే ఓ వంద ఎమ్.ఓ. కూడా చెయ్యండి. విషయం దారిమళ్ళించక, నీళ్ళునమలక నా పుస్తకాలు అటకఎందుకె క్కించారో చెప్పండి ముందు."

"న్యూస్‌పేపర్లవాడికేద్దామని!"

"ఎంత ధైర్యం!"

"నిన్ను చూస్తే నాకేం భయంలేదు—చెప్పు. ఈ మధుకర్ విజిటింగ్ కార్డ్ నీ బుక్‌లోకెలా వచ్చింది?"

"ఏమిటా నిలదీయటం? మాఫ్రెండు, అత ను విడిపోయారు. అడ్రెస్ తెలిస్తే రాయమని అడిగాడు."

"మరి రాశావా?"

"భద్రంగా ఉంచాలని, నాటెక్స్టుబుక్ కవర్‌లో దాచి, ఆ తర్వాత ఆ దాచిన ప్లేస్‌గుర్తురాక తన్నుకు చచ్చాను. ఈ వెధవ కాపురం నాకు మతిమరుపును, పరధ్యానాన్ని తెచ్చింది."

"మధ్యలో కాపురాన్నెందుకు తిడతావ్! అది హిందూ స్త్రీధర్మం కాదు తెలుసా?"

"నా చిన్ని బుర్రకు అంతలావు విషయాలు ఎక్కవుకానీ—వదిలెయ్!" అంటూ భర్త దగ్గ ర్నించి విజిటింగ్ కార్డ్ అందుకుని చూసింది.

"ఇంతకూ ఇతనీ అడ్రెస్‌లో ఉన్నదీ, లేనిదీ తెలుసుకోవాలండీ. మనం ఇల్లు మారిన విషయం రాద్దామని చూస్తే దొరకలేదిది."

"నే కనుక్కుంటానులే—ఉత్తరం రాసి."

"ఆ పని చేయండి."

ఆమె భయపడ్డట్టే మధుకర్ ఆ అడ్రెస్‌లో దొరకలేదు. జాబ్‌రిజైన్ చేసి వెళ్ళాడని తెలి సింది.

★ ★ ★

"మనం 'మీరానిలయమ్' కొనబోతున్నాం."

శరత్ మాటలకు విస్తుపోయి చూసింది.

"నే వెళ్ళి కలిసి మాట్లాడాను. చాలా జెంటిల్

మెన్! మొదట అతను ఒప్పుకోలేదు. తనకిష్ట మైన వ్యక్తిపేరు పెట్టి కట్టుకున్నానన్నాడు.

చిత్రంగా మాటల మధ్య నీపేరు వచ్చింది.

వివరాలు అడిగారు. చెప్పాను.

ఏమాలోచించు కున్నారో మరి. అమ్మను కానీ డొనేట్ చేస్తానన్నారు. అతనికి నువ్వు మంచి ఫ్రెండ్ అని చెప్పారు. నువ్వంటే అతనికి చాలా గౌరవం, అభిమానం అనుకుంటాను.

డబ్బుతీసుకోకపోతే ఆ బిల్డింగ్ వద్దన్నాను. ఆ డబ్బును బేంక్‌లో వేసి, బీద పేషంట్లకు వైద్యం ఫ్రీగా చెయ్యమన్నారు."

సమీర ముభావంగా ఉండటంతో అతని అనుమానం నిజమని తెలిసింది.

"ఈ విషయం చెప్పేందుకేనా మీ ఇంటికి తెచ్చింది?"

"కాదు. నీ మనసు పొరల్లో దాగి ఉన్న దుఃఖం ఎలాంటిదో తెలుసు కుందామని! చెప్పుసమీరా? నా కన్నా ఆత్మీయులున్నారా? నీ బాధ, నీ కష్టం, నీ దుఃఖం—అన్నీ విప్పిచెప్పు."

"ఎందుకిలా అడుగుతున్నారు?"

కన్నీళ్ళు ఆపుకోలేక పోయింది. బుగ్గలమీదికి జారాయి అవి నెమ్మదిగా.

"మనమధ్య ఏ స్నేహబంధమూలేదను కుంటే పోనీ! నిన్ను నిష్కల్మషంగా అభిమానించే ఓ స్నేహితుడిగా భావిస్తే మాత్రం నాతో చెప్పు. నేనూ నీకు రాధిక లాంటి మంచి ఫ్రెండ్‌నని అనుకుంటున్నాను."

"ఎక్కడ మొదలుపెట్టాలి? తన కష్టాలకు. కన్నీళ్ళకు ఏదిమొదలు! ఏది చివర!

గతం మళ్ళీ ఎందుకు తన ముందురువ స్తోంది?

★ ★ ★

ఆరోజు... చదువుతున్న ఫిజియాలజీ బుక్‌ప క్కనపెట్టి లేచి వెళ్ళింది సమీర తనకోసం విజి టర్స్ వచ్చారనటంతో.

గేటుదగ్గర నిల్చుని తన కోసం ఎదురు చూస్తు న్నాడు బావ మోహన్.

"డిస్టర్బ్ చేసినట్లున్నాను" అన్నాడు.

"ఫరవాలేదు. ఏమిటో చెప్పు". అందితను వినుగ్గానే.

"నేను ఊరికి వెళ్తున్నాను నువ్వు కూడా వస్తావా?

"ఇప్పుడెందుకు ఊరికి? అయినా మీకు ఫోర్త్ ఇయర్ పరీక్షలింకో నెలలోపలుంటాయను కుంటాను. ఈసారి అయినా శ్రద్ధగా చదివి పాస్ అవాలని లేదా?"

"నే వెళ్తున్నాను. నువ్వొస్తావేమో అడుగుదామ నుకున్నాను. అయితే రావన్నమాట. సరే! నేనొక్క డినే వెళ్తాను. చదువు ఇంటిదగ్గర కూడా చదవొ చ్చు. అమ్మను చూడాలని వెళ్తున్నాను. పోనీ ఈవేళ ఎగువతిరుపతి వెళ్తున్నా వస్తావా? మళ్ళీ రేపుదయం వచ్చేద్దాం!

"నేను పరీక్షలయాక వెళ్తాను. ఫస్టియర్ ఎగ్జా మ్స్ నుంచే మెరిట్ సంపాదించుకోగలిగితే స్కా లర్‌షిప్ అయినా దొరుకుతుంది."

"నే చిన్నప్పటినుంచి చూస్తున్నా! నీకు చదు వుంటే మరేం అవసరంలేదు. పోనీ ఒకమాటడు గుతాను నిజాయితీగా చెప్పు. నేనంటే నీకెందు కింతకోపం?"

"నువ్వంటే కోపమేమిటి! ఎవరు చెప్పా రలా?"

"ఎవరూ చెప్పకపోయినా నీకు నేను కన్పించి నపుడంతా నీ ముఖంలో కదిలే ఫీలింగ్స్‌ని బట్టి అర్ధమవుతుంది. నేను సరిగా చదువుకోనేనా?"

"లేదు మోహన్! నాకలాంటి కోపం ఏదీలేదు నీ మీద. నా చదువుని డిస్టర్బ్ చేస్తావని తప్ప!"

"సరే! చదువుకో అయితే! నేను వెళ్తున్నాను"

వినుగ్గా చూసి హాస్టల్ కెళ్ళి పోయింది.

ఆమె వయసు పదహారేళ్ళే! ఇంటర్‌లో స్టేట్ ఫస్ట్ వచ్చింది. మెడిసిన్‌లో సీట్‌దొరకగానే ఎంతో సంతోషపడిపోయింది. తనిక డాక్టర్ అయినట్టే సంబరపడింది. అత్తయ్య మాత్రం అడ్డుచె ప్పింది. మోహన్‌కిచ్చి పెళ్ళిచేయాలని ఆవిడ ఆలోచన.

"మొగుడూ పెళ్ళాలిద్దరూ చదువుకుంటే ఎలా? ఇద్దరూ ఉద్యోగాలు చేస్తే జీవితం ఏం అనుభవిస్తారు? చక్కగా బావ డాక్టర్ అవుతాడు సుష్పింట్లో కూచుని నవలలు చదువుకుంటూ గడిపేయవచ్చు. అయినా బావని, కాబోయే భర్త నలా పేరుపెట్టి పిలవొచ్చా?" అనేది. అత్తయ్యకే

మీ జవాబు చెప్పకుండా ఆవిడ ఊరు వెళ్ళినపుడు వచ్చి మెడిసిన్‌లో చేరింది తను.

సమీరకు చిన్నప్పటినుంచీ ఫ్రెండ్ అయిన రాధిక మాత్రం ధైర్యం చెప్పింది. ఎంత కష్టమొచ్చినా చదవమనీ, డబ్బు అవసరమైతే తనిస్తాననీ,

మోహన్ వెళ్ళిన నాలుగోనాడే టెలిగ్రామ్ అందుకుంది సమీర. తండ్రికి సీరియస్ అని చిరంజీవి ఇచ్చిన టెలిగ్రామ్ అది.




భయపడ్తూనే ఏడుస్తూనే వెళ్ళింది, ఎలాంటి దృశ్యం చూడాల్సి వస్తుందోనని. స్టేషన్‌కు అన్నయ్య వచ్చాడు. అతని కళ్ళు ఎర్రబడి ఉన్నాయి.

అడిగితే ఏమీ చెప్పకుండా ఫరవాలేదన్నాడు. గుండెల్ని అరచేతిత్తో పట్టుకుని వెళ్ళింది. తీరా ఇంటిదగ్గరి కెళ్ళేసరికి ఆశ్చర్యపోయింది. పెళ్ళి పందిరి, ఇల్లంతా బంధువులు, అరుగుమీద కునుకు తీస్తున్న వాద్యగాళ్ళు, ఆటలాడ్తూ గోలగా అరుస్తున్న పిల్లలు! ఆశ్చర్యంతో తలమునకలవుతూనే తండ్రిని వెదుక్కుంటూ వెళ్ళింది. బంధువుల మధ్య కూచుని మాట్లాడుతున్న తండ్రి కనిపించాడు. ఆమెని చూసి లేచి వచ్చాడు. దేవుడి గదిలోకి తీసుకెళ్ళి అక్కడవేసిన జంఖానామీద కూచున్నాడు.

"ఏమిటినాన్నా ఇదంతా? ఎవరికి పెళ్ళి?"

"నీకు, మోహన్‌కు"

"నాన్నా! ఉన్న ధైర్యమంతా దిగజారిపోగా ఏడుస్తూ కుప్పకూలిపోయింది.

"రాత్రికి ముహూర్తం పెట్టుకుని పెళ్ళికూతురొచ్చేది ఇప్పుడా?" అని గుమ్మంలోనే పిన్ని వరస అయ్యేఒకావిడ హాస్యం చేయటం వినగానే మతిపోయినట్టయిందామెకు.

ఈలోగా తనొచ్చిన కబురు తెలిసి అత్తయ్యా వదిన, బామ్మవచ్చారు.

"ఏమిటే అది? ఏం కొంపమునిగిందని పెళ్ళింట్లో ఆ శోకాలు. అశుభం కూడానూ! ఎప్పుడైనా బావతో నీపెళ్ళి తప్పదు. అది కాస్తా నాలాంటి ముసలాళ్ళు గుటుక్కు మనకముందే కానిస్తే బాగుంటుందని చేస్తున్నాము. ఉన్న ఒక్కగానొక్క పిల్ల పెళ్ళి చేస్తే మీనాన్నకూ బరువు తీరిపోతుంది. నాపిల్లని అలక్ష్యం చేస్తున్నారని ఏలోకాల్లోనో ఉన్న మీ అమ్మ ఆత్మ క్షోభించకుండా ఉంటుంది."

కుమిలికుమిలి ఏడుస్తున్న సమీర తలెత్తింది.

"నా చదువేం కావాలి బామ్మా?"

"పెళ్ళయాక ఇద్దరూ కాపురం పెట్టి చదువుకోవచ్చు. పెళ్ళి కాకముందు అందరు ఆడపిల్లలూ ఇలాగే అంటార్లేవే! ఆ మూడుముళ్ళూ పడిమొగుడి కౌగిట్లో చేరాక ఇక చదువూలేదు. చట్టుబండలూ లేదు. చిరంజీవి పెళ్ళి కళ్ళారా చూశాను, నీదికూడా చూస్తే ఈ లోకంలో నాపని అయిపోతుందిక"

"ఆఁ! అంతా చిత్రం! తనో పెద్ద చదువుల సరస్వతి అయినట్టు ఫోజు. మేమంతా పెళ్ళంటే సిగ్గుతో తలమునకలవుతూ ఆనందంగా చేసుకోలేదా? తను మరీ బడాయిపోతుంది. నేను చెప్పలేదా అమ్మా! మన మోహన్‌కు ఇంకెవరూ పిల్లనే ఇవ్వరా? లక్షలు ఎదురిచ్చి మరీ చేసుకుంటారంటే నా మాట వినలేదు."

వదినగారు నిష్ఠురంగా అంటున్న మాటలు వినగానే సమీర రోషపడిపోయింది. కోపం ఎరుగనట్టు ఎప్పుడూ శాంతం నిండిన చూపులతో, చిరునవ్వులతో ఉండే సమీర ఆక్షణంలో కోపంతో బాధతో కంపించిపోయింది.

"డాక్టరీ చదువంటే మామూలు చదువా అమ్మాయ్! ఉన్న జుట్టు కాస్త ఊడిపోతుంది ఆ వేడికి.. మీ బావ పడే బాధ చూస్తూనే ఉన్నావు. మగాడు వాడే తిప్పలు పడుతుంటే, ఆడదానివి నీవల్లేమవుతుందీ? పైగా బోలెడంత ఖర్చు కూడా. హాయిగా పెళ్ళి చేసుకుని, వేళకు శుభ్రంగా తిని నిశ్చింతగా వుడమంటే ఏదో ఖూనీ చెయ్యమని చెప్పినట్టుగా అల్లాడిపోతున్నావేమిటి?"

వాళ్లతో వాదించీ లాభం లేదనుకుని తండ్రి వైపు తిరిగింది.

"నాన్నా నా కిష్టంలేదీ పెళ్లి! చదువయ్యాక నీ ఇష్టం వచ్చిన వాడిని చేసుకుంటాను. దయచేసి ఆపుచేయించు నాన్నా"

"ఊరుకో అమ్మాయ్! పిచ్చిదానిలా మాట్లాడకు. అత్తయ్య తల్లిలా చూసుకుంటుంది నిన్ను. నా ఆరోగ్యం, బామ్మ ఆరోగ్యం అంతంతమాత్రంగా ఉన్నాయి. ఈ పెళ్లి అయితే నాకూ నిశ్చింత. మరో రెండేళ్ల తర్వాతయినా జరిగేదేకదా"

సమీర ఏడుపు, మొండితనం చూస్తుంటే ఆయనకు పిచ్చికోపం వచ్చింది. ఆడపిల్లలు పెద్దలముందు నోరు మెదపకూడదనుకుంటారాయన. అలాంటిది పెళ్లొద్దనటమా? మెడిసిన్ చదువుతానని ఏడిస్తే పోనీ అని చేర్పించినందుకే ఇలా మాట్లాడుతోంది. ఎప్పుడైనా తనమాటకెదురు చెప్పేందుకు సిద్ధపడేదా లేకపోతే!

"నేను చెప్పలేదా అబ్బాయి. ఆ డాక్టరీ పూర్తిచేస్తే ఇదిక మనమాట వినదని! ఆడది తిరిగీ, మగాడు తిరక్క చెడ్డాడని పెద్దలు ఊరికే అంటారా? ఇంకా నయం! లే! అవతల వేళమించిపోతుంది. నీకు మంగళస్నానం ఎప్పుడు చేయించాలి, పెళ్లికూతుర్ని ఎప్పుడు చేయాలి!" అంది బామ్మ.

"నాన్నా! దయచేసి ఈ పెళ్లి ఆపుచేయించు. ఈ ఒక్కసారికీ నా మాట మన్నించు నాన్నా!"

సమీర దుఃఖం వాళ్లకు జాలి కలిగించకపోగా కోపాన్ని, చిరాకునీ పెంచింది.

"నువ్వు కానీ లేచివెళ్లి పెళ్లికి తయారుకాకపోతే తెల్లారేసరికి నా శవమే చూస్తావు. నువ్వు పెళ్లికూతురివయ్యేదాకా పచ్చి గంగ కూడా ముట్టను నేను"

సమీర విస్తుపోయి చూసింది. ఆమె దుఃఖం హఠాత్తుగా ఘనీభవించిపోయినట్లనిపించింది. ఆ తర్వాత ఇక ఆమె వారేది చెబితే అది చేసింది యంత్రంలా.

అన్నగారి ప్రతిభకు గర్వంగా నవ్వుకుంది అత్తగారు.

తన కొడుకు ధీరత్వాన్ని మెచ్చుకుంది బామ్మగారు.

తిక్కణీగిందా అన్నట్టు చూసింది వదినగారు.

ముత్తానికి పెళ్లికూతుర్ని చేసి కూచోబెట్టారు. ఆమె ఎటూ కదలకుండా వదినను కాపలా ఉంచారు.

ఏదో పనిమీద గదిలోకి వచ్చిన చిరంజీవిని చూసి సంతోషించింది రజని.

"సమయానికి కనిపించారు. ఒక్కక్షణం ఇక్కడ నిలబడండి. బాత్‌రూమ్‌కెళ్లి వస్తాను" అంటూ వెళ్లింది.

సమీర మౌనంగా కళ్లెత్తి అన్నగారివంక చూసింది.

అతని ముఖం ఎంతో గంభీరంగా ఉంది. బలిపశువులా మెడలువంచి ఆమెకీ పెళ్లి చేయటం అతనికీ కష్టంగానే ఉంది. కానీ చండశాసనుడైన తండ్రి మాట జరగాల్సిందే. అందుకే తన ఇష్టాఇష్టాలతో ప్రమేయం లేకుండా రజని ఇంటి కోడలయింది.

బ్యాంక్ ఉద్యోగి అయిన తనకు కూతుర్ని కట్టబెట్టి, మేనకోడలిని కొడుక్కు చేసుకుంటే అన్నగారి ఆస్తి తన ఆస్తి ఒక్కటిగా ఉంటుందని ఆవిడ ఉద్దేశం!

'తన డాక్టరు కొడుక్కు కట్నం లేకుండా కోడలిని చేసుకుంటోందని' అన్నగారికి అభిమానం!

"అన్నయ్యా!"

ఆలోచనల్లోంచి బయటపడి చూశాడు చిరంజీవి.

"అన్నవైఉండీ నాకొక్క ఉపకారాన్ని చేయలేకపోయావు"

"నేనేం చేయాలమ్మా?"

అతని గొంతు రుద్ధమైంది.

"ఈ పెళ్లి సంగతి చెబితే స్టేషన్నుంచి అలాగే వెళ్లిపోయేదాన్నికదా"

"ఎన్నాళ్లని తప్పించుకుంటావమ్మా. అందర్నీ ఎదిరించి నువ్వు ఎంతకాలం చదువుకోగలిగేదానివి"

రజని వస్తున్న అలికిడైతే అతను మౌనంగా ఉండిపోయాడు.

"బయట అందరూ హాయిగా కబుర్లాడుకుంటున్నారు. నాకే వచ్చింది ఈ కాపలాకాసే గొడవ!" అని గొణుక్కుంటూ వచ్చింది రజని.

"వెళ్లండి ఇకమీరు" అని పంపించేసింది రా గానే.

ఊరినుంచి వచ్చినదానికి రెండుసార్లు కాఫీ ఇచ్చారు అడిగితే. పెరట్లోనుంచి వస్తున్న తా ళింపుల ఘుమ ఘుమలకు సమీరకు బాగా ఆకలేసింది.

'అంత దుఃఖంలో ఉన్నా శరీరం తన ధర్మం తాను నిర్వర్తిస్తోంది' అనుకుంది విరక్తిగా.

ఆకలేస్తూందని రజనికి చెప్పింది. ఆమె లోప లికి కబురు పంపింది. ముహూర్తం అయ్యేదాకా ఏమీ తినకూడదన్న సమాధానం వచ్చింది.

ఈలోగా పెళ్లి తంతు మొదలైంది.

మరి కాసేపటిలో పెళ్లికూతురి కోసం కబురు వచ్చింది. ఆకలితో కళ్లు తిరుగుతున్న సమీరను చెయ్యిపట్టి నడిపించాల్సి వచ్చింది. మంచినీళ్లు అడిగి తాగింది.

"ఇదెక్కడి ఆకలే! మేమంతా పెళ్లంటే ఆకలి, నిద్ర ఎగిరిపోయి సరదాపడ్తూ కూచునేవాళ్లం పందిట్లో. నీలా ఏడ్చేదాన్ని నిన్నే చూస్తున్నాం" అంది ఎవరో దూరపు బంధువు, చతురోక్తి విసిరా ననుకుంటూ.

చుట్టూ ఉన్నవాళ్లు నవ్వులు- అదో గొప్ప జోక్ అన్నట్టు!

అలా సమీర మనసుతో ప్రమేయం లేకుండానే పెద్దల్ని ఎదిరించగల ధైర్యంలేని చిన్నవయసులో ఆమె పెళ్లి మోహన్‌తో జరిగిపో యింది.



శోభనం వేడుకకూడా తీర్చాలనుకున్నారు. అందుకు సన్నాహాలూ చకచకా జరిగాయి.

కానీ ఏదేవుడో సమీర మొర విన్నట్టున్నాడు. బయటఉండాల్సి రావటంతో ఆ గండం అప్పటికి గట్టెక్కింది. స్నానంచేసిన మరునాడే పెట్టి పట్టుకుంది పరీక్షలని.

తోడుగా మోహన్‌ని బయలుదేరతీశారు- అతనికీ పరీక్షలేగా! ఇద్దరూ వెళ్లేది తిరుపతే అని.

వెళ్లేముందు కొడుకుని పిలిచింది ఇవతలికి.

"పిల్ల జాంపండులా ఉందని తొందరపడకు. మంచి ముహూర్తం చూసుకోకుండా తొందరపడ్డావంటే అరిష్టం! పరీక్షలు అని ఏడుస్తూందిగా. అవయ్యాకే పెట్టిస్తాం ముహూర్తం! ఓ బిడ్డకు తల్లైతే తనే సర్దుకుంటుంది."

తల్లి చెప్పినవాటన్నిటికీ తల ఊపాడు.

ఇష్టం లేకపోయినా అతనితో కలిసి తిరుపతికి ప్రయాణం చేయాల్సివచ్చింది. 'జీవితాంతం తప్పని ప్రయాణానికే సిద్ధపడాల్సివచ్చింది. ఇంకా ఇదొక లెక్కా' అనుకుని నవ్వుకుంది.

రైలుస్టేషన్ చేరబోతుండగా మట్టెలు, మంగళసూత్రం తీసి హాండ్‌బ్యాగ్‌లో వేస్తున్న సమీరని వింతగా చూశాడు మోహన్. "ఏమిటది?"

"నిజంగా నామీద ప్రేమఉంటే మన పెళ్లి అయిన విషయం నీ చదువయ్యేదాకా ఎవరితోనూ అనకు. మా నాన్న కోసం ఇదంతా భరించాల్సి వచ్చింది. కాదూ కూడదని బలవంతంచేస్తే- ఏమైనాసరే చేయవల్సివస్తుంది. పిల్లీ కూడా అవసరమొస్తే ఎదురు తిరుగుతుంది. నా మాట వినకుండా నువ్వేమైనా కాలేజీలో అన్నావని తెలిస్తే చావటానికైనా వెనుదీయను నేను."

"ఆడదానివి నీకే అంతగీర ఉంటే నాకెంత పొగరుండాలి. ఆడది దొరకదని కాదు నిన్ను చేసుకుంది. అమ్మమీద గౌరవంతో చేసుకున్నాను. ఆడదంటే ఎరుగని చవటననుకోకు. ఎందరినో చూశాను నీలాంటివాళ్లను."

"సంతోషం! నీ చదువు పూర్తయి ఉద్యోగం దొరికేదాకా నా జోలికి రాకయితే!"

"నువ్వు కాళ్లమీదపడి ఏడ్చేదాకా రాను"

"అయితే ఆ రోజు నీ జన్మలో రాదు"

మోహన్ పళ్లు పటపటలాడించి తన సూట్‌కేస్ తీసుకుని దిగిపోయాడు.

రాధిక ఒక్కదానికే తనకు జరిగిన బలవంతపు పెళ్లి గురించి చెప్పింది. రాధిక చాలా తేలికగా తీసుకుంటూ, "మైనారిటీ తీరకుండా చేస్తే ఆ పెళ్లి చెల్లదు. నువ్వేం భయపడకు. నీకు ఏతేదీన పెళ్లి జరిగినదీ రుజువు చేసేందుకు శుభలేఖ లేదా లగ్నపత్రిక సంపాదించి పెట్టుకో. నీకు మైనారిటీ తీరాక కోర్టుకు వెళ్లి విడాకులు తెచ్చుకుందువుగాని" అంది.

ఆ ఆలోచన తనకీ కాస్త నిశ్చింతను ప్రసాదించింది.

"మీ బావంటే నీకిష్టంలేదా? మంచివాడు కాదా?"

"అన్ని వ్యసనాలూ ఉన్నాయతనికి. చదువులో అన్నీ అత్తెసరు మార్కులే. ఇవేవీ నన్ను బాధ పెట్టలేదు. కానీ జీవితంలో భార్య అనే వ్యక్తికి ఇవ్వాల్సిన ప్రత్యేకత ఏమిటో అసలు తెలియని మూర్ఖుడు"

"బలవంతపు పెళ్లి చేసుకోవటంలోనే తెలుస్తోంది ఆ విషయం" కాసేపాగి అంది రాధిక. "ఈ విషయంలో నేనదృష్టవంతురాలిని. మా బావకు నేనంటే ప్రాణం. చాలా తెలివికలవాడు. కానీ మా ఇద్దరికీ వయసులో చాలా తేడా ఉంది. ఆప్తాలమీలో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసేందుకు సీటు రావటంతో అమెరికా వెళ్లాడు. అదయ్యాక రీసెర్చి చేస్తానంటున్నాడు.

"కానీ మా పెళ్లి నాన్నకిష్టంలేదు. బాగా డబ్బున్న కుటుంబంలో ఇవ్వాలని ఆయన ఉద్దేశం. నాన్న నా పెళ్ళి పోస్ట్‌పోన్ చేయవచ్చనే ఉద్దేశంతో అనుకుంటాను- నేను డాక్టర్ని అయితే తప్ప చేసుకోనని అన్నాడు బావ. తనను మెప్పించేందుకు మెడిసిన్‌లో చేరాను."

సమీర అంతా విని చివరికి, "పోనీ! నాలా కాకుండా నువ్వన్నా అదృష్టవంతురాలివవుదువు గాని" అని నిట్టూర్చింది.

బయోకెమిస్ట్రీ పరీక్ష ముగిసింది. ఫిజియాలజీ, అనాటమీ ఇంకో ఆరునెలల్లో ఉంటుంది. సమీర శ్రద్ధగా చదువుకుంటున్న క్షణంలో ఆ కబురు వచ్చింది. తండ్రి మరణించాడనీ, దానికి గుండెనొప్పి కారణమని.

ఇంటికి వచ్చిన సమీరను ఎవరూ ఏమీ

అనలేదు. తండ్రి పోయిన దుఃఖంలోంచి తేరుకోనీ అనుకున్నారు.

కానీ తండ్రి మరణించిన ఆరునెలలకే అత్తగారు తిరపతి వచ్చి, ఇల్లు మాట్లాడిపెట్టి, కొడుక్కు కోడలికి ఆ అద్దెఇంట్లోనే కార్యం ఏర్పాటుచేసింది. ఆ రోజుకు రజని, చిరంజీవి వచ్చారు.

మళ్లీ ఓ పెద్ద ఘర్షణ! అలంకరించి గదిలోకి పంపిన సమీరని మోహన్ తాకలేకపోయాడు. దానికి కారణం వ్యసనాల కారణంగా వచ్చిన కొత్త జబ్బులు.

కానీ ఆ విషయం అత్తగారికి తెలియదు. వారిద్దరూ దంపతులయ్యారనుకుని, వదలి వెళ్లిపోయారు మూడురోజులు గడిచాక.

వాళ్లు వెళ్లాక సమీర అతను వాడుతున్న మందులు చూసి, వాటి గురించి ఎంక్వయిరీ చేస్తే విషయం తెలిసింది. అతను ఎవరిదగ్గర ట్రీట్‌మెంట్ తీసుకుంటున్నది కూడా తెలుసుకోగలిగింది.

ఆతర్వాత దాన్ని ఆయుధంగా వాడుకుని, ఆ విషయం అత్తయ్యతో చెబుతానని బెదిరిస్తూ అతని బారినుంచి తప్పించుకోగలిగింది. తల్లి ధారాళంగా పంపుతున్న డబ్బును పంపటం మానేస్తుందన్న భయంతో ఆమె బెదిరింపులకు లొంగిపోయాడతను. దగ్గరికి వచ్చావంటే ఉరిపోసుకుంటానని సమీర బెదిరించటం కూడా ఒక కారణమైంది అతను దూరంగా ఉండేందుకు.

పదిహేడేళ్ల వయసులో అప్పుడే వికసిస్తున్న పువ్వులా ఉన్న సమీరమీద కోరిక కలిగినా అది తీరే మార్గంలేక ఆమెను ఆమె క్లాస్‌మేట్స్‌తో కలిపి అసభ్యంగా తిడుతూ నిద్రపోతున్నప్పుడు సిగరెట్‌తో కాలుస్తూ, ఇంటికే ఆడవాళ్లని తెచ్చుకుని ఆమె కళ్లముందే వారితో అసభ్యంగా ప్రవర్తిస్తూ ఆమెకు మనశ్శాంతి లేకుండా చేశాడు.

అతను ఎలాగో ఫోర్త్ఇయర్ పాస్అయి ఫిఫ్త్ ఇయర్‌లోకి వచ్చాడు.

ఈమధ్య కొత్తగా తాగుడు నేర్చుకున్నాడు. తాగివచ్చి చిందులాగేసి నానాఅల్లరీ చేసేవాడు. ఇంట్లోనే శత్రువుని పెట్టుకుని ఆమె ఎటూ తప్పించుకోలేక, నాలుగు గోడలమధ్య పిల్లికి దొరికిపోయిన ఎలుకలాగా మానసికంగా నలిగిపోతుంటే కసిగా నవ్వుకునేవాడు.

అతని గురించి కాలేజీలో అందరికీ తెలుసు. తన తోటి స్టూడెంట్స్ తన వెనుక చేస్తున్న కామెంట్స్‌తో, వెక్కిరింతలతో సతమతమవుతూనే క్లినికల్‌లో ప్రవేశించింది.

ఆమె మీద కోపంతో క్లాసెస్‌కు అటెండ్ కానివ్వకుండా బయట తాళంపెట్టి వెళ్లేవాడు అప్పుడప్పుడూ. అలాంటి సమయాల్లో గౌతమి, రాధిక నోట్స్ ఇచ్చి సహాయం చేసేవారు. సమీర హాస్టల్ వదిలాక గౌతమి మంచిఫ్రెండ్ అయింది రాధికకు. సమీర గురించి విని జాలితో కరిగి తనూ వీలైన సహాయం చేయసాగింది.

అప్పుడప్పుడూ తనిఖీకి వచ్చేది అత్తగారు. ఆ సమయంలో మోహన్ ఎంతో బుద్ధిమంతుడిలా నడుచుకునేవాడు.

ఫ్రెండ్స్‌ని ఇంటికి పేకాటకు తీసుకురావటం నేర్చుకున్నాడు మోహన్. పాత హింసలన్నీ వెనుకబడ్డాయి. సమీర అన్నిటినీ భరించటం మొదలుపెట్టగానే.

అందుకే ఈ కొత్తాట. పేకాటకొచ్చే వాళ్ళూ అతని క్లాస్‌మేట్స్. వారి ముందు భార్యని అసభ్యమైన మాటలతో తిడుతుంటే వాళ్ళు వెక్కిరింతగా నవ్వుకుంటూ ఎంజాయ్ చేసేవాళ్ళు ఆమె పడే బాధచూస్తూ.

వారికి కాఫీలు, టిఫిన్‌లు సప్లయ్ చేయాల్సి వచ్చినపుడు సమీరని మింగేసేట్టు చూసేవాళ్ళు. మోహన్ సిగరెట్లకనో, ఇంకే పనిమీదో అవతలికి వెళ్తే వెకిలిగా మాట్లాడే వాళ్ళు.

సమీర మనసు ఎంత మొద్దుబారినా ఈ నరకాన్ని భరించలేక పోయింది. వచ్చిపోతాన[illegible] ఏడ్చింది రాధిక దగ్గర.

రాధిక ధైర్యం చెబ్తూ "మొరిగే కుక్క[illegible] కరవవు. భయపడకుండా ఉండు. భయప[illegible] మరింత రెచ్చిపోతారు. వాళ్ళెంత అవమా[illegible] చేసినా వాళ్ళు కుసంస్కారులనుకుని [illegible] వాళ్ళు మాట్లాడే మాటలకు విలువ[illegible] ముని అసహ్యానికైనా, కోపానికైనా [illegible] భయపడ్డా అర్థముంది. నీవు [illegible] కుండా [illegible] భరిపించాలి. [illegible] వేసించుకు నీ తరుపున [illegible] రు. విడాకులు దొరికాక [illegible] అని ధైర్యం చెప్పింది.

• • •

పేకాట కోసం, తాగుడు కోసం అందిన చోటంతా అప్పులు చేశాడు మోహన్. అప్పులవాళ్ళు ఒత్తిడి తెస్తుంటే విధిలేక వాళ్ళడిగిన దానికి ఒప్పుకున్నాడు.

ఆరోజు రాత్రి తలుపుతీసిన సమీరకు తాగి తూలుతున్న మోహన్ ఫ్రెండ్ కనిపించాడు.

"ఆయన లేరు."

సమీర తేరుకునేలోగా లోపలికివచ్చి తలుపు గడియ వేశాడతను.

"మోహన్ చెబితేనే వచ్చాను. నాకు వెయ్యి రూపాయలదాకా బాకీపడ్డాడు. అది తీర్చలేకనే నీదగ్గరికి పంపించాడు."

మొద్దుబారిన మనసును కూడదీసుకుంటూ అతనితో పిచ్చిపట్టినదానిలా పెనుగులాడింది సమీర.

"మీ ఆయన చేసిన అప్పులు ఎలాగూ తీర్చలేడు. నువ్వెలాగూ మాకు లొంగిపోకతప్పదు. నేనేకాదు నాలాంటి వాళ్ళింకా ముగ్గురున్నారు. వీళ్ళుకాక బ్రాందీ షాపువాడు కూడా నీమీద మోజుపడుతున్నాడు."

"తోటి మెడికోను అవమానించేందుకు సిగ్గుగా లేదూ?"

"మెడికో అయినా మరెవరైనా ఆడది ఆడదే!

చివరికి కారం డబ్బా అతని మొహాన ధిమ్మరించి తప్పించుకుని పారిపోయి హాస్టల్‌కు వచ్చిపడింది.

అది జరిగిన నెలరోజులకే లాయర్ నోటీస్ పంపింది. ఈ పెళ్ళి చెల్లదని కోర్టుతీర్పిస్తూ మోహన్‌కు రెండునెలల జైలుశిక్ష, అతని తల్లికి జరిమానా విధించారు. ఆమెకు పెళ్ళి జరిగింది తండ్రి ఆధ్వర్యంలో కాబట్టి చిరంజీవికి శిక్ష పడలేదు.

ఆ తర్వాత మోహన్ మళ్ళీ సమీర జోలికి రాలేదు. ఆమెకు ఇంటినుంచి వచ్చే డబ్బుకూడా ఆగిపోయింది.

రాధిక తండ్రితో చెప్పి సమీర చదువు భారం తనమీద వేసుకుంది. ఫీజులు, హాస్టల్‌కు కట్టేడబ్బుతప్ప ఆయనకు వేరే పెద్దఖర్చు కాలేదు. అందులో ఆమెకు మెరిట్ స్కాలర్‌షిప్ ఉంది. ఆమెకు వచ్చిన మార్కులు, చదువుమీదున్న శ్రద్ధచూసి రాధిక తండ్రి ముచ్చటపడ్డాడు.

రాధిక పుస్తకాలే తనూ షేర్‌చేసుకుంది. పరీక్షలపుడు లైబ్రరీకెళ్ళి చదువుకుని ఇంపార్టెంట్ పాయింట్స్, నోట్స్ రాసుకునేది.

ఈవిధంగా రాధిక స్నేహంతో చేసిన సహాయంతో నిశ్చింతగా చదువుకుని, మొత్తానికి యూనివర్శిటీ ఫస్ట్‌వచ్చి తన ధ్యేయం నెరవేర్చుకోగలిగింది. ఇంకో ఏడాదిలో హౌస్‌సర్జన్సీ కూడా ముగిసింది.

కానీ ఆమెకు పి.జి.చేయాలన్న కోరిక ఉండటంతో రాధిక ఆమెతోపాటూ తనూ చదువుకుంటానంది అలాఅయితే తండ్రి డబ్బు పంపిస్తాడని.

సమీర చదువుకున్నన్ని రోజులు వక్రబుద్ధికల స్టూడెంట్స్ చేసిన కామెంట్స్, హేళన భరిస్తూ రావల్సి వచ్చింది.

అందుకే రాధిక పి.జి.హైదరాబాద్‌లో చేద్దామంది. వాతావరణం మారితే అయినా ఆమె మనస్థితి కోలుకుంటుందనుకుంది.

అత్తెసరు మార్కులతో పాస్‌అయిన మోహన్ గ్రీన్ కార్డున్న వయసు మీరిన అమ్మాయిని చేసుకుని అమెరికా వెళ్ళిపోయాడు.

సమీర నిశ్చింతగా పి.జి.చేస్తున్న సమయంలో మధుకర్ పరిచయమయాడు.

ఆమె జీవితంలో అదింకో ప్రకరణం!

అతని మంచితనం, సంస్కారం, తెలివితేటలు, నిజాయితీ ఆమెను అతనివైపు ఆకర్షింపబడకుండా ఆపలేకపోయింది.

తన గతం తెలిస్తే అసహ్యించుకుని వదిలేస్తాడేమోనని భయపడేంతగా ఆమె అతనివైపు ఆకర్షింపబడింది.

అతను గొప్ప అందగాడనికాదు. నిజానికి అందంచూసి ఆకర్షింపబడే వయసు కాదు. ఆమెకా మనస్థితే లేదు.

ఎడారిలో ఎన్నో యుగాలపాటూ నడిచి అలిసిపోయి దాహంతో సొమ్మసిల్లి పడిపోయే పాంథునికి ఒయాసిస్సు కనిపిస్తే ఎటువంటి భావన కలుగుతుంది?

సరిగ్గా అటువంటి భావన, సెక్యూరిటీ ఫీలింగ్ కలిగేది సమీరకు అతని సమక్షంలో!

ఆప్యాయతనూ, అనురాగాన్ని వర్షించే ఆ కళ్ళు ఆకట్టుకున్నాయి ఆమెను. పుట్టి ఊహ తెలిశాక ఆమెని అంతటి ప్రేమతో, అనురాగంతో ముంచెత్తిన వారెవరూ లేరు. అది ఆమెకు తొలి అనుభూతి!

తల్లిని పోగొట్టుకున్న దిగుల్లో, చాలీచాలని ఆర్థికస్థితిలో, తండ్రి హుంకరింపుల్లో, అన్నగారి నిర్లిప్త వైఖరిలో ఆమె బాల్యం గడిచింది.

ఏడుపు, మొత్తుకోళ్ళ మధ్య జరిగిన పెళ్ళి, వయసుకు మించిన సమస్యలెదుర్కోవల్సి రావటం, జుగుప్స, అసహ్యాల మధ్య గడిచిపోయింది తొలియవ్వనదశ!

కోరికలతో, తీయటి ఆశలతో ఉరకలేసే వయసు తొందరలేవీ అనుభవానికి రాకముందే ఆమె మనసు, శరీరం జడత్వంలో కూరుకుపోయాయి.

అటువంటి సమయంలో పెనుగాలిలా ఆమె జీవితంలోకి దూసుకు వచ్చాడు మధు. ఆమె — తను పొందలేకపోయిన అన్ని రకాల అనుభూతులనూ అతని స్నేహంలో పొందగలిగింది.

బీటలువారిన భూమిని వర్షధారలు తడిపి సస్యశ్యామలం చేసినట్లుగా ఆమె హృదయాన్ని అతని చేరువ, అనురాగం, అభిమానం ప్రభావితం చేశాయి. ఆ పులకరింతలో ఆమెకు కాలం ఎట్లా గడిచిపోయిందీ తెలియలేదు.

తన గురించి తెలిసీ తననతడు స్వీకరించిన విధం ఆమెను ఆశ్చర్యంలో ముంచెత్తింది. అతని పట్లఉన్న అనురాగాన్ని మరింత పెంచింది.

ఉక్కిరి బిక్కిరి చేసేటటువంటి విశ్వజనీయమైన ప్రేమలో, ఒక మహా వెల్లువలో, మునకే ఆనందమనిపించేంతటి పారవశ్యతలో కొట్టుకుపోయింది.

కానీ విధి అక్కడ కూడా ఆమెని చిన్నచూపు చూసింది.

శాపగ్రస్థలా జీవించటమే చివరికి మిగిలింది.

• • •

ఆకాశం నిర్మలంగా ఉంది. అతిథిలా చంద్రుడు రానే వచ్చాడు. అతని వెంట తారలూ వచ్చి నభను అలంకరించాయి.

ఆ తారలను దాటుకుని వెళ్ళిచూస్తే ఏముంటుంది?

జీవితం ముగిశాక ఏముంటుంది?

వేలకు వేలు విశ్వం నిండా పరుచుకున్న ఆ నక్షత్ర గోళాల మీద జీవితం ఎలా ఉంటుంది?

దిగంతాల ఆవలకెళ్ళినా మనసు ఎదుర్కొనే సమస్యలు, సంఘర్షణలు ఒకేలా ఉంటాయా?

ప్రాణం ఉన్నంత వరకూ అన్ని రకాల భావనలకూ, అనుభూతులకు స్పందించే ఆత్మ లేదా మనస్సు మరణానంతరం ఏమవుతుంది? అప్పుడు విముక్తి లభిస్తుందా దానికి? భూమ్యాకర్షణ నుంచి తప్పించుకుని వెళ్ళగలిగితే మనిషి పక్షిలా ఎగిరిపోగలడా? అన్ని లోకాలూ తిరిగి ప్రశాంతంగా జీవించగలిగేందుకు అనువైన చోటు ఏదో అన్వేషించుకోగలడా?

ఒక స్త్రీ! కేవలం స్త్రీ అయిన కారణాన సంఘంలో తనకో స్థానం సంపాదించుకునేందుకు తన ఉనికిని నిలబెట్టుకునేందుకు ఇన్ని సంఘర్షణలకూ, అవమానాలకూ లోనుకావాలా?

శరత్ విచలితుడై చూశాడామెవంక.

అతని కన్నులు కరుణ, దయ, అభిమానం వర్షిస్తున్నట్టుగా ఉన్నాయి. వాటిలో అంతులేని ఆర్ద్రత నిండి ఉంది.

"మీరు మధుకర్‌ని అలా నిర్దాక్షిణ్యంగా వదిలేసి ఎలా వెళ్ళగలిగేరు? స్త్రీ సహజమైన కోమలత్వం, కరుణ ఆ సమయంలో ఏమయాయి మీలో?"

"నా కారణంగా ఇంకో స్త్రీ జీవితం నాశనం కాకూడదనుకున్నాను."

"కానీ అతను ఆ ఇంటికి పెట్టుకున్నది మీపేరే"!

సమీర ఏమీ మాట్లాడలేక పోయింది.

"ఆప్థాల్‌మాలజీలో ఎమ్.ఎస్. చేశాడట కదా? ఓ స్నేహితుడితో కలిసి ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టుకున్నాడట. త్వరలోనే అతనికి మంచి సర్జన్ అని పేరు వచ్చిందట. దాంతో ప్రాక్టీస్ కూడా పెరిగింది. అతని స్నేహితుడు ఆర్మీలో సెలక్షన్ వచ్చి వెళ్ళిపోతూ ప్రాక్టీస్‌లో పార్ట్‌నర్‌షిప్ వదులుకు

న్నాడు. రోజురోజుకీ పెరుగుతున్న ఆదాయాన్ని మీ పేరుమీద నర్సింగ్‌హోమ్ ఓపెన్‌చేసి పేదలకు ఉచితవైద్యం చేయాలనే పోగుచేస్తూ వచ్చాడు. ఆ డబ్బుతోనే ఈ ప్లాట్‌కొని బిల్డింగ్ కట్టాడుట!

ఆరోగ్యం మరీ దిగజారిపోవటంతోపాటు తాగుబోతన్న బిరుదు కూడా వచ్చింది. తాగిన మైకంలోనే ఆపరేషన్లు చేస్తాడన్న రూమర్లు వచ్చాయి. చివరికొరోజు ఆ మైకంలోనే రోడ్డు మీద పోతున్న ఓ అమ్మాయిని 'సమీరా. సమీరా' అంటూ వెంటపడి చెయ్యి పట్టుకులాగాడట. ఆ అమ్మాయి తండ్రి పొలిటికల్ ఫీల్డ్‌లో పలుకుబడి ఉన్నవాడు కావటంతో అతన్ని పోలీసులు స్టేషన్‌కు తీసుకెళ్ళి ఇంటరాగేట్ చేశారు. దాంతో అతనికి చాలా చెడ్డపేరు వచ్చి ప్రాక్టీస్ మూలపడింది. ఈ బిల్డింగ్ అద్దెలకిచ్చి తాగుబోతుగానే ఉండిపోయాడు.'' అన్నాడు శరత్.

''ఇప్పుడతను ఎక్కడ ఉంటున్నాడు?''

''మన నర్సింగ్‌హోమ్‌లోనే చేరాడు. కానీ — లివర్, హార్ట్ కూడా పూర్తిగా దెబ్బ తిన్నాయి. మహా బ్రతికితే ఓ పదిరోజులు. అసలు కోమాలోకి జారిపోతాడని అనిపిస్తూంది.''

సమీర స్తబ్ధురాలై కూచుండిపోయింది.

''ఆ బిల్డింగ్ మీ పేరుమీద రాస్తానన్నాడు. అదే జరిగితే ఇకనుంచీ నాతో పార్ట్‌నర్ అవొచ్చు మీరు.''

సమీర అప్పటికీ మాట్లాడ లేదు.

మౌనంగా లేచి నిలబడింది.




సమీర ఇంటికి వెళ్ళేసరికి అలివేలు ఏడుస్తూంది. ఆమెకు గుండె ఒక్కసారిగా ఆగిపోయినట్లయింది.

''ఇప్పుడే మీ కోసం ఫోన్ చేశానమ్మా.''

''ఏమైంది? ఎందుకు?''

''చినబాబు స్విమ్మింగ్ పూల్‌లోకి ఎత్తుమీది నుంచి దూకి స్పృహతప్పి పోయాడటమ్మా. చుట్టూ ఈత కొడుతున్న వాళ్ళు గమనించి, ఒడ్డుకు చేర్చి హాస్పిటల్‌లో చేర్పించారట.''

ఆమెకు కాళ్ళకిందున్న భూమి కదిలిపోయినట్టనిపించింది. ఆ వార్త విన్న షాక్ నుంచి తేరుకునేందుకు మూడు నిమిషాలు పట్టింది.

''మీ కోసమే చూస్తూ కూచున్నాను. త్వరగా వెళ్దాం పదమ్మా. ఉస్మానియాలో చేర్పించారట.''

వెంటనే కారు తీసుకుని బయలుదేరింది.

ఉండీ, ఉండీ ఆమెకు కాళ్ళు చల్లబడి పోతున్నాయి. గుండె పట్టేసినట్టవుతోంది. మెదడు మొద్దుబారిపోయి రోడ్డుమీదున్న వాహనాలేవీ కంటికి కనిపించటం లేదు.

భయం, అనిశ్చిత కలగలిసి తనకింతటి షాక్ కలిగించటం ఇదే మొదటిసారి. ఆ షాక్‌వల్లే తనిలా అవుతుందని గ్రహించి తనను తాను కంట్రోల్ చేసుకునేందుకు క్రితం రాత్రి చదివిన నవల గుర్తు చేసుకునేందుకు ప్రయత్నించింది. కానీ అయిదు నిమిషాల్లోనే ఆమెకు కొడుకు తనతో ఆ నవల చదవబోయే ముందు మాట్లాడిన మాటలు కూడా గుర్తుకొచ్చాయి.

నిశ్శబ్దంగా నవల చదువుకుంటున్న తల్లి దగ్గరికి వచ్చి ఒడిలో తలపెట్టుకుని పడుకున్నాడు వంశీ.

ఆ పసివాడేదో టెన్షన్‌తో, దిగులుతో బాధపడుతున్నాడని గ్రహించి నవల పక్కకుపెట్టి కొడుకును లేవనెత్తి వక్షం మీద పడుకోబెట్టుకుని, చుట్టూ చేతులు బిగించి, నుదుటిమీద ముద్దుపెట్టుకుంది.

''ఏం నాన్నా? నిద్ర రాలేదా?''

''అమ్మా! దేవుడు మనకేదైనా ఇచ్చాడంటే మనం దేవుడికి ఏదైనా ఇవ్వాలంటకదూ?''

''ఎవరన్నారలా?''

''సంజూ వాళ్ళ మమ్మీ.''

''ఎందుకు చెప్పిందలా?''

''సంజూకు తిరపతికి తీసికెళ్ళి గుండు చేశా

రుగా, అది ఎందుకని అడిగితే చెప్పింది. నంజాకు జాండీస్ వచ్చినపుడు జుట్టు ఇస్తానని మొక్కుకుంటే దేవుడు బాగు చేశాడట. వాళ్ళ డాడీకి కూడా ప్రమోషన్ వచ్చినందుకే జుట్టు ఇచ్చాడట స్వామికి. బాబర్ కథ కూడా చెప్పింది వాళ్ళ మమ్మీ."

"ఏమిటది?"

హుమయూన్‌కు బాగా జబ్బు చేస్తే అల్లాకు ప్రార్థనలు చేసి తన ప్రాణం తీసుకుని కొడుకుని బాగుచేయమని మొక్కుకున్నాడట బాబరు. అందుకే రోజురోజుకూ హుమయూన్ కోలుకుంటుంటే బాబర్ ఆరోగ్యం పాడైపోయి చనిపోయాడట."

"అవన్నీ ఒట్టి నమ్మకాలు, కథలు నాన్నా! దేవుడు అంత చెడ్డవాడు కాదు. ఎవరికేదివ్వాలో అది ఇస్తాడు."

కాసేపు మౌనంగా ఉండి మళ్ళీ సందేహంగా అన్నాడు.

"నువ్వు దేవుడికి ఏమీ ఇచ్చుండవ్!"

"ఎప్పుడు?"

"నాన్నకు జబ్బుచేసినప్పుడు" వంశీ కళ్ళ నిండా నీళ్ళుపొంగి బుగ్గలమీదికి కారాయి. ఆ చిన్ని మనసులో పొంగుతున్న దుఃఖం అర్థంచేసుకుని, చలించిపోయి, గుండెలకు మరింతగా హత్తుకుంది— వాడి బాధంతా తను తీసేసుకోవాలనుకుంటున్నట్టు.

"నీకు... నేను... వద్దా చిన్నా?"

" నువ్వు కావాలి. నాన్నా కావాలి. ఇద్దరూ కావాలి. నాన్నెక్కడున్నాడో చెప్పు. నువ్వే ఎక్కడో దాచేశావంటుంది రోజావాళ్ళ మమ్మీ."

సమీర నిశ్చేష్టురాలై కూర్చుండిపోయింది.



"నేను నాన్న దగ్గరే ఉంటానని, నీదగ్గరకు రానంటానేమోనని నీకు భయమా? నేనలా చెయ్యను. ఊరికే ఒకసారి చూసి మాట్లాడతానంతే! నేను నీదగ్గరే ఉంటాను. నాన్నను చూపించవూ! ఒక్కసారి."

"ఎక్కడున్నాడని చూపించాలమ్మా. నాకు నిజంగా తెలీదు. అమ్మని నమ్మవు కదూ!"

"మన దగ్గర నాన్న ఫొటో కూడా లేదా?"

తల అడ్డంగా ఊపింది సమీర. ఆమె కళ్ళల్లోకి పొంగి వస్తున్న కన్నీళ్ళు చూసి వంశీ మనసు మెత్తబడింది.

" అయితే ... నేను వెళ్ళి నాన్నను పంపించనా నీదగ్గరికి?"

వాడి నోరు చప్పున మూసింది.

"తప్పమ్మా! అలాంటి మాటలనకు. నువ్వు పంపించమన్నా నాన్నను దేవుడు తన కిష్టం లేకపోతే పంపించడు. నన్నొదిలి ఎక్కడికీ వెళ్ళనని చెప్పు."

తల్లిముఖంలోని ఆందోళన, భయం ఆ పసివాడిని బాధపెట్టాయి.

ఆమె మెడచుటూ చేతులు చుట్టి అతుక్కుపోయాడు.

అలాగే నిద్రలోకి జారిపోయాడు.

రాత్రంతా కుమిలిపోతూనే గడిపింది సమీర వంశీని చూస్తూ.

బాల్కనీలో నిలబడి ఎదురిళ్ళలోకి, ఇరుగుపొరుగు ఇళ్ళలోకి స్కూటర్లమీద, సైకిల్‌మీద, కాలినడకన ఇళ్ళకు చేరుకొనే తండ్రులను, వారికి పరుగున ఎదురు వచ్చే పిల్లలను ఎత్తుకుని లోపలికి తీసుకెళ్ళే తండ్రులనూ నిస్తేజంగా చూస్తూ నిలబడిపోయే వంశీని ఎన్నోసార్లు గమనించింది.

వంశీని పార్కుకో, జూకో తీసుకెళ్ళి ఆకాసేపూ దిగులు మరిచేలా ఆడించేది.

ఒకటి, రెండు రోజులు సంతోషంగా ఉండి మళ్ళీ మామూలుగా అయ్యేవాడు.

సమీర తన పనులన్నీ పక్కకుపెట్టిఎన్ని కబుర్లు, కథలు చెప్పినా, ఎన్ని ఆటలు ఆడించినా తండ్రి కోసం బెంగ మనసులోనే పెంచుకున్నాడు.

"సునీత వాళ్ళింటికి వాళ్ళ పిన్ని బాబాయ్, మామయ్య, అత్తయ్య, అందరూ వచ్చారు. అందుకే వాళ్ళింట్లో పండగ చేసుకున్నారట. వాళ్ళ పిన్నీ వాళ్ళ బాబు ఎంతముద్దుగా ఉన్నాడో! మనమూ తెచ్చుకుందాం అమ్మా అలాంటి బాబుని!"

'మా మమ్మీని డాడీ వదిలేశారట. అందుకే నాకు చెల్లీ, తమ్ముడూ ఎవరూ లేరు' టాన్సిల్స్ ఆపరేషన్ చేసిన ఓ బుల్లిబాబు స్మృతి పథంలో మెదిలాడు.

"అమ్మా !గోపీ ఇవాళ ఆడుకోడట. వాళ్ళ అత్తయ్య, మామయ్యలతో కలిసి రైలెక్కి ఊరికెళ్ళాడట. నాకు ఎవరూలేరా? పిన్ని, బాబాయి, అత్తయ్య, మామయ్య, నానమ్మ, తాతయ్య, అమ్మమ్మ ఎవరూ లేరా?"

"... ... ... ..."

"ఎందుకు లేరమ్మా!?"

"... ... ... ..."

"పిల్లలు ఇలా అడగకూడదా? తప్పా? అమ్మను ఏడిపిస్తే పాపం వస్తుందా?"

ఆ బుల్లి చేతులు తన కళ్ళ నీళ్ళు తుడిచేవి.

"అమ్మా! పక్కింటి రాధా వాళ్ళు నన్ను ఆడుకోనివ్వటం లేదు. నువ్వు చెడ్డదానివట. అందుకే నాన్నని దేవుడు తీసికెళ్ళాడట."

అంటూ తన కుచ్చిళ్ళల్లో దూరి ఏడ్చే పసివాడి కన్నీళ్ళు ఎలా తుడిచేది? వాడికి అర్థమయ్యేలా ఎలా చెప్పాలి? తన తల్లిని మంచిదికాదన్నారన్న దుఃఖం ఆపిల్లవాడి మనసును గాయపరుస్తుంది.

ఒకోసారి ఇండియాకి వచ్చి తప్పు చేసిందేమోనన్పించేది.

"మనింటికెవరూ రారేం? శరత్ అంకుల్‌కూడా రారు. ఆయనకూ నీమీద కోపమా?"

రోజురోజుకీ వంశీలో చురుకుదనం తగ్గిపోతుందని తెలిసి తన బాధను ఎవరితో పంచుకోవాలో తెలియక కుమిలిపోతున్న సమయంలో శరత్ అన్నాడు.

"మీ వంశీకి తండ్రి లేనిలోటు బాగా తెలిస్తోందిప్పుడు. తన చుట్టూ ఉన్న మగవాళ్ళందరిలోనూ తన తండ్రి రూపుని, తన తండ్రి మనసుని

ఊహించుకునే ప్రయత్నం చేస్తున్నాడు... ...

"మీరుకూడా వచ్చి మా ఇంట్లో ఉండండీ! నేను చక్కగా మీతో, మమ్మీతో కలిసి నతఆడుకోవచ్చు. ఉండరా? మామీద కోపమా? అని అడిగాడు నన్ను."

అవును. గమనిస్తున్నాను. ఏం చేయాలో తెలియటం లేదు."

"మంచి రెసిడెన్షియల్ స్కూలుకు పంపితే? నార్త్‌లో అయితే మంచిది. ఎందుకంటే మన పక్క ఆడవాళ్లలా ఉండరు నార్త్‌లో."

పైకేమీ అనలేకపోయింది. మనసులో మాత్రం వంశీ లేని లోటు భరించటమా' అనుకుంది.

మీరు సరేనంటే డెహ్రాడూన్‌లో సీటుకోసం ట్రై చేస్తాను."

అప్పటికీ సమీర ఏమీ అనలేదు.

"నాకు తెలుసు. మీ బాధ నాకర్ధమవుతుంది. కానీ వంశీ మానసిక స్థితి గురించి కూడా ఆలోచించాలి మీరు. లేదా వంశీని దగ్గరుంచుకోవాలనుకుంటే ఒకటే దారి ఉంది మీకు."

"ఏమిటది?"

"మళ్ళీ పెళ్ళి చేసుకోవటం."

ఆమె ముఖం పాలిపోయింది వెంటనే. నిరుత్తరురాలైనట్టుగా చూసింది. "ఊ ...హూ! పెళ్ళంటేనే విరక్తి కలిగింది. అయినా ...చేసుకున్న వ్యక్తి ... వంశీని ఆదరించకపోతే."

"మీగురించి బాగా తెలిసిన వారిని, మీమీద వంశీ మీద బాగా ఇష్టం ఉన్న వారిని చేసుకోండి."

"ఎవరున్నారలాంటివారు. నాకే పరిచయస్తులు లేరు. ఇక మమ్మల్ని అర్ధంచేసుకునే సన్నిహితత్వం ఎవరికుంది?"

"అదే మీరు చేసిన పొరపాటు.మీకు సరే! ఎవరూ అవసరం లేదు. మీ బాబుకలా కాదుగా. చుట్టూ ఉన్న వాతావరణం తమింట్లో ఎందుకు లేదన్న ఆలోచన తప్పక కలుగుతుంది. మీరు తప్పుచేసిన వ్యక్తిలా, బహిష్కరింపబడ్డ వ్యక్తిలా ఎందుకు ఎప్పుడూ ముకుళించుకుపోయి ఉంటారు? మీ కాంప్లెక్స్‌తో మిగతా సమాజంతో కలవకుండా గిరిగీసుకుని ఎందుకు ఉండిపోయారు?

పిల్లలకలా కుదరదు. వారికెంతో ప్రపంచం కావాలి. వంశీ కోసమైనా సమాజంలో కలవండి మీరు"

హాస్పిటల్‌కి చేరుకునే వరకూ సమీరకు అలా ఏవో సంఘటనలు గుర్తొస్తూనే ఉన్నాయి.

★ ★ ★

డాక్టర్ స్ప్రింగ్ డోర్ తెరుచుకుని రావటంతో ఆదుర్దాగా లేచి నిల్చుని చూసింది.

"అబ్బాయికి ఎలా ఉంది డాక్టర్?"

"డ్రైవ్ చేసేటపుడు రాంగ్ డైరెక్షన్‌లో పడ్డాడు. తలకు కొంచెం దెబ్బ తగలటంతో స్పృహ తప్పాడంతే. మీరు ఇంటికి తీసికెళ్ళవచ్చు."

తల్లిని చూసి నవ్వాడు వంశీ. తల్లి కన్నీళ్లు కలవరపెట్టాయి.

"భలే వాడివే చిన్నా? అమ్మను, నన్ను [illegible] భయపెట్టావో తెలుసా?" అలివేలు వెళ్లి చం[illegible]ము కుంది.

మరునటి రోజు నర్సింగ్‌హోమ్‌కు వెళ్లినపుడు మధుకర్‌ని కలుద్దామనుకుంది. కానీ ఆమె వెళ్లేసరికి నిద్ర పోతున్నాడు.

అతన్ని కలవలేననిపించి వచ్చేసింది. వంశీని తీసికెళ్లి చూపించాలన్న ఆలోచనకే వణికిపోయింది.

'వంశీ మళ్లీ బెంగపెట్టుకుంటే ... ... ఇన్ని రోజులూ విడోనని చెప్పుకుని ఇప్పుడు ఇతనే వంశీ తండ్రి అని చెప్పటం బాగుంటుందా? శరత్ ఏమనుకుంటాడు తన గురించి? నవ్వుకుంటాడా? ఈ రకమైన సంఘర్షణతోనే నలిగిపోతూ ఆమె అతన్ని కలవలేక వచ్చేసింది.

ఇంటికి వచ్చేసరికి వంశీ నిద్రపోతూ కనిపించాడు. ఎంత లేపినా లేవలేనంత మొద్దు నిద్ర పోయాడు.

నిద్ర లేచాక కళ్ళు ఎర్రబడి ఉన్నాయి బాగా! తల్లిని గుర్తు పట్టనట్టుగా చూశాడు రెండు నిమిషాలు.

ఆమెకు భయమేసి నర్సింగ్ హోమ్‌కు తీసికెళ్లింది. విషయం తెలియగానే శరత్ మందలించాడు.

"నాకు నిన్ననే ఎందుకు చెప్పలేదు? నిన్నే తీసుకు రావల్సింది. అభిమానవంతురాలివే! కానీ ఇంత పరిచయం ఉండీ ఆ మాత్రం నీ కష్టం గురించి చెప్పుకోలేనంత మొహమాటం ఏమిటి?"

కోపంలో తను ఆమెను ఏకవచనంతో సంబోధిస్తున్నట్టు మరిచిపోయాడు.

అటువంటి సమయాల్లోనే మనుషులు మర్యాదకు అరువు తెచ్చుకున్న ముసుగు వదిలేస్తుంటారు.

ఎక్సరే తీసి చూశాడు. ఆమెకూ చూపించాడు. సందేహిస్తూనే అన్నాడు. "ఆపరేషన్ అవసరమవుతుందేమో!"

నో! వద్దు. ప్లీజ్!" సమీర చిన్నపిల్లలా అతని చెయ్యి పట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది.

అనుకోకుండా అతని చెయ్యి ఆమె తలమీద ఆప్యాయంగా రాసింది.

"వాడికేమైనా అయితే నేను భరించలేను. నేనూ చచ్చిపోతాను." ఉద్రేకపడుతూ కళ్ళు పెద్దవి చేసి పిచ్చిదానిలా అంటున్న సమీరను చూసి ఏం చెప్పాలో తోచనట్టుగా మూగవాడిలా చూస్తుండిపోయాడు.

'కన్న కడుపు తీపి తనకేం తెలుసు! గర్భంలో బిడ్డ తిరిగేటపుడు స్త్రీ మనోభావాలెలా ఉంటాయో తనకేం తెలుసు! పొత్తిళ్లలోని బిడ్డకు స్తన్యం ఇచ్చే మాతృమూర్తి ఆలోచనలు తనకేంతెలుసు! 'అమ్మా' అన్న పిలుపును ముద్దుగా పలికే పసిపాపడిని హృదయానికి హత్తుకుంటూ ఆ తల్లి అనుభవించే ఆనందం తనకేం తెలుసు? చేతులు సాచగానే తప్పటడుగులు వేస్తూ , బోసి నవ్వుతో వచ్చే పాపాయిని చూసి తల్లి పొందే గర్వంతో కూడిన ఆనందం ... తనకేం తెలుసు? బిడ్డని పోగొట్టుకోవల్సిన పరిస్థితి వస్తే తల్లి అనుభవించే మానసిక వేదన, ఆ నరకం?'

"ఊరుకో! ఎగ్జయిట్ అవకు. రావ్ దగ్గరికి వెళ్దాం ఇప్పుడే. అతను మంచి న్యూరో సర్జన్! ఈ ఎక్సరేలు చూసి ఏం అంటాడో."

అయిదు నిమిషాల్లో వాళ్లు 'అలివేలును వంశీ దగ్గరుంచి కారులో వెళ్లారు.

● ● ●

"చాలా మైనర్ ఆపరేషన్‌తో అంతా బాగవుతుంది. కానీ, నాకు అనుభవంలేదందులో! ఈ ఆపరేషన్లలో ఘటికుడు బాంబేలో ఓ డాక్టర్ ఉన్నాడు. నేను ట్రంకాల్ చేసి కేసు గురించి చెబుతాను"

" ప్లీజ్! అతని అడ్రెస్ ఇవ్వండి. అలాగే మేం వస్తున్నట్టు తెలియజేసి మాకు హెల్ప్ చేయమని కోరితే వియ్‌విల్‌బి థాంక్ ఫుల్ టు యు ఎ లాట్!"

శరత్ అలా అడగ్గానే అతను అడ్రెస్ డైరీలో వెదికి తీసి ఇచ్చాడు.

అతనికి కృతజ్ఞతలు చెప్పుకుని బయటపడ్డారిద్దరూ.

"వెళ్దాం. ఖర్చెంతయితేనేం! మన దగ్గర లేదా! వంశీ దక్కితే అంతే చాలు."

తనకన్నా ఎక్కువ ఆదుర్దా, టెన్షన్ శరత్ పడుతున్నాడని గ్రహించింది సమీర.

"మీరూ వస్తారా?"

"మరి? మీకొక్కరికే టెన్షన్‌గా అన్పించదా?"

"ఫరవాలేదు. నేను మేనేజ్ చేసుకోగలను. నర్సింగ్‌హోమ్ వదిలేసి వస్తే ఎలా?" కాస్తాగి మళ్లీ అంది "అతను కోమాలో ఉన్నాడట. నిజమేనా?"

శరత్ మౌనంగా తల వూపాడు. మళ్ళీ అన్నాడు. "నిన్న మిడ్ నైట్ నుంచి నీకోసం ఒకటి రెండుసార్లు నర్స్‌ని అడిగాడట."

సమీర మాట్లాడ లేదు.

"బహుశా ఇంకా రెండు రోజులు, మహా అంటే వారంరోజులు. చెప్పలేం! నిన్ను చూడాలన్న కోరిక తీర్చుకోలేక పోయాడు."

ఒకసారి నువ్వని, ఒకసారి మీరని అతను తనను సంబోధించటం అంత దిగుల్లోనూ గుర్తించింది.

"అన్ని ఏర్పాట్లూ చేసుకుంటే రేపటి ఫ్లయిట్‌కే వెళ్లే ఏర్పాటు చేయగలను. లేదా ఎల్లుండి."

"అలాగే!"

"అయితే నేను రానవసరం లేదా?"

"వద్దు"

"ఎప్పటికప్పుడు పరిస్థితి తెలియచేస్తుంటావుగా."

"తప్పకుండా."

ఆమె మధుకర్ గురించిన ఆలోచనలతో పరధ్యానంగా ఉండి బహుశా అలా పొడి పొడిసమాధానాలిస్తుందనుకున్నాడు. పాపం, మధుకర్ ఇంతకు ముందే పోయాడని తెలీదు. మరి మాట్లాడించగూడదీమెను. ఆ చావుకబురు తిరిగి వచ్చిన తర్వాత గానీ చెప్పగూడదు! అని మనసును రాయిగా మార్చుకున్నాడు శరత్.

"పోనీ బాంబే దాకా తోడుగా అయినా రానా! అన్నాడు శరత్ ఎర్‌పోర్టులో. ఒక్క దానివీ అన్నీ

చూసుకోగలవా?

"ఎందుకంత ఇదవుతారు? నేనేం ప్రపంచం వదిలి వెళ్లటం లేదు."

శరత్ ముఖం గంభీరంగా మారింది.

వంశీని తీసుకుని స్నాక్స్ కొనిచ్చేందుకు తీసుకెళ్ళాడు.

వెనకనుంచి వాళ్ళిద్దరినే కన్నార్పకుండా చూడసాగింది.

వంశీ భుజం మీద చెయ్యివేసి నడిపిస్తున్నాడు శరత్.

వంశీ ఏదో జోక్ చేసినట్టున్నాడు. పక్కకు తిరిగి వంశీ వంక చూస్తూ నవ్వుతున్నాడు. ఫ్లయిట్‌కు టైమవుతుండగా తిరిగి వచ్చారు. వంశీని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు. అలివేలుకు సమీర బాధ్యత అప్పగించాడు. చివరి నిమిషంలో అలివేలును పక్కకి తీసుకెళ్ళాడు.

"ఒకవేళ అనుకోనిదేదైనా జరిగితే... మీ అమ్మగారు కూడా ఏదైనా అఘాయిత్యం చేస్తారేమో! కాస్త చూసుకో."

కొంగుతో కళ్ళు గట్టిగా వత్తుకుని తలవూపింది.

ప్రయాణీకులను రమ్మన్న అనౌన్స్‌మెంట్ విన్పించింది.

శరత్ ఎందుకో ఇవేళ చాలా బాధగానూ, ఉద్వేగంగానూ ఉన్నట్టనిపించింది సమీరకు.

చివరి నిమిషంలో అతనేదో చెప్పబోయినట్టనిపించిందికాని పెదవి విప్పలేదు.

వెళ్తున్నది ఆగి వెనక్కి తిరిగి చూసింది.

వంశీ చేయి పట్టుకుని అలా నిల్చుని వెనక్కి చూస్తున్న సమీరను, మెడలోని కెమెరాతో ఫోటో తీశాడు.

ఆ తర్వాత వెను దిరిగి వెళ్ళిపోయి ఫ్లయిట్‌లో కూచుంది. డోర్ మూశారు. విమానం రన్‌వే మీద పరిగెత్తుతూ ఉంది.

వంశీకి సేఫ్టీబెల్ట్ కట్టి, తనూ కట్టుకుంది.

కొద్ది నిమిషాల తర్వాత తలతిప్పి వంశీ వంక చూసింది.

ఈ ప్రయాణం దేనికి దారి తీస్తుందా అనుకుంది.

వంశీ ఏదో గుర్తు కొచ్చినట్టుగా తన జేబులోంచి కాగితం తీసి తల్లి చేతిలో పెట్టాడు.

"ఏమిటి"

"అంకుల్ ఇచ్చారు. విమానంలో ఇమ్మని చెప్పారు."

ఆమె మనసు వణికిందెందుకో!

అందులో ఏం ఉందో చూడాలనిపించకపోయినా వంశీకోసం అందుకుని విప్పింది.

"నీలాకాశంలో చుక్కలు మెరుస్తున్నపుడు ఆరుబయట పక్క వేసుకుని తలకింద చేతులుంచుకుని అనుకుంటాను-నీకూ, నాకూ మధ్య కొన్ని యోజనాల దూరం ఉందేమోనని!

అందుకేనేమో! నా జీవితంలోకి ఆహ్వానిస్తూనే పంపిన సందేశం ఎంత కాలమైనా నిన్ను చేరలేకపోతున్నది.

ఎప్పటికైనా అది అందితే, నా ఆహ్వానాన్ని మన్నించి వస్తావు కదూ! నువ్వొచ్చే దారిలో నా కన్నులనే నక్షత్రాలుగా మార్చి అలంకరించి ఎదురు చూస్తాను-మార్గం అప్పుడు కాంతివంతమై నిన్ను సక్రమంగా గమ్యం చేరుస్తుంది!

నీకోసం సదానేను వేచి చూస్తుంటానని మరిచిపోవు కదూ!"

"అమ్మా! దేవుడి దగ్గరికి వెళ్తున్నామా?"

"ఛ! ఎందుకలా అంటావ్!"

"నాకు జబ్బు చేసిందనేగా నువ్వు ఏడుస్తున్నావు. నేను చచ్చిపోతాననేగా!"

వంశీని తలపట్టి దగ్గరికి తీసుకుంది.

"నేవెళ్ళి నాన్నను పంపిస్తాను లేమ్మా. నువ్వు ఒక్కదానివే అవకుండా."

"వంశీ!" ఆమె కళ్ళు వర్షించే మేఘంలా ఉన్నాయి.

"అలా అనకు నాన్నా! నీకు కావాలంటే నాన్ననే తెచ్చుకుందాం"

"మనం పిలిస్తే వస్తారా?"

సమీర మౌనంగా తలూపింది.

"దేవుడు పంపిస్తాడా!"

"తప్పకుండా!"

"అయితే నేను వెళ్ళను. నాకు నాన్న కావాలి."

సమీర కొడుకు మాటలకు తృప్తిగా నవ్వింది. ★

# మీకేం కావాలి?



నవంబరు 'చతుర' ముద్రణలోని కొత్తదనాని
కి తమ హర్షామోదాలు వ్యక్తంచేస్తూ పాఠకు
లు రాసే లేఖలు ఇప్పటికే చాలా అందాయి.
మాకు అమిత సంతోషదాయకమైనది మీ ఈ
ఆసక్తిపూర్వక ఆదరణే!

ఈ సందర్భంగా పాఠకులు గుర్తించవల
సిన ఒక ముఖ్యవిషయం ఏమంటే, 'చతుర'
మీకు ప్రతినెలా **100** పేజీల సమగ్ర నవల
ను అందిస్తోంది. ఆ **100** పేజీల నవలనే
ఈ నూతన విధానంవలన డిసెంబరులో
ఇంకా తక్కువ పేజీలలోనే అందించగలి
గాం.

ఈ టైపు, ఈ పద్ధతి మీకెలా వుంది?
'చతుర'కు ఈ విధానంవలన లభించిన
అవకాశంతో ఇంకా పెద్ద నవలలు రావాలని
కోరుకుంటున్నారా? లేక ఇప్పుడున్న సైజు
నవలల్నే ప్రచురిస్తూ, అదనంగా మరిన్ని
ఫీచర్లు ప్రచురిస్తే బాగుంటుందనుకుంటు
న్నారా?

మీ అభిప్రాయాలను తెలుపుతూ సవివ
రంగా రాయండి.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500482



# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురలో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. **"చతుర సమీక్ష"** శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. **'చతుర సమీక్ష'** కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **"చతుర సమీక్ష"** కు అని పేర్కొనాలి.

మాకు అందిన పాఠకుల సమీక్షలలో ఉత్తమమైనవిగా మేము ఎంపికచేసిన మూడింటిని ప్రచురించి రు. 100, రు. 75, రు. 50 చొప్పున నగదు బహుమతులు పంపగలం.

ఇక విరివిగా పాల్గొని ఈ శీర్షికలో బహుమతులు అందుకొనేవంతు పాఠకులదే!

---

## కూపన్

**డిసెంబరు 'చతుర' నవల : ముగింపు**

**సమీక్షకుని పేరు** ..............................................

**చిరునామా** ..............................................

..............................................

..............................................

ఈనాడు

# భాషాస్వరూపం

మాతృభాషలో మాట్లాడేటప్పుడు పామరులు కూడా తప్పులు పలకరుగాని రాసేటప్పుడు పండితులు కూడా తప్పులు రాయవచ్చు. ఎందువల్ల ?

మాట్లాడేటప్పుడు భాషకు హావభావాలు, అంగవిన్యాసం లాంటివి తోడ్పడతాయి. రాసేటప్పుడు ఈ సాధనాలుండవు. కనక విస్పష్టంగా, నిర్దుష్టంగా రాయాలంటే భాషకు ఒక ప్రమాణం ఉండాలి. పత్రికా భాషకు అలాంటి ప్రమాణం ఏర్పరచిన పుస్తకం ''*ఈనాడు భాషాస్వరూపం*''.

పత్రికల్లోనూ ఇతర వ్యావహారిక రచనల్లోనూ సామాన్యంగా కనిపించే తప్పులు పరిశీలించి అవి దొర్లకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు వివరిస్తూ ప్రముఖ భాషా శాస్త్రవేత్త డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ రచించిన పుస్తకమిది.

ఇది పత్రికా రచయితలకేకాక, ప్రజలకు అర్థం అయ్యేలాగా రాయాలని, తమ భావాలు స్పష్టంగా ఎదుటివారికి అందజేయాలనీ ఆశించే వారందరికీ ఉపయోగపడుతుంది.

వెల రు. *25.00*

ఎం.ఓ. ద్వారాగాని, డి.డి.ద్వారాగాని ఈ మొత్తం పంపి ఈ పుస్తకాన్ని రిజిస్టరు పోస్టు ద్వారా పొందవచ్చు.

**ప్రతులకు:**

ఉషోదయా పబ్లికేషన్స్

ప్రయివేట్ లిమిటెడ్

ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా,

హైదరాబాద్ – 500 004.

# కాలక్షేప కథారచయిత్రి

ఆంగ్లంలో వెలువడే కొన్ని భారతీయ సినిమా పత్రికలలో సినిమాలకు సంబంధించిన సమాచారంకంటే, సినీతారల వ్యక్తిగత జీవితాల గురించి ఏవేవో రాసే కాలక్షేపం రాతలే (గాసిప్స్) ఎక్కువగా వుంటాయి. ఆ విధంగా పత్రిక అమ్మకాలు పెంచుకోవడం వారిధ్యేయం! సాధారణంగా సినీ ప్రేక్షకులకి తమ అభిమానతారల వ్యక్తిగత జీవితంపట్ల ఆసక్తి అధికంగానే వుంటుంది. వారిలోని ఆ బలహీనతను సొమ్ము చేసుకోవడం ఆయా పత్రికలకి, ఆ విధమైన కాలక్షేప కథలు సృష్టించే రచయితలకి అలవాటు.

ప్రస్తుతం 'స్టార్‌డస్ట్' పత్రికా సంపాదకురాలు 'ప్రోచీ బాదుషా'కి కాలక్షేప కథారచయితల్లో ప్రముఖ స్థానమే వుంది. బొంబాయిలోని పొద్దార్ కాలేజీలో బి.కాం పూర్తి చేశాక ఆమె గోద్రెజ్ కంపెనీలో ఉద్యోగంలో చేరింది. అందులో వచ్చే జీతం, ఇతర సౌకర్యాలు బాగానే వున్నా అక్కడ 'ఉద్యోగిని' తనొక్కతే కావడంతో బోరెత్తిపోయి కొన్ని నెలల్లోనే ఆ వుద్యోగం మానేసింది. అప్పుడే 'స్టార్‌డస్ట్' పత్రికకి ట్రెయినీ సబ్ ఎడిటర్ కావాలనే ప్రకటన కంటబడి వెంటనే దరఖాస్తు చేసి ఆ వుద్యోగం సంపాదించుకుంది ప్రోచి.

"గాసిప్స్ రాయడం అంటే నాకిష్టం. మేము విశ్వసనీయవర్గాల ద్వారా తెలిసిన కథలనే రాస్తాము. ఎవరి గురించి రాస్తున్నామో వారి దగ్గర ఆ విషయం గురించి నిర్ధారించుకోవడానికి ఎక్కువగా ప్రయత్నిస్తాము కాని, చాలా సందర్భాలలో అది సాధ్యపడదు.

చివరకి బిచ్చగాళ్ళలో కూడా అమితాబ్ బచ్చన్ అభిమానులుంటారు. అందరికీ తమ అభిమాన తారల గురించి మరింత తెలుసుకోవాలనే ఆసక్తి సహజం. మేము ఆ ముచ్చట తీరుస్తాము. అయితే గాసిప్ రైటింగ్ మామూలు రచనకన్నా కష్టమైన వ్యాసంగమే కాక అందులో వుండే గండాలూ ఎక్కువే.

ప్రముఖ వ్యక్తులకి వ్యక్తిగత జీవితం వుండరాదని నేననను. సినీహీరోలు రహస్యమనేది లేకుండా పరాయి ఆడవాళ్ళతో చెట్టాపట్టాలేసుకుని బహిరంగంగా తిరుగుతుండగా, అదే మేము రాస్తే తప్పేమిటి? అవేమీ మేము పరిశోధించి, సృష్టించి రాసే రాతలు కాదు! మేము వాస్తవంగా కళ్ళెదుట జరుగుతున్నదే రాస్తాము.

కొన్నాళ్ళక్రితం మేము ఓ దక్షిణాది నటి వివాహం, విడాకుల ఉదంతాన్ని ప్రచురించాము. మాకు ఆ సమాచారం అందించిన వ్యక్తి ఆ నటికి చాలా గాఢ స్నేహితురాలు. తర్వాత మాకు ఆ విషయం గురించి ఇంటర్వ్యూ ఇచ్చేందుకు

ఆ నటి ఒప్పుకుంది. కాని, ఇంటర్వ్యూ మద్రాసులోనే ఇస్తానని షరతుపెట్టింది. దానికోసం మేము బొంబాయి నుంచి ఓ విలేకరిని మద్రాసు పంపితే ఆ నటి వెంటనే ఇంటర్వ్యూ ఇవ్వకుండా, వాయిదా వేస్తూ వచ్చింది. తర్వాత మాకు ఆ నటి విడాకుల వైనం అప్పటికే స్థానిక పేపర్లన్నీ రాసేసినట్టు తెలిసింది. ఆమె కావాలని మా విలేకరిని తిప్పించి మాపై బదులు తీర్చుకుందన్న మాట!

మాకు ఎవరితోనూ నేరుగా గొడవ లుండవు. ఏవైనా వస్తే అవి కోర్టుల ద్వారా పరిష్కరించుకునేవే. నన్ను, మా పత్రికను మొట్టమొదట కోర్టుకి లాగింది కపాడియా సోదరులు. డింపుల్, విజయేంద్రల ప్రేమ వ్యవహారాన్ని ప్రచురించినందుకు మమ్మల్ని ఇబ్బంది పెట్టేందుకై వారు రెండు వేర్వేరు కోర్టుల్లో దావా వేశారు. అప్పట్లో శ్రీమతి ఉమారావు 'స్టార్‌డస్ట్' సంపాదకురాలు. దావా నడిచినంత కాలమూ మేమిద్దరం ప్రతి వాయిదాకు కోర్టులో హాజరయేవాళ్ళం. కాని కపాడియాసోదరులు అలా హాజరవక పోవడంతో సహజంగానే ఆ దావాను కొట్టేశారు.

నేను డబ్బుకోసం గాసిప్స్ రాయను. మరోమాటలో చెప్పాలంటే, నాకు డబ్బిచ్చి ఎవరూ మరొకరిపై గాసిప్ రాసేట్టు చేయలేరు. ప్రస్తుతం నేను పత్రిక సంపాదకురాల్ని. కింది వుద్యోగులకి నా అండదండలు ఎప్పుడూ వుంటాయి. నాకంటే ముందున్న మా సంపాదకురాలు నాకు అండగా నిలిచినట్టే నేనూ నా జూనియర్లకు తోడుగా వుంటాను. 'స్టార్‌డస్ట్'లో గాసిప్‌తోపాటు మంచి రచనలకి స్థానముంది. ప్రతి సంచికలోనూ అలాంటి రచన ఏదో ఒకటి వుంటూనే వుంటుంది" అంటూ ముగించింది ప్రోచిబాదుషా!

ఒబెరాయ్ హోటల్లో ఎకౌంట్సు డిపార్టుమెంటులో వుద్యోగిఅయిన జ్యోతి వెంకటేష్ ఫ్రీలాన్సర్‌గా వివిధ సినిమా పత్రికలకి రాస్తుంటాడు. "స్వంత పేరుతో గాసిప్ రాయడానికి ధైర్యంకావాలి" అనే అతను మొదట 1975లో 'ఈవెనింగ్ న్యూస్' పేపర్‌కి గాసిప్ రాయడంతో ప్రారంభించాడు. మొదట్లో అతను విక్రమ్, శైలేంద్ర, జితేంద్రలాంటి ఆనాటి చిన్న తారలపై రాసేవాడు.

"చాలామంది తారలు నాతో బాగా మసులుతూ, తమ కార్లలో నన్ను ఇంటి వరకూ వదులుతుంటారు. కాని, కొందరు తారలు కావాలని నేనెవరో తెలియనట్టే ప్రవర్తిస్తారు. ఈ రంగంలో సినిమాలు హిట్టయినట్టు, ఎవరైనా రాసింది పేలితే చాలు, తారలదృష్టి వారిపై పడుతుంది. వారికి హఠాత్తుగా ఎక్కడలేని గుర్తింపూ, ప్రాముఖ్యతా వచ్చేస్తుంది"

"గాసిప్స్ నేను రాయకపోతే, మరొకరు రాసేందుకు సిద్ధంగా వుంటారు. గాసిప్స్ కాకుండా మామూలుగా పని కొచ్చేవి ఎందుకు రాయరు? అని మమ్మల్ని కొందరు ప్రశ్నిస్తారు. ఆ ప్రశ్న ముందు సంపాదకుల్ని అడిగితే బావుంటుందని నా సలహా. నా పేరు పాఠకులు మర్చిపోకూడదనుకుంటే నేను గాసిప్స్ రాయక తప్పదు.

"మేము రాసే గాసిప్స్ చదివిన సినిమాతారలు ఒక్కొక్కరూ ఒకో రకంగా మాతో ప్రవర్తిస్తారు. నిజానికి ఇదో వినోదకాలక్షేపం! గాసిప్స్ రాసేటపుడు అసభ్యతకు చోటులేకుండా భాష

విషయంలో చాలా జాగ్రత్తపడాలి.

"ఓసారి నేను 'ఫెమీనా' కోసం ఓ ప్రముఖ హాస్యనటుడిని ఇంటర్వ్యూ చేశాను. అప్పుడతను తనకు పెద్దపెద్ద ఎస్టేట్లు, ఫేక్టరీలు వున్నట్టు చెప్పుకున్నాడు. అది ప్రచురితమైన నాలుగు నెలల తర్వాత ఆ హాస్యనటుడు 'ఇంటర్వ్యూలో నా ఆస్తి గురించి వివరాలు నీకెప్పుడు చెప్పా'నని దబాయిస్తూ నాకో నోటీసు పంపాడు. అసలు జరిగిందేమంటే, పత్రికలో వచ్చిన ఇంటర్వ్యూను ఆదాయపుపన్ను శాఖవాళ్లు చదివి, అతని ఇంటిమీద దాడిజరిపారట. మా వృత్తిలో ఇలాంటి వింత సంఘటనలు కూడా ఎదురవుతుంటాయి" అని చెబుతున్నాడు జ్యోతివెంకటేష్.

మొదట్లో 'స్టార్‌డస్ట్'లో రాసిన ఆభా కపూర్ ప్రస్తుతం 'సినీబ్లిడ్' పత్రికకి రాస్తోంది. గాసిప్ రచయిత్రిగా ఆమె పాఠకులకి సుపరిచితురాలు. 'ఫ్రీప్రెస్ జర్నల్'కి రాస్తూ పాత్రికేయవృత్తి చేపట్టిన ఆభాకపూర్ తర్వాత కొన్నాళ్లు మద్రాసునుంచి వెలువడే 'హిందూ' పేపర్‌కి రాసింది. 1976లో 'ది స్టేట్స్‌మన్'లో 'ఆడమ్ అండ్ ఈవ్' అనే శీర్షికను నిర్వహించింది.

"మొదట్నుంచీ నాకు గాసిప్ రాయడమంటేనే ఇష్టం. ఒక్క నాకేమిటి, ప్రతి స్త్రీకి... ఆ మాటకొస్తే మనుషులందరికి ఇలాంటి కథలపై కుతూహలం సహజంగానే వుంటుంది. సినిమా గాసిప్స్ రాయక ముందు నేను రాజకీయాలకు సంబంధించిన గాసిప్ రాసేదాన్ని. నేను రాసేటపుడు పాఠకుల్ని దృష్టిలో పెట్టుకుని రాస్తాను. నాకు కావలసినవాళ్లు పాఠకులే తప్ప తారలు కాదు.

"నేను హాయిగా కాపురం చేసుకుంటున్న గృహిణిని. కనుక భార్యాభర్తల మధ్య కలతలు రేపే వాళ్ళెవరూ నాకు నచ్చరు. అందుకే నేను ఎవరైనా పెళ్ళయిన నటుడు లేదా నటి తోటి నటీనటులతో వ్యవహారం నడుపుతుంటే బట్టబయలు చేస్తాను. నేను డబ్బుకోసం రాయటం లేదు. నా భర్త వ్యాపారంలో సంపాదించేదే మాకు ఎక్కువ. గాసిప్స్ రాయడంలో నాకు ఆనందముందిగనక రాస్తాను. నాకు ఇలా రాయడంలోతప్పేమీ కనబడదు" అంటుంది ఆభాకపూర్.

గాసిప్స్ రాసేవారి అభిప్రాయాలు ఇలా వుండగా వాటిపై తారల వ్యాఖ్యానాలు మరోవిధంగా వున్నా[illegible] ఈమధ్య స్మితాపాటిల్‌పై గా[illegible] ఎక్కువగా వచ్చాయి.



"సరదాగావుంటే గాసిప్‌ని మేమూ అంతగా పట్టించుకోం... పైగా నవ్వుకుంటాం. జీవితంలో హాస్యం కూడా ఓ భాగమే కదా! కాని, ఈ మధ్య గాసిప్స్ మరీ దరిద్రంగా రాస్తున్నారు. తారలను

అవమానిస్తున్నట్టు రాసే ఆ రాతలు, సున్నితమైన కళాకారుల మనసుకి ఎంత కష్టం కల్గిస్తాయో వారికేం తెలుసు? కుటుంబాల్ని విచ్ఛిన్నం చేసే ఆ విధమైన గాసిప్స్‌ని ప్రోత్సహించగూడదు" అంటుంది స్మితాపాటిల్.

"ఉదాహరణకి – రీనారాయ్ గురించి, ఆమె వేషాలిమ్మని నిర్మాతల వెంట బడుతుందనే రీతిలో, నానారకాల గాసిప్స్ వచ్చాయి. కాని, వాస్తవానికి ఆమె నిజాయితీగా మసులుకుంటూ, తన పాత్ర పోషణకై ఎంతటి శ్రమకైనా సిద్ధపడే నటి! ఈ సినిమా రంగంలో అరుదైన అలాంటి నటి వేషాలకోసం ఎవరినీ అడుక్కోనవసరం లేదు. నేను సినిమా పత్రికలను కొననే కొనను! బ్యూటీ పార్లర్‌కి వెళ్ళినపుడు ఎపుడైనా వాటిని తిరగేస్తానంతే"

"పరిశ్రమకి చెందినవారే గాసిప్ రచయితలకి కథలు అందిస్తారనేవాదనతో నేను ఏకీభవిస్తాను. కొంతకాలం కిందట నేను 'లోనావాలా హిల్ స్టేషన్' దగ్గిర 'దర్ద్‌కా రిస్తా' సినిమా షూటింగులో పాల్గొన్నాను. అపుడు నాకు ఓ గాసిప్ రచయిత నుంచి, "ఈ సినిమా అమెరికాలో తీస్తున్నపుడు మీరు షూటింగుకి సరిగ్గా హాజరవకుండా సునీల్‌దత్‌ని తిప్పలుపెట్టారట కదా! అది పేర్కొంటూ సునీల్‌దత్ రాసిన ఉత్తరం నాదగ్గిరుంది" అని బెదిరిస్తూ ఫోన్ వచ్చింది. నేను, "అయితే ఆ వుత్తరాన్ని మీ పత్రికలో ప్రచురించుకొమ్మని నిర్లక్ష్యంగా ఫోన్ పెట్టేశాను. కాని ఆ వుత్తరం ప్రచురితమవలేదు. ఎందుకంటే సునీల్‌దత్ అలాంటి వుత్తరం రాసి వుండలేదు గనక. అసలు నేను ఇబ్బంది కల్పించిందే లేదు గనక... ఇదీ గాసిప్ రచయితల తీరు" అంటూ ముగించింది స్మితాపాటిల్.

గాసిప్స్‌లో ఎక్కువగా దర్శనమిచ్చే నటుడు రాజేష్‌ఖన్నా, "గాసిప్స్ రాసే



వారిని నేనేమాత్రం పట్టించుకోను. వాళ్లు అలా రాయడం ద్వారా అభిమానుల దృష్టిలో మా విలువ తగ్గించవచ్చు ననుకుంటారు. కాని, ఇప్పటి పాఠకులకి గాసిప్ రచయితలు ఎలాంటి బాపతో అర్థం చేసుకునే తెలివి తేటలున్నాయి.

వాళ్ళు రాసేదంతా తప్పని నేను చెప్పను గాని, నేను వాళ్ళని ఖాతరు చేయను. అందుకే గాసిప్ రచయితలు వారిలో ఎక్కువ మంది ఆడవాళ్ళే నాపై కోపంతో నామీద ఎన్నో రకాల పుకార్లు వ్యాపిజేస్తారు. వాళ్ళంటే నాకసహ్యం" అంటాడు.

సల్మా ఆగా, గాసిప్స్‌కి బలిఅయిన మరో తార. "ఎవరి మనసుకీ కష్టం కలగకుండా, సరదాగా రాసే గాసిప్స్ బాగానే వుంటాయి. కాని, ఇప్పుడే పత్రికలోనూ అలాంటి గాసిప్ వుండటం లేదు. నాగురించి రాసే రాతలకి నేను బాధ

పడను. ఇతరుల గురించి రాసినట్టు తెలిసినప్పుడే నాకు ఆ తారల పట్ల జాలి కలుగుతుంది. మాటలతోగాని, రాతలతోగాని ఎవరి మనసునీ గాయపరచరాదని నా అభిప్రాయం. నేను సినిమా పత్రికలేవీ చదవను. నామీద గాసిప్స్ రాసినపుడు ఎవరైనా వచ్చి చెబితేనే నాకు ఆ సంగతి తెలుస్తుంది" అంటుందామె.

గాసిప్ రచయితల పాలబడ్డ మరో నటుడు అమోల్ పలేకర్-

"నిరాశా, నిస్పృహలకు లోనయిన వాళ్లే ఇలాంటి గాసిప్‌రాతల్లోకి దిగుతారు. అవి రాసేవారి మనస్తత్వాన్ని లోతుగా పరిశీలిస్తే వాళ్ళు ఒకానొకప్పుడు ఏదో సాధించే ప్రయత్నం చేసి, దాంట్లో ఘోరంగా విఫలమై, ఇలా తయారయ్యారని తెలుస్తుంది. మాలాంటి విజయపంతమైన వ్యక్తుల స్థాయిని తమ రాతల ద్వారా దిగజార్చడమే వారి ధ్యేయం! వారికి మర్యాదకి అర్థమే తెలియదు. నేను నా భార్య చిత్ర రోజంతా పోట్లాడుకుంటూనే వుంటామని, విడిపోయామని, విడాకులు తీసుకున్నామని ఇలా హద్దనేది లేకుండా గాసిప్స్ గుప్పించారు. వాళ్ళు రాసినదంతా అబద్ధమని స్పష్టంచేసే శ్రమ నేను పడలేను. నాకా తీరిక లేదు. గాసిప్ రచయితలు వాస్తవానికి, హాస్య ప్రియత్వానికి ఎంతో దూరంగా వుంటారు. వారి మెదళ్ళు వికృతంగా మలచబడ్డాయి" అంటాడు.

మిథున్‌చక్రవర్తికూడా గాసిప్ రచయితల బాధితుడే! "నేను గాసిప్స్‌ని ఏ మాత్రం ఇష్టపడను. మేము నటించిన సినిమాలు, వాటిలో మా పాత్రల గురించి పత్రికలలో రాయడం బాగానే వుంటుంది. అంతేగాని, మా వ్యక్తిగత జీవితాలను రచ్చకెక్కిస్తే నేను సహనాన్ని కోల్పోతాను. మేము మనుషులం కాదా? మా ఇష్టప్రకారం బతికే హక్కు మాకు లేదా?



నాపైనే కాదు... తోటి తారలపై గాసిప్స్ రాసినా నాకు నచ్చదు" అంటాడతను.

మరో నటిపద్మినీకొల్హాపురి, "మొదట్లో నాకు గాసిప్ రాతలు సరదాగా వుండేవి. కాని, ఇపుడు మాపై రాసే గాసిప్స్ చాలా అమర్యాదకరంగా వుంటున్నాయి. మేము చేసే మంచి లేదా చెడ్డ పనులు ఇతర రంగాల్లోనివారూ చేస్తుండగా, కేవలం మా సినిమావాళ్ళ గురించే విడ్డూరంగా రాస్తారెందుకు? అందుకే నాకు గాసిప్స్ అన్నా, అవి రాసేవాళ్లన్నా అసహ్యం" అంటుంది!

—జాస్తి శ్రీకృష్ణ వరప్రసాద్




## అతని కృషి

కాన్పూర్‌కి చెందిన హర్మిందర్‌సింగ్ తన విశేష కృషి ద్వారా హిందీ చిత్ర అభిమానుల, విమర్శకుల ప్రశంసలకి పాత్రుడయాడు. అతను హిందీ చిత్ర గీతాల ఎన్‌సైక్లోపీడియా ప్రచురించే పథకాన్ని చేపట్టి, ఇటీవలే కొత్తఢిల్లీలో ప్రత్యేకంగా జరిగిన ఓ ఉత్సవంలో పాత తరానికి చెందిన సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్‌తో 4వ సంపుటినివిడుదల చేయించాడు.

హర్మిందర్‌కి రేడియో సిలోన్‌లో ప్రసారమయ్యే చిరస్మరణీయమైన పాత హిందీ చిత్రాల పాటలను ఓ పుస్తకంలో రాసుకునే హాబీ వుండేది. అనేక మంది సంగీతప్రియులు పాత హిందీ చిత్రాలలోని మధురగీతాలను అమూల్యసంపదగా భావిస్తారు. వాటికి కూర్చిన అతిచక్కని బాణీలు, వాటిలో వుండే అర్థవంతమైన కవిత్వంతో అవి ఇప్పటికీ నిత్య నూతనంగా, హాయిగా వుంటాయి.

అందుకే, కాలేజీలో చదువుకునే రోజులనుండీ పాత పాటల్ని ఇష్టపడే హర్మిందర్‌సింగ్ 1931-70 మధ్య కాలంలో వచ్చిన సినిమా పాటలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి ప్రచురింపజేయాలని నిర్ణయించుకున్నాడు. అలా అతను 14 ఏళ్లపాటు కృషి చేసి ఇప్పటికి 3 సంపుటాల్ని తెగలిగాడు.

1931లో విడుదలైన మొదటిభారతీయ టాకీ సినిమా 'ఆలం ఆరా'లో వజీర్ మహమ్మద్ ఖాన్ పాడిన పాటే మొట్టమొదటి భారతీయ చిత్ర గీతమంటారు. అప్పటినుంచి నాలుగుదశాబ్దాలలో-అంటే 1970 నాటికి రచించి, గానం చేసిన సినిమా పాటలు అసంఖ్యాకంగా వున్నాయి. ఆ 40 ఏళ్లలో నిర్మించిన దాదాపు 4,500 హిందీసినిమాలలో ప్రతి చిత్రంలోని, ప్రతి ఒక్క పాటవివరాలూ సేకరించటం ఎంతో కష్టసాధ్యమైన విషయం. అందుకని హర్మిందర్ సులువు కోసం ఆదీర్ఘకాలాన్ని 4 భాగాలుగా విభజించాడు. ఆవిధంగా అతను1941నుంచి 50 వరకు, 1951నుంచి60వరకు వచ్చిన

సినిమా పాటలతో 2 సంపుటాల్ని ఎప్పుడో ప్రచురించాడు. ఇటీవల ప్రచురించిన 1961నుంచి70కి చెందినసంపుటి మూడోది. అతను త్వరలోనే1931 నుంచి 40కి చెందిన సంపుటాన్నే గాక కొత్తగా 1971 నుంచి 80 మధ్య పాటలుగల సంపుటాన్ని కూడా ప్రచురించే ఆలోచనలో వున్నాడు.

1961-70కు చెందిన 660 పేజీల సంపుటిలో 1,007 చిత్రాలలోని 7వేల పాటల వివరాలున్నాయి. 1951-60 సంవత్సరాల 3వ సంపుటిలో ఆమధ్య కాలంలో విడుదలైన చిత్రాల్లోని10,163 పాటలున్నాయి. 1941 నుంచి50 మధ్య కాలంగాగల 2వ సంపుటిలో 1,236 చిత్రాలకు చెందిన11 వేలపాటలున్నాయి.

1931-40లో వచ్చిన సినిమాల పాటలను సేకరించటం హర్మిందర్‌కి ఓ సవాలుగా నిలిచింది. అప్పట్లో భారతీయ సినిమా, అందులో సంగీతం ప్రాథమిక దశలో వున్నాయి. ఆకాలంలో వచ్చిన అనేక పాటల్ని గానంచేసినవారెవరో, సంగీత దర్శకులెవరో తెలుసుకోవటం దాదాపు అసాధ్యం. భారతీయ సినీసంగీత చరిత్రలో ఆకాలంస్వర్ణయుగంగావర్ణింపబడినా, సంగీత దర్శకులకి గాయకులకి అప్పట్లో అంతగా ఫలితం దక్కేదికాదు.

హర్మిందర్ వెలువరించిన సంపుటాల్ని పరిశీలిస్తే వాటి గురించి అతను పడిన కఠోర శ్రమ అర్థమవుతుంది. విడుదలైన ప్రతి చిత్రంలోని ఏఒక్కపాటనూ వదలకుండా సేకరించటానికి ఎంతో ఓపిక కావాలి. వాటి వివరాలు సేకరించేందుకు హర్మిందర్ దేశంలోని ప్రధాననగరాలన్నిటికి తిరగవలసి వచ్చింది. అతను పాటల పుస్తకాలను సేకరించాక, దొరికిన రికార్డుల్లో పాటలు విని రెండింటినీ సరిపోల్చుకుంటూ, రాసిన పాటకీ రికార్డయిన పాటకీ మధ్య తేడా వుందో లేదో చూసుకునేవాడు. దానితోపాటు గాయకులు, సంగీత దర్శకుల పేర్లు మొదలగు వివరాలు గమనించేవాడు.



హర్మిందర్ వెలువరించిన సంపుటాల్ని పరిశీలించటం ద్వారా హిందీ చిత్ర సంగీతంలోని మధురిమ కాలక్రమంలో ఎలా కొరవడుతున్నదో అర్థంకాగలదు.

# మృతుల బ్యాంకు

**1968** జూలై 28న ఏరోనాటికల్ ఇంజనీరైన 28 ఏళ్ళ స్టీవెన్ మాండిల్ పేగులకు సంబంధించిన వ్యాధితో కొలంబియాలోని ఓ ఆస్పత్రిలో మరణించాడు. అయితే ఆ శవాన్ని సమాధి చేసి లేదా దహనంచేసి అంత్యక్రియలు జరపలేదు. అతను ముందుగానే కోరినట్టు అతని మృతదేహాన్ని పాడవకుండా భద్ర పరిచారు.

స్టీవెన్ చనిపోవడానికి ఆరు నెలల ముందు 'క్రియోనిక్స్ సొసైటీ'లో సభ్యుడయాడు. "వైద్యశాస్త్ర పురోగతి భవిష్యత్తులో ఏ జబ్బునైనా నివారించే దశకి చేరుకుంటుందనీ, ఏదో వ్యాధితో మరణించిన వారిని అప్పటివరకూ భద్రపరిస్తే, తిరిగి బతికించవచ్చనీ" ఆసంఘం నమ్ముతుంది. స్టీవెన్ చనిపోయిన వెంటనే మృతదేహాన్ని ఓ పెద్ద ఫ్రీజ్‌లోకి మార్చి, క్రియోనిక్స్ సొసైటీ అధికార్లకు తెలియజేశారు. వాళ్ళు స్టీవెన్ మృతదేహాన్ని లేబొరేటరీకి తీసుకెళ్ళి సిరలద్వారా మృతదేహంలోకి కొన్ని రసాయనాలను ఇంజెక్ట్ చేశారు. తర్వాత మృతదేహాన్ని చల్లబరిచి గాలి చొరని శవపేటికలో పెట్టారు. ఓ నెల తర్వాత స్టీవెన్ మృతదేహాన్ని నైట్రోజన్ ద్రవం, 321 డిగ్రీల శీతోష్ణ పరిమాణంతో నింపిన 10 అడుగుల పొడుగాటి 'కేప్సూల్'లో వుంచారు. ఆ కేప్సూల్‌కి అప్పుడప్పుడూ నైట్రోజన్ ద్రవాన్ని సరఫరా చేస్తారు. దానికయ్యే ఖర్చు 10 వేల రూపాయలూ క్రియోనిక్స్ సొసైటీయే భరిస్తుంది.

మృతదేహాల్ని భద్రపరిచే వ్యవహారం చాలా పురాతనమైనదే అయినా పాశ్చాత్య దేశాలలో క్రియోనిక్స్ వుద్యమం దానికి కొత్త రూపునిచ్చింది. అమెరికాకి చెందిన ప్రముఖ క్రియోబయాలజిస్ట్ డాక్టర్ జె.కె. షార్మన్, "నేడు మానవ రేతస్సు, రక్తం, టిస్యూలను భద్రపరిచే బేంకులు సర్వసాధారణమయ్యాయి. అలాగే ముమ్ముందు ఈ మృతదేహాల బేంకులు పెరుగుతాయేమో చూడాలి. ఎంతమంచి రసాయనాలను వుపయోగించినా మానవ మూత్రపిండాల్ని 24 గంటలకి మించి చెడిపోకుండా భద్రపరచలేమనిరుజువయింది. అందువల్ల ప్రస్తుతం మృతదేహాల్ని శాశ్వతంగా భద్రపరచడం నమ్మలేని సంగతిగా కనబడుతోంది" అంటున్నాడు.

క్రియోనిక్స్ సొసైటీ ఈవిధంగా నేటికి 25 మృతదేహాల్ని భద్రపరచింది. ఆ సంఘ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనే డాక్టర్ ఫ్రెడరిక్ హార్న్ తమ పరిస్థితి ఏమంత ప్రోత్సాహకరంగాలేదని చెబుతున్నాడు. కాని దాని స్థాపకుడైన రాబర్ట్ ఐటింగర్ తమ ప్రయత్నాలకు జయం తథ్యమనే ఆశాభావంతోనే వున్నాడు. 1962లో కొందరి కోసమే ఉద్దేశించి ప్రచురించిన తన పుస్తకం 'ప్రాస్పెక్ట్స్ ఆఫ్ ఇమ్మోర్టలిటీ'లో, ముఖ్యంగా, "ఏదో ఒక జబ్బుతో చనిపోయే చాలామందికి ఇంకా బతికే అవకాశం వుంటుందని, వైద్యశాస్త్రం ఏ వ్యాధినైనా నయం చేసేరోజు ఎంతో దూరంలో లేదని, వారి మృతదేహాలను భద్రపరిస్తే తిరిగి బతకడం సాధ్యమేనని"




పేర్కొన్నాడు. అతను రాసిన ప్రకారం, "చాలా జాగ్రత్తగా భద్రపరిచిన మృత దేహాలను, ఏ జబ్బుతో చనిపోతే దాన్ని నయంచేసి, తిరిగి బతికించవచ్చు" అన్నమాట.

ఆ పుస్తకం ప్రచురితమయాక ఐటింగర్ సిద్ధాంతంపై అనేక వాద ప్రతివాదాలు చెలరేగాయి. అదే సమయంలో క్రియోనిక్స్ సొసైటీ శాఖలు ప్రపంచ మంతటా తెరవబడ్డాయి. 'చావులేదు' అనేది క్రియోనిక్స్ సొసైటీ నినాదం! ఆ సంఘం గుప్త ఫీనిక్స్ పక్షి (500 ఏళ్ళ పైగా బతికి చితిపేర్చుకుని ఆ మంటల్లో కాలి పునర్జన్మ ఎత్తే పక్షిగా 'ఫీనిక్స్' గురించి గ్రీకు పురాణాల్లో పేర్కొంటారు). ఆ సంఘం ప్రచురించే క్రియోనిక్స్ రిపోర్ట్, క్రియోనిక్స్ రివ్యూ, ఇమ్మోర్టలిటీ మొదలగు పత్రికలు వివిధ విషయాలు తెలపడంతోపాటు, తమ కార్యక్రమాని కవసరమైన నిధులకోసం ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేస్తుంటాయి.

ఐటింగర్ పుస్తకం ప్రచురితమయిన 5 ఏళ్ళ తర్వాత 1967లో మొదటిసారిగా మృతదేహాన్ని భద్రపరిచారు. సైకాలజీ ప్రొఫెసర్ డాక్టర్ జేమ్స్ బెడ్‌ఫోర్డ్‌దైన ఆ మృతదేహం ప్రస్తుతం అమెరికాలోని లాస్ ఏంజెల్స్‌లోవుంది. భవిష్యత్తులో ప్రభుత్వ సంస్థలే మృతదేహాల్ని భద్ర పరుస్తాయని ఐటింగర్ ఆశిస్తున్నాడు.

## సుదీర్ఘ నడక

గోవాలో పొండా గ్రామానికి చెందిన 25 ఏళ్ళ కిరణ్ నారాయణ్ మాస్కే కాలినడకన దేశంలోని వివిధ ప్రాంతాలు పర్యటిస్తున్నాడు.

ఇంగ్లాండ్‌లో హేరీ అనే వ్యక్తి

మూడున్నర సంవత్సరాలలో కాలినడకన 35 వేల కిలోమీటర్లు తిరిగి ప్రపంచ రికార్డు సృష్టించాడు. అది తెలిసిన మాస్కో ఆ రికార్డుని అధిగమించాలనే పట్టుదలతో తన సుదీర్ఘ నడక ప్రారంభించాడు. అతను ముందుగా గోవాలో క్రీడా, సాంస్కృతిక మంత్రిత్వ శాఖను సంప్రదించి అవసరమైన సలహాలు పొందాడు. అతనికి భారత రక్షణదళానికి చెందిన కల్నల్ జె.జె. జైన్ నుంచి ఎంతో సహాయం లభించింది.

మాస్కో కాలినడకన దేశమంతటా పర్యటించటం అతని కుటుంబంలో ఎవరికీ ఇష్టం లేదు.

తన సుదీర్ఘ నడకను ప్రారంభించటానికి మూడేళ్ళ ముందే మాస్కో రోజుకి 16 కిలోమీటర్ల దూరం నడిచేవాడు. అప్పట్లో ఆ నడక ఎంతో కష్టంగా వుండేదతనికి. క్రమక్రమంగా దానికి అలవాటు పడ్డాడు. 1982 జూన్ 5వ తేదీన గోవా క్రీడా, సాంస్కృతిక శాఖ డైరెక్టర్ శ్రీమంత్ మస్లి సమక్షంలో తన నడకను ప్రారంభించాడు మాస్కో. అప్పటినుంచి 40 వేల కిలోమీటర్ల దూరం నడిచిన మాస్కో తన లక్ష్యమైన 45 వేల కిలోమీటర్ల దూరాన్ని 1986 సంవత్సరాంతానికి పూర్తిచేయగలనను కుంటున్నాడు.

మాస్కో రాజస్థాన్‌లో బ్యావర్ అనే ప్రదేశానికి చేరుకున్నపుడు భారీ వర్షం పడింది. ఆ రాత్రికి అతను బసచేసేందుకు పోలీస్ స్టేషన్‌కి వెళ్తే, పోలీసు కానిస్టేబుల్ అతన్ని తప్పుగా అర్థం చేసుకుని లాకప్‌లో వుంచాడు. మరుసటి రోజు ఉదయం పోలీస్ ఇన్‌స్పెక్టర్ రాగానే మాస్కో తన ఐడెంటిటీకి, సంబంధించిన కాగితాలు చూపెట్టాడు. ఇన్‌స్పెక్టర్ అవిచూశాక కానిస్టేబుల్‌ని మంద



లించి, మాస్కేకి క్షమాపణలు చెప్పాడు.

ఓసారి గంగోత్రి వద్ద ప్రభుత్వ అతిథి గృహంలో బసచేసిన మాస్కేను అర్ధరాత్రి బైటకు వెళ్ళగొట్టారు. ఓ పేద గిరిజన కుటుంబం ఆ రాత్రి అతనికి ఆశ్రయమిచ్చింది. ఝప్పగూడ అనే చోట మాస్కే వద్దగల డబ్బును దొంగలు దోచుకున్నారు. అతని ఫిర్యాదు రిజిస్టర్ చేసుకునేందుకు స్థానిక పోలీసులు నిరాకరించారు. అప్పుడు రాయగడకు చెందిన కొందరు పాత్రికేయులు అతనికి ఆర్థిక సహాయంచేశారు. ఒకసారి దీపావళిరోజున అహ్మదాబాద్ రైల్వే స్టేషన్‌లో తిండి కవసరమైన డబ్బుల కోసం మాస్కే కూలీగా పని చేయవలసివచ్చింది.

అలా కష్టాలు పడి, ఇబ్బందులు ఎదుర్కొన్న మాస్కే పర్యటనలో కొన్ని ఉత్సాహపరిచే సంఘటనలు కూడా జరిగాయి. అతను కలకత్తా నుంచి అండమాన్, నికోబార్ దీవులకి బైలుదేరినపుడు అక్కడి సుధీర్ ఉపాధ్యాయ అనే పాత్రికేయుడు ప్రయాణానికవసరమైన బట్టలు, బూట్లు, వెయ్యి రూపాయలు నగదూ ఇచ్చాడు. 84 జూన్‌లో మాస్కే సిలిగిరి నుంచి అస్సామ్ వెళ్తుండగా బ్రహ్మపుత్ర నదికి వరదలొచ్చాయి. అప్పుడతనికి స్థానిక పాత్రికేయుడు విప్లవ్‌తాలూక్‌దార్ ఓ నెలపాటు తన ఇంట్లో బసకల్పించాడు. ఆజ్మీర్ నుంచి ఉదయపూర్‌కి చేసిన ప్రయాణంలో అతనికి శంకర్‌షిరోలియా అనే ఐపిఎస్ ఆఫీసర్ తోడుగా నడిచి కంపెనీ ఇచ్చాడు.

మాస్కే తన సుదీర్ఘ నడకలో వివిధ రాష్ట్రాలకు చెందిన స్పోర్ట్స్ డైరెక్టర్ల నుంచి ఆర్థిక సహాయాలు పొందాడు. ఒక రాష్ట్రంలో 500రూపాయలిస్తే మరో రాష్ట్రంలో 1000 రూపాయలిచ్చేవారు. పశ్చిమ బెంగాల్, ఒరిస్సాలలో మాస్కేకి ఆవిధమైన ఆర్థికసహాయం లభించలేదు. అతనికి ప్రభుత్వంకంటే పౌరులే ఎక్కువ ఆర్థికసహాయం అందించారు.

ఉదయం 5 నుంచి సాయంత్రం 6గంటలదాకా సగటున రోజుకి 50 కిలో మీటర్లు నడిచేవాడు మాస్కే. పగలు టీలు మాత్రమే తాగుతూ రాత్రిళ్ళే భోజనం చేసేవాడు.

ప్రస్తుతం తన అనుభవాలన్నిటినీ ఒక డైరీలో రాస్తున్న మాస్కేకి త్వరలో వాటిని ఓపుస్తకంగా రాసే వుద్దేశముంది. ఇంజనీరింగ్‌లో డిప్లొమా తీసుకున్న మాస్కే సుదీర్ఘ నడక పూర్తయ్యాక తనచదువుకు అనుగుణమైన వృత్తిలో స్థిరపడదామనుకుంటున్నాడు. భవిష్యత్తులో ఒలింపిక్స్‌లోని మరాథాన్ పోటీల్లో పాల్గొనటం అతని ఆశయం!

## అల్హాకరమ్

'అల్హాకరమ్' ఈజిప్టులోనే కాక అరబ్ దేశాలలో కూడా ప్రముఖ దినపత్రికగా పేరుపొందింది. అది అరబ్‌దేశాలన్నింటి జనజీవితాన్ని ప్రతిబింబించే వార్తాపత్రిక.

అల్హాకరమ్ అంతర్జాతీయ, జాతీయ, సాంఘిక వార్తలకు సమాన ప్రాధాన్యత ఇస్తుంది. కాని వివిధ వార్తలను ప్రచురించటంలో దానికి పూర్తి స్వేచ్ఛలేదు. ఆమేరకు అల్హాకరమ్‌పై ప్రభుత్వపు అదుపు వుంటటంతో అది ప్రభుత్వ విధాన నిర్ణయాలు మొదలైన వాటి ప్రచురణకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తుంది. అందువల్ల ఈజిప్టులో ప్రభుత్వపు సరికొత్త విధాన నిర్ణయాలను తెలుసుకొనగోరేవారు అల్హాకరమ్‌ని

చదవక తప్పదు.

ఈజిప్టియన్ భాషలో అల్హకరమ్ అంటే పిరమిడ్ అని అర్థం. అందువల్ల ఈజిప్టులో పిరమిడ్లలానే అల్హకరమ్ని కూడా గొప్పగా చూస్తారు.

ఇద్దరు క్రైస్తవులు ప్రభుత్వ అదుపు ఏమాత్రం లేకుండా పత్రికను నడపదలిచి అనుకూలమైన పరిస్థితులు ఈజిప్టులో వున్నాయని భావించి అక్కడనుంచి అల్హకరమ్ను ప్రారంభించారు. ఆ విధంగా 1875 ఆగస్టులో అది వార పత్రికగా ప్రారంభమైంది. అనేక ప్రత్యేక వ్యాసాలతో అది మొదట్లో అలెగ్జాండ్రియా నుంచి వెలువడేది. వార పత్రికగా అధిక పాఠకాదరణ పొందటంతో 1881లో దాన్ని దినపత్రికగా మార్చారు. 1900లో అల్హకరమ్ ప్రధాన కార్యాలయాన్ని అలెగ్జాండ్రియా నుంచి కైరోకి మార్చారు. అది పత్రిక అభివృద్ధికి బాగా దోహదం చేసింది.

అప్పట్లో ఈజిప్టు చాలాకాలంగా బ్రిటీషువారి ఆధిపత్యంలో వుండటంతో అల్హకరమ్ పత్రికాస్వేచ్ఛ కలిగివుండటమనే ప్రసక్తి లేనేలేదు. అందువల్ల అది ప్రభుత్వంతో ఏనాడూ ప్రత్యక్షంగా తలపడేదికాదు. కాని, కార్టూన్లద్వారా ప్రభుత్వానికి చురకలు వేసేది.

1957లో స్వాతంత్ర్యం పొందిన ఈజిప్టుకి నాజర్ అధ్యక్షుడయాడు. అతనూ అల్హకరమ్కి పత్రికాస్వేచ్ఛ ఇవ్వకుండా తన స్నేహితుడు హికాల్ని దానికి సంపాదకుడిగా నియమించాడు. హికాల్ అల్హకరమ్ని ప్రభుత్వానికనుగుణమైన పత్రికగా తీర్చిదిద్దినా అతనికి రచయితగా, పాత్రికేయుడిగా ఎంతో ప్రఖ్యాతివుంది. అతను పత్రికలో అనేకమార్పులు ప్రవేశపెట్టాడు. అతని సంపాదకత్వంలో అనతికాలంలోనే అల్హకరమ్ ప్రపంచంలోని ఉత్తమ పత్రికలలో ఒకటిగా పేరుపొందింది.

నాజర్ సూయజ్ కాలువను జాతీయం చేసినపుడు బ్రిటన్తో యుద్ధంలో తలపడాల్సి వచ్చింది. ఆ సమయంలో అల్హకరమ్ ఈజిప్టు ప్రభుత్వ చర్యలను సమర్థిస్తూ, దేశానికి మంచి అండదండగా నిలబడింది.

నాజర్ మరణం తర్వాత ఈజిప్టుకి అన్వర్సాదత్ అధ్యక్షుడయాడు. కొత్త అధ్యక్షునికీ, అల్హకరమ్ సంపాదకునికీ మధ్య సత్సంబంధాలు ఏర్పడలేదు. ఆ పత్రిక అమెరికా, ఇజ్రాయెల్ మధ్య సయోధ్యకోసం ఈజిప్టు ప్రభుత్వంచేసే ప్రయత్నాలను విమర్శిస్తూ రాసింది. దానివల్ల కొద్దికాలంలోనే హికాల్ సంపాదక పదవిని వదులుకోవలసి వచ్చింది. అప్పటికి అతనా బాధ్యతను 17 ఏళ్ళపాటు నిర్వహించాడు.

అల్హకరమ్కి 14 అంతస్తుల ఆఫీసు భవనం, అత్యాధునిక యంత్రాలూ వున్నాయి. దినపత్రికతో పాటు వాణిజ్య, ఆర్థిక విషయాలతో కూడిన వారపత్రిక, కళలపై మాసపత్రిక శాస్త్రవిజ్ఞానానికి సంబంధించిన త్రైమాస పత్రికకూడా వెలువడుతున్నాయి.

అల్హకరమ్ ప్రస్తుతం స్థానికవార్తలకు అధిక ప్రాధాన్యతను ఇస్తోంది. దానిలో ప్రతి శుక్రవారం స్త్రీలకు ప్రత్యేకించిన పేజీలు వుంటాయి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad - 500 016, TEL: 220728. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 482.

## ఫారెక్స్® తల్లుల మొదటి ఎంపిక!



**పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు తల్లి మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.**

మేలుపర్చబడిన ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు. పెరుగుదలకు అవసరమైన ప్రొటీన్లు, సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు.

రక్త పుష్టికై తగినంత ఐరన్.

గట్టి ఎముకలు, పళ్ల కొరకు 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్.

పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి గల ఫారెక్స్‌ను కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చే అవసరం లేదు.
కేవలం నీళ్లలో
కలిపి ఇస్తే చాలు

**ఫారెక్స్–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd No. H/HD/40

బాంబినో ఒక అద్భుతమైన వెర్మిసెల్లిని. పరిశుభ్రమైన పద్ధతిలో అధునాతన ఇటాలియన్ యంత్రములతో తయారు చేయబడినది. మిక్కిలి ప్రోటీన్లు కలిగి యుండి కొవ్వు పదార్థము లేకుండుటయే బాంబినో విశిష్టత వండినప్పుడు కాని, తరువాత కాని, ముద్దగా కాక పోవుటయే బాంబినో ప్రత్యేకత. నిమిషములలో బాంబినోతో ఎన్నో రకములైన నోరూరించే వంటకాలు, ఫలహారాలు తయారు చేయవచ్చును. ఇంకా బాంబినోతో ఎంతో పొదుపు కూడా. నేడే వాడి చూడండి. మీకే తెలుస్తుంది.



**బాంబినో కట్‌లెట్ :**

5 కప్పుల బాంబినోను ఉడకబెట్టి అరబెట్టి ఉంచండి. కీమాను కూడా ఉడకబెట్టి ప్రక్కన పెట్టండి. ఆరు లవంగాలు, ఏలక్కాయ, వెల్లిగడ్డల 5 పాయలు, అల్లం ముక్కలు దం ముద్ద చేయాలి. కళాయిలో నూనె మరగించి, కీమాను, బాంబినోను మసాల ముద్దను ఈ కళాయిలో వే గరిటతో కలపాలి. తరువాత దీనిని దించి గ్రుడ్డు పచ్చసొన, మొక్కజొ పిండి కలిపి మూడు కట్‌లెట్‌లు చేయండి. తర్వాత దీనిని తెల్లసొన ముంచి రొట్టె ముక్కలు రుద్దిబాగా వేయించండి.



## రుచిలో కమ్మదనం
## ఖర్చులో పొదుపుతనం
## అదే బాంబినో గొప్పతనం

బాంబినో వంటల విధానం తెలిపే పుస్తకం కొరకు వ్రాయండి.

జన జీవన్ ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్
1వ ఫ్లోర్, బషీర్‌బాగ్ ప్యాలెస్, హైద్రాబాద్.

IS 1485



# బాంబినో
# వెర్మిసెల్లిని

తృప్తిగా ఖర్చా అయిన బాంబినోతో రుచే రుచి !





associate